మహిళా ఉద్యమ కరదీపిక

# చైతన్య మానవి



త్రై మాసపత్రిక
అక్టోబర్-డిసెంబర్, 2012

సర్కారు ఇచ్చేది ఆరేనంట !
గృహిణి కంట ఏడుపేనంట !!





# నేటి తరానికి ప్రతీక

# మలాలాయ్ జోయా

మలాలా త్వరగా కోలుకోవాలి, ఆమె ఆశయం నెరవేరాలి. ఆమె మరెందరికో స్ఫూర్తి కావాలని చైతన్య మానవి హృదయపూర్వకంగా ఆకాంక్షిస్తోంది.

"నా చదువుకునే హక్కును చిదిమేయడానికి తాలిబాన్లకు ఎన్ని గుండెలు?" ప్రశ్నించిందో పదకొండేళ్ళ పసిహృదయం. 2009లో పాక్ తాలిబన్‌గా పిలిచే, తెహ్రికె తాలిబన్ పాక్' మిలిటెంట్లు స్వాత్ లోయ అంతటా బాలికల విద్యను నిషేధించారు. అప్పుడా పిల్ల బడికి పోవడానికి భయంతో వణికింది. పీడకలలు కంది. కాని బడి మానలేదు.

"ముస్లిం దేశాలలో ఆడపిల్లగా పుట్టినందుకు చదువుకోకూడదా"?అని ప్రశ్నించింది. ఈ వివక్ష వీడాలని గళం విప్పింది. తోటి విద్యార్థినులకు సైతం ధైర్యాన్ని నూరిపోసింది. ఎట్టి పరిస్థితుల్లోనూ మనం చదువుకొని తీరాలని పదే పదే చెప్పింది. విద్య కోసం, ప్రపంచంలో శాంతి నిండాలనే ఆకాంక్షకు బాసటగా నిలిచిన మలాలా పేరు దేశమంతటా మారుమ్రోగింది. మలాలాకు జాతీయ, యువజన శాంతి పురస్కారం లభించడంతోపాటు అంతర్జాతీయ బాలల శాంతి బహుమతికి సైతం మలాలా నామినేట్ చేయబడింది.

ఇవన్నీ ఉగ్రవాదుల గుండెల్లో రైళ్ళు పరుగెత్తించాయి. మలాలాను హతమార్చాలని పన్నాగం పన్నారు. అక్టోబరు 9న స్వాత్ లోయలోని మెంగోరా పట్టణంలో స్కూల్ బస్సులో వున్న మలాలాపై దాడి చేసి అత్యంత దారుణంగా కాల్పులు జరిపారు. ఈ దాడిలో మలాలాతోపాటు మరో ఇద్దరు బాలికలు గాయపడ్డారు. మలాలా తలకు తీవ్ర గాయాలయ్యాయి. ఆందోళనకరంగా వున్న మలాలాను వెంటనే స్థానిక ఆసుపత్రిలో చేర్చారు. 3గంటలపాటు శస్త్ర చికిత్స చేసి వెన్నుపూస పక్కన దిగబడిన తూటాను తీసారు. అయినా మలాలా పరిస్థితి నిలకడగా లేదు. శస్త్ర చికిత్స సమయంలో తీవ్ర రక్తస్రావమైంది. మలాలా కోలుకోవాలని ప్రపంచమంతా కోరుకుంటుంది. ప్రార్థనలు, ప్రదర్శనలు చేస్తున్నారు.

మలాలాపై దాడిని అన్ని రాజకీయ పార్టీలు, ప్రముఖులు, సంస్థలు ఖండించాయి. ఉగ్రవాదాన్ని మట్టుబెట్టుడానికి అందరూ ఏకం కావలసిన సమయం ఆసన్నమైంది.

మలాలా ధైర్య సాహసాలు, త్యాగ నిరతి వృధా కావు. పాక్ చరిత్రలో ఒక ఉజ్వల అధ్యాయానికి నాంది పలుకుతాయి.

- మానవి డెస్క్



# "వంటింట్లో సంక్షోభం"

చైతన్య మానవి

## సంపాదకీయం...

చుక్కలనంటుతున్న నిత్యావసరాల ధరలతో విలవిలలాడుతున్న ఇల్లాలికి ప్రభుత్వం తాజాగా మరో పెద్ద షాక్ ఇచ్చింది. వంటగ్యాస్ సబ్సిడీకి మంగళం పాడి, వంటింట్లో మంట పెట్టింది. ఇక వంట వండాలంటే కంటతడి పెట్టాల్సిందే. డీజిల్ ధర భగ్గుమనటం, కరెంట్ చార్జీల వాతలు, కోతలతోపాటు నీటిపన్ను, ఆస్తిపన్నుకు తోడు గ్యాస్‌బండ కుదింపును సామాన్యుడికి పండుగల బొనాంజాగా ఇచ్చింది ప్రభుత్వం.

దీనితో సగటు జీవి బడ్జెట్ అంతా తల్లక్రిందులే.

ప్రతి కుటుంబానికి ఇకపై ఏడాదికి ఆరు సిలిండర్లు మాత్రమే సబ్సిడీ ధరకు ప్రభుత్వం అందించనుంది. అంతకుమించితే మార్కెట్ ధర చెల్లించాల్సిందే. ప్రస్తుతం 420 రూపాయలు ఉన్న సబ్సిడీ గ్యాస్ సిలిండర్ ధర ఏడో సిలిండర్ నుండి 1,000 రూపాయలు చెల్లించాల్సి రావడంతో వంటింట్లో సంక్షోభం మొదలై గ్యాస్ వెలిగేలా లేదు. డీజిల్ ధర పెంపు, గ్యాస్‌పై ఆంక్షలతో రాష్ట్ర ప్రజలపై 9,200కోట్ల రూపాయల భారం అదనంగా పడుతోంది.

ప్రభుత్వ సంక్షేమ పథకాలకు ఇచ్చే గ్యాస్‌కూ ఈ సెగ తగిలింది. సంక్షేమ హాస్టళ్ళు, మధ్యాహ్నో భోజన పథకం, అంగన్‌వాడీ కేంద్రాలు, ప్రభుత్వాసుపత్రులు గ్యాస్ కోతతో అల్లాడుతున్నాయి. సబ్సిడీ భారాన్ని వదిలించుకుని, దొంగ కనెక్షన్లు పట్టుకునే నెపంతో కేంద్ర ప్రభుత్వం తీసుకొచ్చిన తాజా ఆంక్షలు సృష్టించిన గందరగోళమిది. జనం పైకి నేరుగా సంస్కరణల పంజా విసిరి, గ్యాస్ బండ ధరను చమురు కంపెనీల దయాదాక్షిణ్యాలకు వదిలేసింది ప్రభుత్వం.

విధానపరమైన నిర్ణయాలను పార్లమెంట్ ఆమోదం పొందే సంప్రదాయానికి తిలోదకాలిచ్చి ప్రభుత్వం నేడు బహుళ జాతి సంస్థల సేవలలో తరిస్తున్నది.

ప్రమాదకర పర్యవసానాలుండే ఈ ప్రభుత్వ నిర్ణయం వల్ల దేశవ్యాప్తంగా అన్ని వర్గాల నుండి తీవ్రప్రజాగ్రహం, నిరసనలు వ్యక్తమవుతున్నాయి. సంక్షేమ పథకాలకు సబ్సిడీ గ్యాస్ కొనసాగించడంతోపాటు, గృహ వినియోగానికి ఏడాదికి 12 సిలిండర్లు ఇవ్వాలనేది దేశ మహిళల డిమాండ్.

సబ్సిడీ గ్యాస్ ఇస్తారా? ప్రజాగ్రహానికి గురవుతారా? ప్రభుత్వమే తేల్చుకోవాలి.



## సూక్తి

ఏ పనినైనా మూడు గంటలు ముందు చేయడంలో తప్పులేదు. కానీ ఒక్క క్షణం కూడా ఆలస్యంగా చేయకూడదు.

- షేక్‌స్పియర్




**అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం రాష్ట్ర కమిటీ**

చిరునామా:
బ్లాక్ నెం. 24, హెచ్‌ఐజి ఫేజ్: 2,1-8-1,
బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ - 500 044.
ఫోన్ : 27605845.
e-mail chaitanyamanavi@gmail.com

సంపాదకులు

**టి. జ్యోతి**

సంపాదక వర్గం

మల్లు స్వరాజ్యం

అల్లూరి మన్మోహిని

ఎస్. పుణ్యవతి

కె. స్వరూపరాణి

మేనేజర్

**ఎం. సుధ**

**విరాళం రూ : 10/-**

ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్, అజమాబాద్, హైదరాబాద్ - 500 044.


# చైతన్య మానవి

## ఈ సంచికలో...

# హింసకు అడ్డుకట్ట వేయాలి

- సుధా సుందరరామన్

ఈ మధ్య కాలంలో జరిగిన కొన్ని భయంకరమైన నేరాలను పరిశీలిస్తే అనేక కారణాలు అనేక స్థాయిల్లో నేరాలు జరగడానికి దోహదం చేస్తున్నాయనే విషయం స్పష్టమవుతోంది. ఆరుగురు గుడ్డివారు, ఒక ఏనుగు మాదిరిగా, విడివిడిగా కాకుండా మొత్తం సంఘటనలను సమిష్టిగా అధ్యయనం చెయ్యడం వల్లనే అసలు విషయం అవగాహనకు వస్తుంది. ఒక సమస్యను ఈ రకంగా సమగ్రంగా చూసే దృష్టికోణం మాత్రమే సామాజిక, సాంస్కృతిక, ఆర్థిక, రాజకీయ కారణాలను విశ్లేషిస్తుంది.

భారత్ మహిళా బాక్సర్ మేరీకామ్ లండన్ ఒలింపిక్స్‌లో పతకాల పట్టికలో చోటు సంపాదించుకున్నప్పటికీ తీవ్ర నిరాశతో ఆత్మహత్య చేసుకున్న ఎయిర్ హోస్టెస్ గీతికా శర్మ ఫోటోలను మీడియా ఎక్కువగా ప్రచురించింది. హార్యానా హోం, యువజన వ్యవహారాల శాఖ సహాయ మంత్రి గోపాల్ కందాకు ఈ సంఘటనతో సంబంధం ఉన్నట్లు ఆరోపణలు రావడంతో ఈ వార్తకు మీడియా ఎక్కువగా ప్రాధాన్యతనిచ్చింది. తమ సంస్థలో తిరిగి ఉద్యోగంలో చేరాలని ఒత్తిడి చేస్తూ ఆమెను, ఆమె కుటుంబ సభ్యులను వేధిస్తున్నట్లు ఆయనపై ఆరోపణలు వచ్చాయి. కందా, ఆయన అసిస్టెంట్ స్వీయ ప్రయోజనాల కోసం తనను వినియోగించుకుంటూ విశ్వాసం కోల్పోయారని ఆమె తన ఆత్మహత్యా నోట్‌లో పేర్కొంది. ఆ తరువాత మొహాలీలో ఫిజా, హైదరాబాద్‌లో నీలిమా మరణించినట్లు వార్తలు వచ్చాయి. ఇరువురి మరణాలు మిస్టరీగా మారాయి. వారు ఆత్మహత్య చేసుకుని ఉండవచ్చునని అనుమానిస్తున్నారు. వ్యక్తిగత జీవితాల్లో చవిచూసిన చేదు అనుభవాలు వారి మరణాలకు దారితీసి ఉండవచ్చు. చదువుతుంటే, వింటుంటే మామూలుగా కలగాల్సిన కోపం, బాధ కూడా కలగనంతగా ఇటువంటి వార్తలు సర్వసాధారణమైపోయాయి. అవి మీడియాలో చోటు సంపాదించుకున్నాయంటే మీడియా కోణమే అందుకు కారణమని చెప్పవచ్చు. తమ జీవితాలు ఇంటా, బయటా ఎంత అభద్రతలో ఉన్నాయో తెలియజేసే చేదు నిజాలు



మహిళల ముందు ప్రత్యక్షమవుతున్నాయి. వరుసగా మహిళలపై దారుణాలకు సంబంధించిన భయానక వార్తలు పతాక శీర్షికల్లో వస్తున్నాయి. దేశంలో మహిళలపై లైంగిక నేరాలు పెరిగిపోయాయి. దేశంలో ప్రతిరోజూ ఏదో ఒక మూల ఇటువంటి సంఘటనలు చోటుచేసుకుంటున్నాయి. మహిళలపై హింస మన సమాజంలో అంటువ్యాధిగామారి వ్యవస్థాగతమైపోతుంది.

### చేదు నిజం

పరిస్థితి ఎంత తీవ్రంగా ఉందో సమాజానికి అవగాహన ఉందా? 2011కు సంబంధించి ఎన్‌సిఆర్‌బి వెల్లడించిన నివేదిక అనేక చేదు నిజాలను ఆవిష్కరించింది. వారూ, వీరని లేకుండా అన్ని కేటగిరీల మహిళలపై అన్ని రకాల నేరాలు బాగా పెరిగిపోయాయి. ఐపిసి అత్యంత తీవ్రమైన నేరాలుగా గుర్తించిన అత్యాచారం, వేధింపులు, అపహరణలు, వరకట్న వేధింపులు, మానసిక, భౌతిక హింస, లైంగిక వేధింపులు మహిళలను అల్లరి చేయటం(ఈవ్‌టీజింగ్), బాలికల అక్రమ రవాణా వంటి సంఘటనలు 2007 నుంచి నిలకడగా పెరుగుతున్నాయి. అత్యంత అమానుషమైన అత్యాచారాల కేసులు 2010-2011 మధ్య 9.2 శాతం పెరిగాయి. ఈ కేసుల బాధితుల్లో 14 ఏళ్ళలోపు బాలికలు 10.6 శాతం ఉన్నారు. 19 శాతం మంది 14 నుంచి 18 ఏళ్ళ లోపు వయస్సున్న టీనేజ్ యువతులు, 4.7 శాతం మంది 18 నుంచి 30 ఏళ్ళలోపు వయస్సు గల వారున్నారు. ఇవి నమోదైన కేసులకు సంబంధించిన వివరాలు మాత్రమే. అనేక కేసులు అసలు బయటపడవు. 9.4 శాతం కేసుల్లో బాధితులకు తెలిసిన వారే మానభంగం వంటి నేరాలకు పాల్పడుతున్నారు.

ఒక్క సంవత్సరంలోనే కిడ్నాపింగ్ వంటి నేరాలు 19.4 శాతం పెరిగాయి. సెక్షన్ 498-ఎ ప్రకారం ఫిర్యాదు చేయదగ్గ నేరాలైన భర్తలు, బంధువులు అమానుషంగా ప్రవర్తించడం, చిత్రహింసలు పెట్టడం వంటివి ఐదు శాతం పెరిగాయి. దాడులు, లైంగిక వేధింపులకు పాల్పడుతున్న సంఘటనలు ఈ ఏడాది 5.8 శాతం పెరిగాయి. బాలలపై నేరాలు 2010లో కంటే 24 శాతం పెరగ్గా అటువంటి నేరాలకుగాను 30 శాతం కేసుల్లో మాత్రమే శిక్షలు విధించబడ్డాయి.

**మొబైల్ ఫోన్లను వాడరాదని, బజారుకు వెళ్ళరాదని, తమ ఇష్టానుసారంగా వివాహాలు చేసుకోరాదని మొదలైన నిబంధనలను బాఘ్‌పట్ వయోజన పంచాయితీ జారీ చేసింది. కొంతమంది ప్రముఖ వ్యక్తులు వారిని వెనకేసుకురావడం ఆశ్చర్యకరం. దీనికి కొంతమంది మహిళలు ప్రతిస్పందించడం చూస్తుంటే వారు కూడా పితృస్వామ్య వ్యవస్థకు దాసోహం అయ్యారా అన్న భావన కలుగుతుంది. గౌరవాన్ని పరిరక్షించే పేరుతో ఖాప్ పంచాయితీలు చట్ట విరుద్ధంగా వ్యవహరిస్తున్నాయి. డ్రస్, ప్రవర్తన, కదలికలకు సంబంధించిన కట్టుబాట్లు మహిళలకు మాత్రమే వర్తించే విధంగా ఆదేశాలు జారీ చేయడం ఫ్యూడల్ సంస్కృతిని ప్రతిబింబింపచేస్తుంది.**

### లైంగిక హింసలోని బహుముఖాలు:

ఈ మధ్య కాలంలో జరిగిన కొన్ని భయంకరమైన నేరాలను పరిశీలిస్తే అనేక కారణాలు అనేక స్థాయిల్లో నేరాలు జరగడానికి దోహదం చేస్తున్నాయనే విషయం స్పష్టమవుతోంది. ఆరుగురు గుడ్డివారు, ఒక ఏనుగు మాదిరిగా, విడివిడిగా కాకుండా మొత్తం సంఘటనలను సమిష్టిగా అధ్యయనం చెయ్యడం వల్లనే అసలు విషయం అవగాహనకు వస్తుంది. ఒక సమస్యను ఈ రకంగా సమగ్రంగా చూసే దృష్టికోణం మాత్రమే సామాజిక, సాంస్కృతిక, ఆర్థిక, రాజకీయ కారణాలను విశ్లేషిస్తుంది. ప్రస్తుతమున్న అస్వస్థతపై దృష్టి పెట్టేందుకు ఇది అవసరం. లేకుంటే హింసకు సంబంధించి ఒక్కొక్క కేసుపై వేరువేరుగా వచ్చే ప్రతిస్పందనలు మొత్తంగా ఈ ధోరణిపై ప్రభావం చూపేందుకు అవసరమైన మార్పులను ప్రభావితం చేయజాలవు.

గౌహతిలో ఒక 17 ఏళ్ళ యువతి పబ్ నుండి బయటకు వస్తుండగా కొంతమంది దుండగులు ఆమెపై మూకుమ్మడిగా దాడికి పాల్పడ్డారు. ఆమె దుస్తులను అందరూ చూస్తుండగా చింపేశారు. పెద్ద సంఖ్యలో అక్కడ గుమిగూడిన ప్రజలు చూస్తుండగా దాదాపు అర్థగంటసేపు ఈ దాడి జరిగింది. మీడియా ఆ సంఘటనను తన కెమెరాలో బంధించింది. సంఘటన జరిగిన కొద్ది నిమిషాల్లోనే తన ఛానల్‌లో ప్రసారం చేసింది. దేశవ్యాప్తంగా ప్రజలు దాన్ని తిలకించారు. ఆ తరువాత జరిగిన సంఘటనలు కూడా కలవరం రేకెత్తించేవిగా ఉన్నాయి. నేరస్థులను వెంటనే అరెస్టు చేసేందుకు పోలీసులు ఎటువంటి ప్రయత్నం చేయలేదు. మీడియా ఈ సంఘటనకు మితిమీరిన ప్రచారం ఇస్తోందని రాష్ట్ర పోలీసు డైరెక్టర్ జనరల్ వ్యాఖ్యానించారు. ఆ బాలిక వద్దకు వెళ్ళిన ఎన్‌సిడబ్ల్యు బృందంలోని ఒక సభ్యురాలు ఆమె పేరును మీడియాకు వెల్లడించారు. తరువాత ఆ సభ్యురాలిని పదవి నుంచి తొలగించారు. అసోం ముఖ్యమంత్రి కార్యాలయం బాలిక ఫోటోలను విడుదల చెయ్యడం ద్వారా బాధ్యతారహితంగా ప్రవర్తించింది. ఆ ఫోటోలను ఆ తరువాత ఉపసంహరించుకుంది. అయితే జరగాల్సిన నష్టం జరిగిపోయింది. ఈ అంశం దేశవ్యాప్తంగానూ, రాష్ట్ర స్థాయిలోనూ నిరసన ప్రదర్శనలకు దారితీసింది. దాంతో నేరస్థులను అరెస్టు చేశారు. ఆ యువతికి రక్షణ కల్పించారు. న్యాయం చేకూర్చేందుకు అదనపు చర్యలు తీసుకున్నారు. హింసాకాండ జరుగుతున్న తీరు, దాన్ని సమాజం తీసుకుంటున్న తీరును ఈ సంఘటన ఆవిష్కరించింది. చట్టాన్ని అమలు చేసే యంత్రాంగం ఎంత నత్తనడక నడుస్తోందో కూడా ఈ సంఘటన తెలియజేసింది. మహిళలకు రక్షణ కల్పించేందుకు నెలకొల్పిన ఎన్‌సిడబ్ల్యు వంటి సంస్థలు తమ బాధ్యతల పట్ల ఎంత నిర్లక్ష్య ధోరణి ప్రదర్శిస్తున్నాయో కూడా ఈ సంఘటన స్పష్టం చేసింది. మీడియా పాత్రపై కూడా కొన్ని విమర్శలు వచ్చాయి. ఈ సంఘటన దేశ ప్రజల ఆత్మను క్షోభింపజేసింది. ఇటువంటి సంఘటన మరో మహిళ విషయంలో పునరావృతం కాకుండా న్యాయం కోసం పోరాడాలి. న్యాయం అందించేందుకు నెలకొల్పిన సంస్థలు మరింత జవాబుదారీతనంతో వ్యవహరించాలి. ఈ నేరం జరగడానికి యువతిని నిందించటంపై మరింత నిశితంగా దర్యాప్తు చేయాలి. ఏమిచేస్తోంది? ఏ దుస్తులు ధరించింది? అసలు అక్కడకు ఎందుకు వెళ్ళింది?'అనే ప్రశ్నలు ఇటువంటి దాడులు జరిగినప్పుడు విన్పిస్తాయి. సమాజంలో పేరుకుపోయిన ఛాందసవాదమే ఇటువంటి వైఖరికి కారణం. ఈ ప్రమాదకరమైన ధోరణిని అడ్డుకునేందుకు ప్రజాతంత్ర గళాలు సంఘటితం కావాల్సి ఉంది.

### పితృస్వామ్య అధికార వ్యవస్థలు

యువతీ యువకులు కలసి పార్టీ చేసుకున్నందుకుగాను మంగుళూరులో హిందూ జాగరణ వేదిక వారిపై అత్యంత అమానుషమైన దాడులకు పాల్పడింది. ఈ నైతిక వేదిక ఏ విధంగా పనిచేస్తుందో ఈ సంఘటన రుజువు చేస్తోంది. కొన్ని రకాల పానీయాలు తీసుకోవడం వారి రాజ్యాంగబద్ధమైన హక్కే. వారు ఏ నేరం చేసినట్లు కాదు. సంప్రదాయం, సంస్కృతీ పరిరక్షకులుగా చెప్పుకుంటున్న వారు నిర్దేశించిన కొన్ని విధానాలను వారు పాటించలేదు. 2009లో పబ్‌లో యువతులపై ఇటువంటి దాడే జరిగింది. కట్టుబాట్లను, నిబంధనలను నిర్దేశించే హక్కు లేకపోయినా నిర్బంధంగా వాటిని అమలు చేస్తున్నారు. ఇది అక్రమం, రాజ్యాంగ విరుద్ధం. చట్టాన్ని ఇంత బహిరంగంగా ఉల్లంఘిస్తున్నా దానిని పరిరక్షించాల్సిన వారు సక్రమంగా ప్రతిస్పందించటంలేదు.

ఇతర సంస్థలు కొన్ని ఈ మధ్య

కాలంలో ఇటువంటి దాడులకు పాల్పడ్డాయి. మొబైల్ ఫోన్లను వాడరాదని, బజారుకు వెళ్ళరాదని, తమ ఇష్టానుసారంగా వివాహాలు చేసుకోరాదని మొదలైన నిబంధనలను బాఘ్‌పట్ వయోజన పంచాయితీ జారీ చేసింది. కొంతమంది ప్రముఖ వ్యక్తులు వారిని వెనకేసుకురావడం ఆశ్చర్యకరం. దీనికి కొంతమంది మహిళలు ప్రతిస్పందించడం చూస్తుంటే వారు కూడా పితృస్వామ్య వ్యవస్థకు దాసోహం అయ్యారా అన్న భావన కలుగుతుంది. గౌరవాన్ని పరిరక్షించే పేరుతో ఖాప్ పంచాయితీలు చట్ట విరుద్ధంగా వ్యవహరిస్తున్నాయి. డ్రస్, ప్రవర్తన, కదలికలకు సంబంధించిన కట్టుబాట్లు మహిళలకు మాత్రమే వర్తించే విధంగా ఆదేశాలు జారీ చేయడం ఫ్యూడల్ సంస్కృతిని ప్రతిబింబింపచేస్తుంది. ఈ నిబంధనలను ఉల్లంఘించటం హింసాకాండకు దారితీస్తోంది. ఈ సంస్థలు ఈ విధంగా అక్రమ కార్యకలాపాలను బహిరంగంగా నిర్వహిస్తుంటే చట్టం ఏమి చేస్తోందో అర్థం కాదు.

**ఉల్లంఘనకారులుగా శాసనకర్తలు**

ఈ సంస్థలు నేరాలకు పాల్పడుతున్నప్పటికీ ఎటువంటి ఆటంకాలు లేకుండా యదేచ్ఛగా తమ కార్యకలాపాలు కొనసాగించడానికి చట్టాలను పరిరక్షిస్తామని ప్రమాణం చేసినవారు ఉదాసీనంగా వ్యవహరించడమే కారణం. ఇటువంటి నేరాల పట్ల కఠినంగా వ్యవహరించాలని, ఇందుకోసం ప్రత్యేకంగా ఒక చట్టం తీసుకురావాలని ఐద్వా డిమాండ్ చేస్తోంది. అయితే హర్యానా ముఖ్యమంత్రి ఈ బిల్లును నిలిపివేశారు. ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం కూడా బాఘ్‌పట్ పంచాయితీపై ఎటువంటి చర్యలూ తీసుకోలేదు.

**చట్టంలో లొసుగులు**

చట్టంలో ఉన్న లొసుగులు కూడా ఈ నేరాలను పరోక్షంగా ప్రోత్సహించేవిగా ఉన్నాయి. మహిళలకు సంబంధించి అనేక శాసనాలు దీర్ఘకాలంగా పెండింగ్‌లో ఉన్నాయి. క్రిమినల్ చట్టం సవరణలను ఇంకా ఆమోదించాల్సి ఉంది. కార్యాలయాల్లో లైంగిక వేధింపుల నుంచి మహిళలను రక్షించడానికి ఉద్దేశించిన బిల్లు 14 సంవత్సరాలుగా పెండింగ్‌లో ఉంది. ఎన్‌సిడబ్ల్యు స్థాయిని పెంచాల్సి ఉంది. వ్యవస్థాగత సంస్కరణలను తక్షణం ప్రవేశపెట్టాల్సి ఉంది.

మహిళలు ఇంతకు ముందు కంటే బహిరంగ కార్యకలాపాల్లో చురుకుగా వ్యవహరిస్తున్నారు. నయా ఉదారవాద వ్యవస్థ ఇందుకు దోహదం చేస్తోంది. ప్రైవేటు సంస్థల్లో ఉద్యోగాలు చేసేందుకు ప్రయాణాలకు అధిక సమయాన్ని కేటాయించాల్సి వస్తోంది. మహిళలు ఉన్నత చదువులపై కూడా ఆసక్తి ప్రదర్శిస్తున్నారు. పంచాయితీ సంస్థల్లో మహిళలకు 50 శాతం రిజర్వేషన్లు అమలైతే వారు మరింత చురుకుగా రాజకీయాల్లో ప్రవేశించే అవకాశముంది. స్వయం సహాయ బృందాల్లో మహిళల సంఖ్య గణనీయంగా పెరుగుతోంది. ఇంతగా సమాజంలో మార్పులు చోటుచేసుకుంటున్నా ఛాందసవాద శక్తులు ఈ మార్పులను ఆహ్వానించడం లేదు. ఈ పరిస్థితి మారాలి. మహిళలపై నేరాలకు పాల్పడేవారిపై కఠిన చర్యలు తీసుకోవాలి. ఇందుకుగాను న్యాయ సంస్కరణలను తీసుకురావల్సిన పోలీసు యంత్రాంగానికి జవాబుదారీతనం అవసరం. మహిళల హక్కుల పరిరక్షణ విషయంలో రాజకీయ సంకల్పం అవసరం. అప్పుడు మాత్రమే ఈ నేరాలను అరికట్టవచ్చు. మహిళలకు ఇంటా, బయటా రక్షణ కల్పించవచ్చు.

**(నవంబరు 25 అంతర్జాతీయ హింస వ్యతిరేక దినం సందర్భంగా)**

# చేవలేని సర్కారు

జనపదాల మేలుకోరి జానపదుల
మేలుకొలుపు
వెతలులేని బతుకు కొరకు రాజీలేని
పోరుసలుపు

నోరుతడప నీరడిగితే
నములు నీళ్ళు సర్కారు
సేద్యానికి కొదువ నీరు
మద్యానికి అదుపులేదు
ఏందీ అన్యాయమని
అందమన్న అననీదు!

రోగమొస్తే దవఖాన్ల
సర్కారు మందుల్లేవు
పుద్దులేదు, బెద్దులేదు
ఇచ్చేటాన్కి మనిషిలేదు
సందుగొందులెందుచూడ
మందుపాతరల యిందు!

తన తప్పులెంచనీదు
గొంతెప్పుడు పెగలనీదు
మత్తుతప్పు మునగనీదు
బెల్టుషాపు మూయనీదు
పాలకుల ఊక హోరు
కాటికి పంపే జోరు!

తిన్నోడ్ని తినబెట్టి
బోడినెత్తికి తలలంటు
పిట్టల్ని పట్టేరు
గద్దల్ని వదిలేసి
మంత్రాల యంత్రాంగం
తంత్రాల మంత్రాంగం!

– కపిల రాంకుమార్

# జీవ వైవిధ్యం - వ్యక్తి సంక్షేమం

-డాక్టర్ బి.విజయ భారతి

ప్రకృతిని అలానే ఉండనిచ్చి దాని నుంచి ఉపయోగాలు పొందుతూ రావటం కంటే ప్రకృతిని ధ్వంసం చేసి తాము మాత్రమే లాభాలు పొందాలనుకునే స్వార్థపరులతోనే ప్రకృతికి ముప్పు ఏర్పడింది. జీవ వైవిధ్యం నాశనమవుతోంది. రాజ్యం పేరిట, మతం పేరిట అభివృద్ధి పథకాల పేరిట జరుగుతున్న విధ్వంసం తెలుస్తూనే ఉంది. హిరోషిమా బాంబు-భోపాల్ గ్యాస్-ఇరాక్‌పై అగ్రరాజ్యపు దాడి. ఇవన్నీ అధికార కాంక్షతో సాగినవే. రాజ్యకాంక్ష, ధనకాంక్ష, అధికార కాంక్ష మానవ జాతికి ప్రతిష్ఠాత్మకమైవి కావు. దారుణమైన ఫలితాలనిచ్చినవే.

జీవ వైవిధ్యాన్ని కాపాడాలంటూ ఇటీవల రాష్ట్రంలో చాలా సదస్సులు జరిగాయి. ఆ సమస్య ప్రభుత్వాలదీ, శాస్త్రవేత్తలదీ-మేధావులదీ అన్నట్టుగానే వ్యవహారం సాగింది. నిజానికి ఇది సామాన్య ప్రజల జీవితాలకూ, ఆరోగ్యాలకూ జీవనశైలికీ, పేదరికానికీ-సంపద ఒక చోటనే పోగుపడటానికీ సంబంధించిన విషయం. దీనితో ఎన్నో అంశాలు ముడిపడి ఉన్నాయి. పూర్వం అశోకుడు చెట్లు నాటించి, రోడ్లు వేయించి ప్రజల సౌకర్యానికీ పరోక్షంగా జీవాల రక్షణకూ, పర్యావరణ సమతుల్యానికి పాటు పడ్డాడు. ఈనాటి ప్రభుత్వ పథకాలు పెద్ద చెట్లు కొట్టించేసి చిన్న చిన్న మొక్కలు తాత్కాలికంగా నాటించి ఫ్లయ్ ఓవర్లు కట్టించడానికి ఉత్సాహపడుతున్నాయి. అశోకుడు సొంత లాభం చూసుకోలేదు. ఇక్కడ స్వంత లాభాలు చూసుకుంటున్నారు. చెట్లు కొట్టించటం-మొక్కలు నాటించటం అన్నిట్లోనూ పర్సంటేజీలే. ఫ్లయ్ ఓవర్లయితే ఇక కాసుల కుప్పలే.

ప్రకృతిని అలానే ఉండనిచ్చి దాని నుంచి ఉపయోగాలు పొందుతూ రావటం కంటే ప్రకృతిని ధ్వంసం చేసి తాము మాత్రమే లాభాలు పొందాలనుకునే స్వార్థపరులతోనే ప్రకృతికి ముప్పు ఏర్పడింది. జీవ వైవిధ్యం నాశనమవుతోంది. రాజ్యం పేరిట, మతం పేరిట అభివృద్ధి పథకాల పేరిట జరుగుతున్న విధ్వంసం తెలుస్తూనే ఉంది. హిరోషిమా బాంబు-భోపాల్ గ్యాస్-ఇరాక్‌పై అగ్రరాజ్యపు దాడి. ఇవన్నీ అధికార కాంక్షతో సాగినవే. రాజ్యకాంక్ష, ధనకాంక్ష, అధికార కాంక్ష మానవ జాతికి ప్రతిష్ఠాత్మకమైనవి కావు. దారుణమైన ఫలితాలనిచ్చినవే.

అనాది నుంచీ స్త్రీలు, సామాన్య ప్రజలు ప్రకృతి సమతుల్యాన్ని కాపాడుతూ జీవ వైవిధ్యాన్ని రక్షిస్తూ వచ్చారు. గ్రామీణ స్త్రీలు-గిరిజన స్త్రీలు-ఆదివాసీ స్త్రీలు-ప్రకృతిని ఆరాధిస్తూనే వచ్చారు. సహజ వనరులను ప్రైవేటు పరం చేయటాన్ని స్త్రీలు అడ్డుకున్న ఉదంతాలు చరిత్రలోనూ




XI[th] Conference of Parties
CONVENTION ON BIOLOGICAL DIVERSITY
HYDERABAD INDIA 2012

పురాణాలలోనూ కనిపిస్తాయి. వారికీ పర్యావరణ స్పృహ ఉన్నది. ప్రకృతి విధ్వంసం ఈనాడు మానవుల వల్ల ప్రభుత్వాల ఆర్థిక విధానాల వల్ల జరుగుతూ ఉంది. ఒకప్పుడు జీవ విధ్వంసం క్రూర మృగాల వల్లనూ మత పరమైన విధానాల వల్లనూ జరిగిందంటే ఆశ్చర్యంగానే ఉండవచ్చు. అహింస, కరుణ, శాంతి అనే వాటిని ప్రధాన జీవన మార్గాలుగా బోధించిన మతాలను కాదని వాటిని తుడిచిపెట్టడానికి మూఢనమ్మకాలనూ క్రతు కర్మలనూ ప్రచారం చేసిన కాలంలోనే ప్రకృతి విధ్వంసానికి అంకురార్పణ జరిగింది. క్రూర మృగాలను అవతార మూర్తులుగా చూపిన మతం భారతదేశంలో ఉంది. యజ్ఞాలు చేయటం, ఇతర క్రతు కర్మలూ అన్నీ మానవ సంక్షేమానికే అని నమ్మించిన వ్యవస్థ భారతదేశ వ్యవస్థ.

యజ్ఞాలు జీవ వైవిధ్యాన్ని దెబ్బ తీస్తాయని ఆనాడే స్థానిక ప్రజలు (రాక్షసులు) గుర్తించారు. యజ్ఞాలు జరగకుండా ఆపటం ఒక కార్యక్రమంగా పెట్టుకున్నారు. వారిని దుర్మార్గులుగా మతం ప్రచారం చేసింది. నేడు జల యజ్ఞాలు ఊపులో ఉన్నాయి. వేలాది ఎకరాలు ముంపుకు గురై లక్షల కుటుంబాలు ఇళ్ళూ, భూములు పోగొట్టుకునే స్థితిలో ఉంది. కేవలం పది పన్నెండు కార్పొరేట్ రంగాల కుటుంబాల కోసం పాలక వర్గం యజ్ఞాలు చేస్తున్నారు. అడ్డుకుంటున్న వారంతా సామాన్యులు. వారు రాజ్య హింసకు బలి అవుతున్నారు.

అలనాటి యజ్ఞాలూ ఇప్పటి సెజ్‌ల పథకాలూ విధ్వంసక చర్యలే. హింసా పూరితమైనవే. అవి ఆధిపత్య వర్గాల విధానాలు కావటం గుర్తుంచుకోవలసిన విషయం.

రామాయణంలోనే వాల్మీకి ఒక చోట యుద్ధ భూమిని వర్ణిస్తూ అది యజ్ఞశాలలాగా ఉన్నదన్నారు. తెగిపడిన మాంస ఖండాలు, నేలంతా పరుచుకున్న రక్తం, వెంట్రుకలూ-చుట్టూ దూరం వరకూ చెదిరిపడిన పేగులు, తలలు, మొండాలు, అవయవభాగాలు ఇలా అతి బీభత్సంగా వర్ణించాడు. మునుల యజ్ఞాలలో జంతుబలి ప్రధానం. అందులోనూ రకరకాల జంతువులు లెక్క ప్రకారం ఉండాలి. ఇన్ని ఆవులు, ఇన్ని ఎద్దులు-ఇన్ని గొర్రెలు ఇలా. వాటి మాంసాలు రుచిగా రకరకాలుగా వండి ఘాటైన పానీయాలతో వడ్డించేవారు. యజ్ఞ శాలల్లోకి సామాన్యులకు ప్రవేశం లేదు. రాజులు, అధికార వర్గాలు, పురోహిత వర్గాలు

ఆ విందులకు ప్రత్యేక ఆహ్వానితులు. ఈ యజ్ఞాల రక్షణకు రాజ్యం స్వయంగా వచ్చి నిలబడేది. యజ్ఞాలకు ఎవరైనా విఘ్నం కలిగిస్తే వారిని చంపించేసేది.

ఈనాడూ అదే జరుగుతోంది. ఆధిపత్య, అగ్ర వర్గాల ప్రయోజనాల కోసమే ప్రభుత్వం ఆలోచిస్తున్నది. పూర్వం ఒకచోట యజ్ఞం జరిగితే ఆ చోటూ, చుట్టు ప్రక్కల ప్రాంతాలూ నిస్సారంగా శూన్యంగా అయిపోయేవట. జంతు వృక్ష సముదాయం అంతా నశించిపోయేదన్నమాట. ఇప్పటి సెజ్ పథకాలు అలానే ఉన్నాయి. ఒక ప్రాజెక్టు వస్తోందంటే ఆ చుట్టు పట్ల ప్రాంతాలన్నీ ఖాళీ చేయాల్సిందే. జనని, జన్మ భూమి, ఇల్లూ, వాకిలీ అనే సెంటిమెంటు పేదలకు ఉండకూడదు. అదే అస్మదీయులకయితే ఎక్కడో పరిహారం దొరుకుతుంది. పేదలకూ సామాన్యులకూ ప్రాజెక్టుల వల్ల ప్రయోజనం ఇసుమంతైనా ఉండదు. పెద్ద వాళ్ళ కోసం కార్పొరేట్ రంగాల కోసం వాళ్ళంతా త్యాగాలు చేయవలసిందే. కర్మ భూమిలో పుట్టినందుకు కర్మ చేయాలన్నాడు కృష్ణ భగవానుడు. ప్రకృతినీ, జీవ వైవిధ్యాన్నీ విచ్ఛిన్నం చేసి సాధించేది ఏమీ లేదని చాలా ఆలస్యంగా తెలుస్తున్నది. అప్పుడు మళ్ళీ జీవవైవిధ్యాన్ని కాపాడటం అనే కర్మ మొదలవుతుంది. కర్మల పరంపర ఇలా సాగుతూనే ఉంటుంది. కాంట్రాక్టులూ సాగుతూనే ఉంటాయి. ఇదీ మన ప్రజా ప్రభుత్వాల కార్యక్రమం.

ప్రకృతిని, జీవ వైవిధ్యాన్ని మొదటి నుండీ కాపాడుకుంటూ వస్తున్నది స్థానికులే. గ్రామీణులు-గిరిజనులు-రాక్షసులు ఎవరైనా గానీ, గ్రామాలలోని, అడవులలోని సంపదను, వనరులను, ఖనిజాలను ఇంత వరకూ వారే రక్షించుకుంటూ వచ్చారు. పాలక వర్గం వారిని హింసించి వాటిని వశం చేసుకొన్నది. ఇప్పుడూ కొన్ని కుటుంబాల ప్రయోజనం కోసం దేశ సంపదను వారికి దోచి పెడుతున్నది. సంపదను గుత్తకు తీసుకుంటున్న వారికే రాజ్యం రక్షణ కల్పిస్తున్నది.

సామాన్యుల జీవితాలనూ హక్కులనూ పట్టించుకోకుండా కార్పొరేట్ దిగ్గజాలకు లక్షల కోట్లు దోచిపెట్టిన ఈ ప్రభుత్వం ఇప్పుడు జీవ వైవిధ్యం కాపాడటానికి 265 కోట్ల రూపాయలు ఇస్తానంటూ ఉదారంగా ప్రకటిస్తున్నది. పూర్వపు మత యజ్ఞాలూ మళ్ళీ ఉధృతమౌతున్నాయి. అప్పుడప్పుడు విశాఖ సముద్ర తీరంలో, మొన్న మొన్న భద్రాచలంలో జరిగాయి. యజ్ఞాలు చేసి యజ్ఞ శాలలు తగల బెట్టడం ప్రజల డబ్బు తగలబెట్టటమే కాదా? ఈ డబ్బు ప్రజోపయోగ కార్యక్రమాలకో, రైతుల ఆత్మహత్యల నివారణకో ఉపయోగించకూడదా?

మతం పేరిట ఒకప్పుడు సాగిన జీవ విధ్వంసాన్ని అడ్డుకోగల సమాజం ఈనాడున్నది. ప్రగతి పేరిట సాగే అధికార హింసనూ అడ్డుకోగల జనబలం ఉన్నది. ఘర్షణ అనివార్యమౌతూనే ఉన్నది.

జీవ వైవిధ్యం కాపాడే చర్యలే కాదు, వ్యక్తి సంక్షేమం కాపాడే చర్యలూ కావాలి.

★

## అధిపతివా ? అల్పుడివా?

ఓ మనిషీ! ఎటువైపు నీ పయనం?
అమ్మ కడుపులో ఆయువు పోసుకున్నావు
అవని గుండెలో చిచ్చు పెడుతున్నావు
ఆధిపత్యపు అహంతో నీ పతనానికి
నాంది పలుకటానికా నీ పయనం?

అల్ప జీవులను అంతంచేస్తూ
విహంగాల రెక్కలు విరిచేస్తూ
జీవనదుల గమనాన్ని నిర్దేశిస్తూ
సహజ వనరులను స్వాహా చేస్తూ
ఓ మనిషీ ఎటు నీ పయనం?

పసిపాపల నవ్వుల్ని
పూసే పువ్వుల్ని
కూసే గువ్వల్ని
ఉక్కు పాదంతో నలిపేస్తూ
ఎటు నీ పయనం?

అరచేతిలో ఇమిడిపోయే
ఆధునిక సాధనంతో
నీ అంతానికి నీవే
ఆయుధమవుతూ
ఆధునికత మోజులో
అంబరాన్ని కూడా శాసిస్తున్న ఓ మనిషీ!
ఎటు నీ పయనం?

కలుగులోని ఎలుక, కానలోని ఎలుగు
చిట్టిపిట్ట, చిన్ని చేప
పేడ పురుగు, పట్టుపురుగు
రాగాలు తీసే కోయిల, రాలిపోయిన ఆకు
ఎగిరే చిలుక, నేలలోని మొలక
జీవన వైవిధ్యంలో వాటికవే సాటి!
వాటిముందు నీవు ఏపాటి?

ఒకనాటి జ్ఞాపకంగా వాటిని కానివ్వకు
నీ ఉనికిని పెంచుకోవటానికీ,
నీ గమనం సాగటానికీ
అవే నీకు ఆదర్శం!
అల్పులని చులకన చేయొద్దు!
అధిపతినని ఎగిరిపడొద్దు!!
ఇకనైనా నీ తప్పు తెలుసుకో
దిద్దుకుంటేనే నీ మనుగడ సాధ్యం! ఇది
జీవిత సత్యం!!
ఇదే ఇదే జీవ వైవిధ్యం!!

– మైలవరపు నాగమణి

**(2012 అక్టోబరు 1 నుండి 19 వరకూ ఆంధ్రప్రదేశ్‌లోని హైదరాబాద్‌లో జరిగిన జీవ వైవిధ్య సదస్సు సందర్భంగా)**

# దిగంబర కవయిత్రులు

- వేములపల్లి సత్యవతి.


అక్కమహాదేవి


కరైక్కల్ అమ్మ


లల్లేశ్వరి

భారతీయ సామాజిక జీవనంలో ఆధ్యాత్మిక భక్తికి అధిక ప్రాధాన్యం ఇవ్వబడింది. మధ్యయుగంలో భక్తి సాహిత్యం విరివిగా వెలువడింది. అప్పటి భక్త కవులు గుండెల్లో గుడి కట్టుకొని భక్త సాహిత్య సౌధాన్ని పటిష్టం చేశారు. సుసంపన్నం చేశారు. భక్తి గీతాలు వారి గుండెల్లో గంతులేసినవి. భక్తి పరిమళాన్ని సమాజంలో వెదజల్లారు. ఉత్తర భారతంలో భక్త తులసీదాస్, సూరదాస్,జయదేవ్, భక్త మీరాబాయి. కబీర్‌దాస్, సంత్ రవిదాస్ మొదలగువారు అపారమైన భక్తి సాహిత్య సృష్టికర్తలయ్యారు. దక్షిణ భారతంలో తెలుగు భక్త కవుల్లో క్షేత్రయ్య, త్యాగరాజు, అన్నమయ్య, భక్తరామదాసు మొదలగువారు ప్రసిద్ధ భక్త కవులు. వీరిలో రామభక్తులు, కృష్ణ భక్తులు ఉన్నారు. వీరితోపాటు సాకార, నిరాకార భక్తులున్నారు. నిరాకార, నిర్గుణోపాసకుల్లో కబీర్‌దాస్, సంత్‌రవిదాస్ ప్రముఖంగా పేర్కొనదగినవారు. హిందీ సాహిత్యంలో 'కబీర్‌పంథ్' (కబీర్ మార్గం) అని ఆయన రచనలకు ప్రత్యేకసాధనం ఏర్పడింది. ఈ కాలపు భక్తులమని చెప్పుకునే బాబాలు, స్వాములవలె భక్తులనుంచి కానుకలు స్వీకరించి నేలమాళిగలలో ఇంద్ర భవనాలు నిర్మించుకుని, మరకత, మాణిక్యాలు, స్వర్ణ రజతాలు, వజ్ర, వైఢూర్యాలు, నవరత్నాలు, కెంపులు, మణులు, కోట్లకొలదీ ధనము పోగు చేసుకోలేదు. హంసతూలికా తల్పాలలో పవళించలేదు వారు. కబీర్‌దాస్ బట్టలు నేసి, వాటిని అమ్ముకుని జీవించేవాడు. మిగతా కవులు కూడా సాధారణ జీవితాలను గడిపారు. మహిళల్లో కవయిత్రులున్నప్పటికి భక్త కవయిత్రులనగానే భక్త మీరానే మనకందరికీ గుర్తొస్తుంది.

పురుషాధిక్య సమాజంలోని ప్రతికూల పరిస్థితుల్లో సమాజం గీసిన లక్ష్మణరేఖను జవదాటి వారికి నచ్చిన రీతిన జీవించిన ముగ్గురు సన్యాసి దిగంబర భక్త కవయిత్రులున్నారు. వారు వేరు వేరు ప్రాంతాలకు, వేరు వేరు కాలాలకు చెందినవారు.

ఐదవ శతాబ్దానికి చెందిన 'కరైక్కల్' అమ్మ తమిళనాడుకు చెందినావె. మనుషులం భూత, భవిష్యత్, వర్తమాన కాలాలలో(ఏకాలంలోనైనా) అందంగా ఉండాలని కోరుకుంటాము. కానీ అందుకు విరుద్ధంగా "కరైక్కల్"అమ్మ తనను కురూపిని చేయమని భగవంతుడిని కోరుకుంటుంది. కురూపినిగా ఉంటే పురుషుల ఆకర్షణనుండి రక్షణ ఉంటుందని, భయం లేకుండా జీవించవచ్చని ఆమె తలంపు. తమిళనాడులో ఆమె విగ్రహాలున్నాయి. చూడటానికి చాలా వికృతంగా ఉంటాయి. ఆ విగ్రహాల కళ్ళు బయటకు పొడుచుకొచ్చి, ఎత్తైన పళ్ళు కలిగి ఉంటాయి. చేతులు, కాళ్లు అష్టవంకర్లు తిరిగి ఉంటాయి. శరీరం శుష్కించి, ఎండిపోయి, ముడుతలు-ముడుతలుగా ఉన్న విగ్రహాలు నెలకొల్పబడినవి. 'కరైక్కల్' అమ్మ శివ భక్తురాలు. శివుని ఎడల మదిలో ఏర్పడిన అచంచల భక్తి భావంతో తన్మయత్వం చెంది భక్తి రచనలు రచించిందా నగ్న సన్యాసిని.

రెండవ దిగంబర భక్త సన్యాసిని అక్కమహాదేవి. పన్నెండవ శతాబ్దంలో కర్నాటకలో వీరశైవ కుటుంబంలో పుట్టి పెరిగింది. అతిలోక సౌందర్యవతి. చిన్ననాటినుండి శివుని ఎడల ఎనలేని భక్తి కలిగివుండేది. శ్రీశైలంలోని మల్లికార్జునుడే తన నాథుడన్న భావన ఆమె మదిలో మొలకెత్తింది. వయసుతోపాటు ఆ భావం కూడా బలపడింది. ఒకసారి కర్నాటక రాజు ఆమెను చూడటం జరిగింది. ఆమె అందచందాలకు ముగ్ధుడయ్యాడు. అక్కమహాదేవిని వివాహం చేసుకోవాలని నిశ్చయించుకున్నాడు. ఆమె తల్లిదండ్రులకు వర్తమానం పంపాడు. ఈ సంగతి తెలిసి అక్కమహాదేవి తిరస్కరించింది. తన వివాహం మల్లికార్జునితో ఎప్పుడో జరిగిపోయిందని, అతడే తన నాథుడని తెలిపింది. రాజుగార్కి కోపమొచ్చింది. "రాజు తలచుకుంటే దెబ్బలకు కొదవా?" అన్న సామెత ఉండనే ఉంది. వివాహానికి అంగీకరించకపోతే ఆమె తల్లిదండ్రులను హతమారుస్తానని కబురు పంపాడు. తల్లిదండ్రులను చంపేస్తాడనే భయంతో పెండ్లికి ఒప్పుకుంది. రంగరంగ వైభోగంగా పెండ్లి జరిగింది. అక్కమహాదేవి రాజప్రాసాదంలోనికి అడుగుపెట్టింది. కాని ఆమె భావాలలో లేశమాత్రం కూడా మార్పు

**తరువాయి 11వ పేజీలో...**

# ప్రయత్నం...

– కాశీవఝల రమా నరసింహం

ఒకచేత్తో అట్టు తిరగేస్తూ మరో చేత్తో ప్లేటులో ఉన్న అట్టుని తుంపి నోట్లో వడేసుకుంటోంది రాగిణి. బైటకెళ్ళే హడావుడిలో ఉందని కాదుగానీ ఆవిడది ఎప్పుడూ హడావుడి తిండే.

రంగు తక్కువైనా చక్కటి రూపురేఖలు గలది అని చెప్పుకుంటారు అంతా ఆవిడ గురించి.

" తెలుపు నలుపుల ఛాయాదేహాళి" అని మేలమాడుతూ ఉంటాడు వాళ్ళాయన.

రాగిణి భర్తది సొంత వ్యాపారం. తండ్రి పెట్టిన వర్కుషాపుని కష్టపడి పైకి తీసుకొచ్చాడు. ఇనుప పనిముట్ల తయారీ జరుగుతుంది వారి కార్ఖానా (వర్కుషాపు)లో.

"పడాల్సిన కష్టమంతా మా నాన్నే పడ్డాడు. మాదేముంది" అంటాడు సందర్భం వచ్చినప్పుడల్లా.

మధ్య తరగతికి చెందిన వ్యాపారస్తుల మొదటి తరం నిలదొక్కుకోవటానికి నానా హైరానా పడాల్సొస్తుంది. రెండోతరం వారి దగ్గరికి వచ్చేసరికి కొంత సులువవుతుంది. అంచేత "ఈరోజు మేము ఇలా ఉన్నామంటే ఆ ఘనత యావత్తు మా తండ్రిదే" అని చనిపోయిన తండ్రిని తలచుకుని గర్వపడుతూ ఉంటాడు.

"అంతా బాగానే ఉంది కానీ ఒట్టి కోపదారు మనిషి'' అని చుట్టాలు బాహాటంగానే చెప్పుకుంటారు. "ఆ...అంతా...తాటాకుమంటే లేద్దూ..". అని నోరు చప్పరించేవారూ లేకపోలేదు.

ఆడది బాధని గుండెల్లోనూ, నవ్వుని పెదవుల అంచుల్లోనూ దాచుకోవాలంటుంది. అదీ రాగిణి థియరీ.

అయితే ఇంట్లో అందరూ అన్నిటినీ ఒకేలా పొందాలనే సమభావం తరుణది. రాగిణి దంపతుల గారాలపట్టి తరుణ.

ఆరోజు ఆదివారం. లిటరరీ మీటింగ్ ఉంది, వాళ్ళ ఇంటికి దగ్గర్లోనే. వెళ్ళాలనే ఆతృతతో పెందరాళే వంట చేసి డైనింగ్ టేబుల్‌మీద సర్ది, ఆఖర్న టిఫిన్ తింటోంది రాగిణి. చెయ్యడమూ, తినడమూ ఒకేసారి కానిచ్చేస్తోంది.

సరిగ్గా ఆ సమయానికి వాళ్ళాయన విసురుగా వంటింట్లోకొచ్చి టిఫిను ప్లేటుని అంతకంటే విసురుగా సింకులో పడేసాడు.

"అదేవిటీ.. అలా.. పడేస్తున్నారూ.. పెసరట్టు మీకిష్టంగా..? విస్తుపోతూ అడిగింది.

ప్రశ్నలేసేవాళ్ళంటే విసుగు. అసలే ఆకలి. అందునా ఇష్టమైన పెసరట్టు. అయినా పెసరట్టా..మజాకానా..అందుకే "తినేట్టుగా ఉంటే పడేసుకుంటారా ఏవిటీ..." అని భార్యకేసి గుర్రుగా చూసాడు.

"అదేం..' అంది ఆశ్చర్యంగా రాగిణి.

''పిండితోపాటు పచ్చి మిరప కాయలూ, అల్లం, కలిపి రుబ్బేస్తే నేను తిననని నీకు తెలీదూ?" రెట్టించాడు.

"తెలీకేం...?!"

''తెలిసేనేవిటీ...?'' అని ధుమధుమలాడుతూ గదిలోకి వెళ్ళాడు.

గబగబా వెళ్ళి ఓ పెద్దగ్లాసుడు చిక్కటి మజ్జిగ తీసుకొచ్చి భర్తకి ఇవ్వబోయింది. అక్కర్లేదంటూ మొహం తిప్పేసుకున్నాడు.

రాగిణి మొహం చిన్నబోయింది.

తండ్రి పక్కనే కూర్చొని నెట్‌లో మెయిల్ చూసుకుంటున్న తరుణ "నే తాగిస్తానులే..వెళ్ళమంటూ..." తల్లికి సైగ చేసింది.

వద్దు వద్దంటూనే మజ్జిగ తాగేసాడు.

డైనింగ్ టేబుల్ దగ్గర కూర్చుని ఏదో ఆలోచిస్తున్న తల్లిముందు ఖాళీ గ్లాసుని ఆడిస్తూ, "ఇంక లేచివెళ్ళి టిఫిన్ తిను. నీ మొగుడు ఆరగించాడులే. మరేం ఫర్లేదు...ఒక్కపూట తినకపోతే మొక్కమొలిచిపోడు..." అంటూనే సింకులో ఉన్న గిన్నెలన్నీ కడిగేసి గట్టుమీద బోర్లించి, టవలుతో చేతులు తుడుచుకుంటూ మళ్ళీ వెళ్ళి తండ్రి పక్కనే కూర్చుంది. తండ్రి పేపరు చదువుతున్నాడు. ఆ పేపరుని ఒక్క ఉదుటున అతడి చేతుల్లోంచి లాక్కొని గోడకున్న పేపర్-హోల్డర్లో పడేసింది.

కూతురి చేష్టకి మండిపడ్డాడు. తండ్రి కోపాన్ని లెఖ్ఖచెయ్యని తరుణ "ఏమిటలా చిర్రుబుర్రులాడుతున్నావ్..." అంది ఏమీ తెలీనట్లు.

"ఎందుకేవిటీ...రాస్కెల్ పేపర్ని చేతిలోంచి లాగేస్తావా నీకెంత ధైర్యం..." అంటున్న తండ్రిని వారిస్తూ "కోపం నీకేనా.. అమ్మకు మట్టుకు రాదా..?" అంది తాపీగా కాళ్లాడిస్తూ...పైగా తన వాక్యాన్ని పెంచుతూ వస్తే గనక ఏం చేస్తుందో చూపించానంతే నా చేష్టతో...శాంపిల్ ఎలావుంది నాన్నా?"

కూతురి తెంపరితనానికి ఆశ్చర్య పోయింది రాగిణి. తనమీద కోపం కూడా వచ్చింది. అయినా అలవాటు కొద్దీ బయటపడలేదు.

అమ్మంటే చాలా ఇష్టం నాన్నకి. అయినా చిన్న పొరపాటు చేసినా మొహమాటం లేకుండా కోప్పడతాడు, తిడతాడు. చేతిలో ఉన్నవి విసిరేస్తాడు. అదే నచ్చదు తరుణకు.

"టిఫిన్ తినడం, తినకపోవడం నీ ఇష్టం. ఓకే...ఒప్పుకుంటా.. కానీ ఆ ప్లేటలా విసిరేయ్యొచ్చా...?!"

సిస్టమ్ షట్‌డౌన్ . చేసి తండ్రిముందుకు వచ్చి బైఠాయించింది. అయినా గానీ..నాన్నా..నీకంత చట్టున కోపం వస్తుందేం..? ఆ కోపాన్ని ఎంత నిర్మొహమాటంగా ప్రదర్శించేస్తావో.. అందునా..." అంటూ లేచివెళ్ళి రాగిణి భుజాల చుట్టూ చెయ్యి వేసి, తండ్రినుద్దేశిస్తూ

**నీకోసం తనవాళ్ళందరినీ వదులుకుని...నిన్ను నమ్మి..నీ చిటికెన వేలు పట్టుకుని నీ ఇంటికొచ్చిన అమ్మ...అమ్మనా..రోజు మొత్తంలో ఎందుకో అందుకు..ఎంతమాట పడితే అంతమాటా అనేస్తూ ఉంటావ్.తన కడుపున పుట్టిన పిల్లల ముందే ఇష్టం వచ్చినట్లు ఈసడిస్తూ, నిర్లక్ష్యపరుస్తూ, చులకనచేస్తూ... ఓహ్..ఏమి అధారటీ...నీ వంశాన్ని వృద్ధిచేసే క్రమంలో...తన కన్న తల్లిదండ్రుల్ని, తోబుట్టువులనీ, బంధుమిత్రులనీ. అందరినీ, ఆఖరికి తన చదువు సంధ్యల్నీ తనకిష్టమయిన హాబీలను అన్నింటినీ...మూటకట్టి అటకమీద పెట్టేసి నువ్వే తన ప్రపంచం అనుకునే వ్యక్తినా నువ్విలా చూస్తున్నావ్ నాన్నా..." అంటూ ఆవేశపడింది**

అందునా అమ్మమీద..వస్తే మరీనూ...ఆవిడ ఫీలింగ్స్‌ని రవ్వంతైనా కేర్ చెయ్యవు. నాముందే తీసిపారేస్తావ్...అలాచేస్తే నా దృష్టిలో అమ్మ చులకనవదా...? అసలు అమ్మ...నీకని కలిపిన పిండి, అందులోకని తరిగినవన్నీ విడివిడిగా పెట్టింది. నేనే మా ఫ్రెండు వాళ్ళింటికెళ్ళే తొందరలో అంతా పిండిలో కలిపేసి వేసేశాను..తొందరగా అవుతాయిగదా అని.... అయినా ఇంతటి చిన్న పొరపాటుకి అంతటి తిరస్కారమా...?ఎంతో ఆశ్చర్యమూ, మరెంతో బాధా కలిగాయి ఆ ఇరవైయ్యేళ్ళ అమ్మాయికి.

నీకోసం తనవాళ్ళందరినీ వదులుకుని... నిన్ను నమ్మి.. నీ చిటికెన వేలు పట్టుకుని నీ ఇంటికొచ్చిన అమ్మ... అమ్మనా.. రోజు మొత్తంలో ఎందుకో అందుకు.. ఎంతమాట పడితే అంతమాటా అనేస్తూ ఉంటావ్. తన కడుపున పుట్టిన పిల్లల ముందే ఇష్టం వచ్చినట్లు ఈసడిస్తూ, నిర్లక్ష్యపరుస్తూ, చులకనచేస్తూ... ఓహ్..ఏమి అధారటీ...నీ వంశాన్ని వృద్ధి చేసే క్రమంలో...తన కన్న తల్లిదండ్రుల్ని, తోబుట్టువులనీ, బంధుమిత్రులనీ. అందరినీ, ఆఖరికి తన చదువు సంధ్యల్నీ తనకిష్టమయిన హాబీలను అన్నింటినీ... మూటకట్టి అటకమీద పెట్టేసి నువ్వే తన ప్రపంచం అనుకునే వ్యక్తినా నువ్విలా చూస్తున్నావ్ నాన్నా..." అంటూ ఆవేశపడింది అనేకంటే ఆక్రోశించింది అంటేనే సబబు.

తండ్రిపై కోపంతో హాల్లో అసహనంగా పచార్లు చేస్తున్న కూతురిని చూసి అవాక్కయ్యింది తల్లి రాగిణి. "తప్పమ్మా నాన్నతో అలా మాట్లాడకూడదు.. పెద్దవాళ్ళని ఎదిరించకూడదు.." అంటూ ఇంకా ఏదో చెప్పబోతున్న భార్యని " చాల్లే.... ఊరుకో..." అంటూ గదమాయించాడు.

ఈ గదమాయింపులు ఆవిడకేమీ కొత్తకాదు కాబట్టి నిర్లిప్తంగా చూస్తూండిపోయింది భర్తకేసి.

కూతురిమీద మట్టుకు కోపం రాలేదు. కోపిష్టిగాని, మూర్ఖుడు కాదుగా. కూతురి వ్యాఖ్యలు ఆతడిలో ఆలోచనలు రేకెత్తించాయి.

హాల్లో పరుచున్న నిశ్శబ్దాన్ని పటాపంచలు చేస్తూ, 'అయినా... అమ్మా... తప్పంతా నీదే...' అనేసింది తరుణ.

"అదేవిటీ మళ్ళీ... నన్ను వెనకేసు కొస్తున్నావనుకుంటే..." నివ్వెరపోయింది రాగిణి.

హాల్లో ఓమూలగా నుంచున్న రాగిణి దగ్గరకు వచ్చి "అవును నేను కూడా నిన్నే అంటాను. చిన్నపిల్లయినా చెల్లి చెబుతుంటే బాబాయి ఆలోచిస్తున్నాడు. ఎప్పుడో నువ్వే ఆ పనిచేసుంటే ఎంత బావుండిపోను. నిన్నెంత మాట అన్నా నీలో కొంచెం కూడా స్పందన ఉండదు. పాజిటివ్ అయినా నెగెటివ్ అయినా స్టోన్‌ఫేసుతో నిలబడతావు. టేకిట్ గ్రాన్టెడ్ లాగా.." అని పిన్నిని మందలించాడు అప్పుడే వాళ్ళింటికొచ్చిన చైతన్య.

"నువ్వు కూడా నన్నే అంటున్నావా" అన్నట్లు మూగగా అక్కగారి కొడుకైన చైతన్యవైపు చూసింది.

"వర్క్‌షాప్‌లో ప్రొడక్టులో తప్పులు దొర్లితే వర్కర్లని మందలించినట్టు, ప్రతి విషయాన్నీ భూతద్దంలో చూసినట్టుగా పెద్దది చేసి కసురుతుంటావు పిన్నిని. తప్పు బాబాయ్"అన్నాడు తరుణ తండ్రినుద్దేశించి.

'మరే' అని అన్నగార్ని సమర్ధించిన తరుణ "అమ్మేవన్నా నీ సబార్డినేటా..? షీ ఈజ్ యువర్ లైఫ్ పార్టనర్..'

"నేనూ పెద్దదాన్నయ్యాను నాన్నా... నా ముందు మా అమ్మని అంటే నేనేమీ ఊరుకోను..టేక్కేర్ అంటున్నావా?" అన్నాడు లేని కోపాన్ని అభినయిస్తూ తరుణ వాళ్ళనాన్న.

"భార్యా...పిల్లల దగ్గర కూడా మన మూడ్‌ని అదుపులో పెట్టుకోవాలా...." అనే ధోరణి చాలా మంది మగవాళ్ళలో ఉంటుంది. తెలిసికొంత-తెలీక కొంత నెగెటివ్ మూడ్‌ని స్వేచ్ఛగా బైటపెట్టేస్తూ ఉంటారు. నేనూ అంతే. ఒక్కోసారి నీలాగే మా అమ్మతో రఫ్‌గా మాట్లాడేస్తూ ఉంటాను. అఫ్‌కోర్స్.. ఆవిడ నీలాక్కాదు నన్ను మొహం వాచేలా చీవాట్లేస్తుంది. దాంతో ఆలస్యంగానైనా నా తప్పు నేను తెలుసుకుంటాను..." అన్నాడు చైతన్య.

'కానీ నువ్వలా కాదు.. ఏవీ అనుకోదులే అనే నీ ధోరణికి ఆవిడకూడా ఏవీ అనుకోకూడదు కామోసు...అని తన భావాలన్నీ అణిచేసుకోవడం అలవాటు చేసుకుంది. అలా అణచుకుని ... అణచుకుని.. మా ఫ్రెండు వాళ్ళమ్మలా విసిగిపోయి... ఏ ఉద్యోగమో చూసుకుని వర్కింగ్ ఉమెన్స్ హాస్టల్లో చేరిపోతుంది. అప్పుడుగ్గానీ అమ్మ విలువ నీకు తెలిసిరాదు...' అంది తరుణ భవిష్యద్దర్శినిలా.

కూతురి భవిష్యవాణి మాటెలా ఉన్నా తన ధోరణిని మార్చుకుని, సహజీవన సారాన్ని సామరస్యంగా మార్చుకోవాలని దృఢంగా నిర్ణయించుకున్నాడు. భార్యకేసి ప్రేమగా చూపులు సారించాడు. అయితే అయితే అతగాడి భార్య, అతని చూపులకు అవలగా హాలు గుమ్మానికి ఆనుకొని వున్న

పడగ్గది బీరువా తలుపు తెరిచి లోపలనుండో కవరు తీసుకొస్తూ కనిపించింది.

ఆవిడ చేతిల్లోంచి ఆ కవరుని గభాల్న లాక్కొని తీసి చూశాడు. అందులోని విషయం అతడిని అబ్బురపరిచింది.

"అలా చూస్తారేం...కంగ్రాట్యులేట్ చెయ్యకుండా..." అంది దబాయిస్తూ రాగిణి.

భార్య ధోరణిని పట్టించుకోకుండా "ఉద్యోగంలాగే హాస్టలు కూడా చూసుకున్నావా...?" నీరసంగా, జావగారిపోతూ అడిగాడు.

తల్లి సమాధానం కోసం చెవులు రిక్కబెట్టుకుని వింటోంది తరుణ.

"భార్యా భర్తల మధ్య...ఆ మాటకొస్తే కుటుంబ సభ్యుల మధ్య కూడా మర్యాదపూర్వకమైన ప్రేమాభిమానాలు ఉండాలి. పరస్పర అనుబంధాల వల్ల ఉండే వ్యక్తుల ఉనికి ముందు... ఇవన్నీ తాత్కాలికోపసమనాలే..."అంటూ కవరుకేసి చూస్తూ అంది రాగిణి.

"ఆర్థిక స్వాతంత్ర్యం ఒక్కటే కుటుంబ సభ్యుల నుంచి గౌరవాన్ని ఇస్తుంది. అంటే నేను ఒప్పుకోను సుమా...అంటోంది అమ్మ. కదూ...అన్నయ్యా...' అంది సంబరంగా తరుణ. అంతలోనే సీరియస్‌గా ఆలోచించడం మొదలుపెట్టింది.

"అయినా కొన్ని సమస్యలకు ఉద్యోగం చెయ్యడం కూడా చక్కటి పరిష్కారం" అన్నాడు ఏదో ఆలోచిస్తూ చైతన్య.

"లేదు తరుణా... అనేక పరిష్కారాలలో ఇదొకటి మాత్రమే.

మీనాన్న వ్యక్తిగా చాలా మంచివాడు. మంచి వ్యక్తి. మంచి భర్త కాకపోవడానికి అనేక కారణాలుంటాయి. పరిస్థితులని చేజారనివ్వకుండా చేస్తున్న ప్రయత్నం మాత్రమే ఇది". అంది చిన్నగా నవ్వుతూ రాగిణి.

●

**8వ పేజీ తరువాయి**

రాలేదు. శతకోటి ప్రయత్నాలు చేసిన రాజును ఆమె దరిచేరనివ్వలేదు. సామ,దాన,భేద, దండోపాయలన్నీ ఉపయోగించాడు. దృఢమైన ఆమె సంకల్పం ముందు అవన్నీ ఎందుకూ పనికిరాలేదు. (పూర్వం రాజులకు రాజ్యకాంక్షతోపాటు స్త్రీ కాంక్ష కూడా ఉండేది. యుద్ధంలో ఓడిపోయిన రాజులు తన తనయలను కప్పానికి బదులుగా ఇచ్చి పెండ్లి చేసి రాజీ పడేవారు) రాజుకిది అంతుతేలని సమస్యగా తయారయింది. నిరాశ, నిస్పృహలతోపాటు కోపం కూడా వచ్చింది.

ఒకరోజున రాజు నిండు సభలోకి అక్కమహాదేవిని పిలిపించాడు. అందరి సమక్షంలో ఆమె నిర్ణయాన్ని తెల్పమన్నాడు. జంకు గొంకూ లేకుండా నిర్భయంగా ఆమె తన నిర్ణయాన్ని సభాముఖంగా వెల్లడించింది. రాజుగారు కోపగించుకుని 'నేనంటే ఇష్టం లేనప్పుడు నీవంటిమీద నగలు నావి కావున అవి ఇచ్చివేసి నీ ఇష్టమొచ్చిన చోటుకు వెళ్ళి పొమ్మ'న్నాడు. నగలతోపాటు కట్టుకున్న బట్టలు కూడా మీవేనని చెప్పి బట్టలు విడిచి నగ్నంగా శ్రీశైలం వచ్చేసింది. బాహ్య ప్రపంచాన్ని విస్మరించి శివధ్యానంలో లీనమయింది. శివభక్త సాహిత్యాన్ని గీతాలలో రచించింది. కర్నాటకలో నేటికీ అక్కమహాదేవి భక్తిగీతాలను పాడుకుంటారు. శ్రీశైలం వెళ్ళినవారికి ఆమె ధ్యానం చేసిన గుహలు దర్శనమిస్తాయి.

మూడవ దిగంబర కవయిత్రి 14వ శతాబ్దానికి చెందింది. భూలోక స్వర్గంగా కొనియాడబడుతున్న కాశ్మీర్ ఆమె జన్మస్థానం. లాల్‌దేడ్ (అల్లేశ్వరి). ఆమెను ఆమె మామగారు, 'పర పురుషుల ముందు అందరి ఎదుటా నగ్నంగా తిరగటానికి నీకు సిగ్గులేదా? బిడియమనిపించటం లేదా?' అని అడిగారు. దానికామె 'ఇక్కడ మగవాళ్ళెవరున్నారు? వాళ్ళంతా గొర్రెలు' అని సమాధానం చెప్పింది. సమాజంలో అందరి ఎదుట నగ్నంగా ఉండటం సభ్యత కాని మాట నిజమే. కాని ఆ ముగ్గురు దిగంబర సన్యాసి కవయిత్రులు తాము నమ్మిన బాట నడిచి భక్తి సాహిత్యానికి సృష్టికర్తలయ్యారు.

★

## హైకూలు

సత్తెమ్మ చిల్లర కొట్టుఎత్తేశారు
నే పుట్టక ముందు నుండి ఉంది
మాయదారి వాల్‌మార్టు వాడు
చేశాడు కనికట్టు
మూయించాడు చిల్లరకొట్లు

**- బి. సుధా కిరణ్**

---

పక్షుల భాష
అర్థం కాలేదా?
చెట్టు నాటినందుకు
ప్రశంసలవి

రాతి గోడలకు
బంగారు తొడుగా?
దాచేస్తే దాగదు
చరిత్ర

చంపడానికి
ఆయుధాలెందుకు?
ఒక్కమాట చాలు
ప్రాణం తీయడానికి

నోరున్న మూగవాళ్ళు
ఎవరో తెలుసా?
ఎస్ఎంఎస్‌లు
నొక్కే వాళ్ళు

నీ అవయవాలన్నీ
పనిచేస్తున్నాయిగా
మరి నువ్వెందుకు
చెయ్యవు?

**- డా॥ ఇ.విష్ణువందనాదేవి**

# జాతిపిత ఆకాంక్షలు

అక్టోబర్ 2 గాంధీజయంతి సందర్భంగా

- అల్లూరి మన్మోహిని.

బ్రిటీష్ సామ్రాజ్యవాదుల వలస పాలనకు వ్యతిరేకంగా సాగిన స్వాతంత్రోద్యమంలో స్త్రీలు సంసారాలను, పసిబిడ్డలను వదిలేసి గర్భవతులు కూడా జైళ్ళలోనే పురుళ్ళు పోసుకుని చేసిన త్యాగాలు. అశేష భారత జాతికి అది స్వర్ణయుగం. "స్త్రీలు తలచుకుంటే రెండు నెలల్లో ప్రభుత్వాలనే మార్చేయగలరు" అని గాంధీజీ తన జ్ఞాపకాలలో వ్రాసుకున్నారు. ఆ సందేశానికి అక్షరాలా రుజువు ఆంధ్రప్రదేశ్‌లో 1992-94లో జరిగిన సారా వ్యతిరేక ఉద్యమం. అది స్త్రీల గుండెల మంటల్లోంచి ఉవ్వెత్తున వచ్చిన స్వచ్ఛంధ పోరాటం. తమ సంసారాలు, బిడ్డల భవిష్యత్తు కోసం మూడు కోట్ల ఆంధ్ర మహిళా లోకం సింహాల్లా విజృంభించి ప్రభుత్వ సారా మద్యం వ్యాపారాన్ని గడగడలాడించారు. మహిళల ఆగ్రహానికి కాంగ్రెసు ప్రభుత్వం కుప్పకూలింది.

**గాంధీజీ మరో సందేశం:** "స్త్రీలు అర్ధరాత్రి రోడ్లపై నిర్భయంగా నడవగలిగినప్పుడే దేశానికి నిజమైన స్వాతంత్ర్యం వచ్చినట్లు" అంటే గాంధీజీ సందేశం ప్రకారం ఇది స్వతంత్ర భారతం కాదు. దానికి రుజువు ఈనాడు స్త్రీలకు పట్టపగలే ఇంటా బయటా రక్షణ లేదు. మహిళ మార్కెట్లు సరుకుగా దోచుకోబడుతోంది. బాలికలు, యువతులు వ్యభిచార కేంద్రాలకు ఎగుమతి చేయబడుతున్నారు. అందుచే ఇది స్వతంత్ర భారతం కానేకాదు. అత్యాచారాల భారతం. అవినీతి కుంభకోణాల భారతంగా గిన్నీస్ బుక్‌లోకెక్కుతోంది. అంటరానితనం, అస్పృశ్యతా నివారణం. మతోన్మాదాన్ని నిరసిస్తూ హిందూ ముస్లిం భాయీ, భాయీ అని గాంధీజీ నినదించారు. కాని అంటరానితనం యధేచ్ఛగా కొనసాగుతూనే ఉంది. దేశంలో మతోన్మాదం పెరిగిపోయి దైవం పేరుతో రక్తపాతం జరుగుతోంది. దీనికి ఉదా: అయోధ్యలో బాబ్రీమసీదు కూల్చివేతతోపాటు ఒరిస్సాలో ఒక కుష్టువ్యాధుల హాస్పిటల్‌లో సేవచేయటానికి ఆస్ట్రేలియా నుండి వచ్చిన 'స్టైన్' దొరను ఆయన ఇద్దరు బిడ్డలతో నిద్రిస్తున్న సమయంలో సజీవ దహనం చేసారు.

**సత్యం, అహింస:** పాలక వర్గాల విధానాల చాటున స్వతంత్ర భారత సిరి సంపదలు, నవనాగరిక దోపిడీ శక్తుల వలన అవినీతి కేంద్రాలలో లక్షల కోట్ల ధనరాశులు చేరిపోయాయి. అందుకే పాడిపంటలు సిరిసంపదలతో తులతూగాల్సిన బంగారు భారతంలో కోటాను కోట్ల ప్రజలు ఆకలి, పేదరికంలో అల్లాడుతున్న దుస్థితి. నిజంగా భారతదేశంలో దరిద్రం లేదు. ఇది తెచ్చిపెట్టిన దరిద్రం. దేశంలో పుష్కలంగా ఉన్న ఖనిజసంపద! ఎటుచూసినా



జీవనదులు. కానీ గుక్కెడు మంచినీళ్ళు కరువు. వ్యవసాయం నిర్వీర్యమై బంగారం పండే పంటపొలాల్లో రైతన్నల శవాలు.

**హింసా భారతం: గాంధీజీ ఆశయం అహింస:** కాని నేటి భారతం హింసా పూరితం. ఎక్కడ చూసినా అరాచక శక్తుల గూండాల వీరవిహారం. అంతులేని ధనదాహంతో మానవత్వం లేని దోపిడీ శక్తుల దుష్టకృత్యాలతో ఎక్కడ చూసినా స్త్రీ పురుషుల దిక్కులేని శవాలు. అహింస అవహేళన అయింది.

**గాంధీజీ ప్రాణం రాట్నం:** విదేశీ వస్త్ర బహిష్కరణ ఖాదీ ఉద్యమం. రాట్నమే ఆయన చేతిలోని బాణం. ఇంటింటికి రాట్నం, ప్రతి ఒక్కరూ నూలు వడకటం, ఖద్దరు ధరించటం అది ఒక పవిత్ర ఆశయంగా ఎంతో ఆదర్శంగా అమలు జరిగింది. ఇళ్ళలో నూలు వడుకుతూ స్త్రీలు రాట్నాన్ని వర్ణిస్తూ పాడుకునే ఒక పాట నాకు కొంచెం గుర్తుకు వస్తోంది.

**పాట:** పాడవే రాట్నమా ప్రణయ భారత గీతిక
పాడవే ఆడలేక తురనీ ఆటయే మాకోట
పాడవే కదురాడినన్నాళ్ళు కరువులే లేవాయో
కదురాగిపోగానే కడకండ్లు ఘనమాయో
పాడవే విశ్వ సోదర భావ విజ్ఞాన విభవంబు,
వెలయించి ఖండాంత వెలయంబు కూర్పులే
పాడవే రాట్నమా ప్రణయ భారత గీతి

కాంగ్రెసు జెండా మీదే రాట్నం గుర్తు ఉండేది. దానిని తొలగించారు. రాట్నాన్నే ఒక దైవంగా ఆరాధించేవారు. చేనేత పరిశ్రమే కుప్పకూలింది.

గాంధీజీ తన ఆత్మకథలో దేశభవిష్యత్తు గురించి వ్రాస్తూ అసలు కాంగ్రెసు పార్టీనే రద్దు చేయమన్నారు. స్వాతంత్ర్యం సాధించే వరకే కాంగ్రెసు సంస్థ పాత్ర. స్వతంత్రం వచ్చాక దీనికి పరిపాలించే స్థితి లేదు అన్నారు. కానీ ఆపని జరగలేదు. ఆ ఫలితం ఆనాడు దేశం అనుభవిస్తోంది. దోపిడీ శక్తుల స్వైర విహారం సాగిపోతోంది.

ఉపాధి లేక మగ్గంమీద నేసినా కడుపునిండక, అప్పులతో, పస్తులతో వేలాదిమంది చేనేత కార్మికుల ఆకలి చావులు భారత దేశంలో గ్రామాల్లో నివసిస్తోంది. గ్రామీణ జీవితం నిర్వీర్యమైంది. గ్రామవాసులు వలస పక్షులైపోయారు. అఖండ భారతం కుక్కలు చింపిన విస్తరైపోయింది. బ్రిటీష్ సామ్రాజ్యవాదం అనుసరించి విభజించి పాలించు అనే ఎత్తుగడల పంథా కొనసాగుతోంది. వలస పాలనలతో ప్రపంచ దేశాల మీద పెత్తనం చేస్తూ యుద్ధోన్మాద సామ్రాజ్యవాద శక్తులకు ఈ స్థితి పరమానందం.

గాంధీజీ తన ఆత్మకథలో దేశభవిష్యత్తు గురించి వ్రాస్తూ అసలు కాంగ్రెసు పార్టీనే రద్దు చేయమన్నారు. స్వాతంత్ర్యం సాధించే వరకే కాంగ్రెసు సంస్థ పాత్ర. స్వతంత్రం వచ్చాక దీనికి పరిపాలించే స్థితి లేదు అన్నారు. కానీ ఆపని జరగలేదు. ఆ ఫలితం ఈనాడు దేశం అనుభవిస్తోంది. దోపిడీ శక్తుల స్వైర విహారం సాగిపోతోంది.

మహాత్ముడు ఆశించిన నిజమైన స్వతంత్ర భారతాన్ని భావితరం సాధించాలి. మరో స్వతంత్రోద్యమాన్ని ప్రారంభించాలి. జాతికే జన్మనిచ్చిన తల్లులుగా మన బిడ్డల బంగారు భవితకోసం ఉద్యమించాలి. మరోసారి స్త్రీశక్తిని చాటాలి.

●

# అమ్మా....వస్తాడు

ఎవరు ఎవరి చుట్టూ తిరుగుతున్నా
తిరగనివ్వండి
భూమి కూడా తిరుగుతుంది-
అమ్మా...!కంట్లో నలుసు పడిందని, మనసుకు ముల్లు గుచ్చుకుందని బాధపడకు
తిరగని, గుదిబండలా మెడకు డాలర్ బిళ్ళ తగిలించుకుని,
కంప్యూటర్ బాస్ చుట్టూ తిరగనీ.
కొంగు బంగారమైన చోట
బంగారు అంగడి ముందు బొమ్మగా
వాడి కొంగు తిరగనీ-
తిరగనీ ఒంటరి ఒంటరిగానే తిరగనీ
వాడి ఒంటరి ఇంద్రుడికి, సింహాసనం కథ చెప్పే
ల్యాప్‌టాప్ చుట్టూ తిరగనీ
అమ్మా...బాధపడకు, వస్తాడు!
నీవు లేకున్నా నాన్న ప్రక్కన వున్న నీ ఫోటో కోసమైనా వస్తాడే...!
పగిలిన అద్దం ముక్కల మీద, సాలెగూడు చూస్తూ
దుఃఖం అభివృద్ధిగా మారిన చోట నిలబడలేక
తిరిగి తిరిగి వస్తాడే...!

★ ★ ★

తిరుగుతున్న భూమిమీద
ఒంటరి తిరుగుడు మీ
డాలర్ బాస్‌మీద.... బాణం ఎక్కుపెట్టిందు కదా
పొదల చాటున మనిషి సమూహంగాన్....-
అమ్మా....వస్తాడు
తూర్పుగాలి మీద సితార సంగీతమై
ఒక లేఖతో వీరుడు నీ కొడుకుగా వస్తాడు!
సరస్సులో కలువలని త్రుంచుకుని, కొత్త నమూనాలతో
తప్పిపోయిన సజీవ కొడుకుల్ని సమాధులలోంచి
త్రవ్వి తీసుకువస్తాడు. కొత్త సృష్టి మీ సంతకంతో వస్తాడే...!
అమ్మా....వస్తాడు!

- జనజ్వాల

# హిస్టరెక్టమి - తెలుసుకోవలసిన వాస్తవాలు

- డాక్టర్ భారతీ సాగర్

హిస్టరెక్టమి అనే పదం ఈ మధ్యకాలంలో మహిళలందరూ అతి తరచుగా వింటోన్న ఒక వైద్య పరిభాషిక పదం. దీని అర్థం గర్భసంచిని శస్త్ర చికిత్స ద్వారా తొలగించడం. హిస్టరెక్టమీ అనేది గ్రీకు పదం. హెస్టెరా అంటే గర్భసంచి అని ఎక్టోమియా అంటే కత్తిరించి తీసివేయుట అని అర్థం. ఈ శస్త్ర చికిత్స గైనకాలజికల్ (మహిళలకు సంభవించే వ్యాధులుకు) చేసే శస్త్ర చికిత్సలన్నింటిల్లోకి అత్యంత సాధారణమైనది. ఈ ఆపరేషన్ మూడు విధాలు.

1. టోటల్ హెస్టెరెక్టమీ అనగా గర్భాశయాన్ని పూర్తిగా తొలగించేది.

2. సబ్ -టోటల్ హెస్టెరెక్టమి. అనగా గర్భాశయాన్ని అసంపూర్ణంగా తొలగించేది (సర్విక్స్ అంటే గర్భాశయ ద్వారమును ఉంచి మిగిలిన గర్భసంచి తొలగించేది).

3. రాడికల్ హెస్టెరెక్టమీ అనగా గర్భసంచితోపాటు యోనిపై భాగం, అండాశయాలు, అండవాహికలు, పారామెట్రియం వీటిని కూడా తొలగించేది.

ఈ ఆపరేషన్ సాధారణంగా మహిళల్లో స్త్రీ జననేంద్రియాలకు సంబంధించిన ప్రాణాంతకమైన క్యాన్సర్ లాంటి వ్యాధులలో చేయవలసిన చివరి అస్త్రము ఇది. కానీ అభివృద్ధి చెందిన మరియు అభివృద్ధి చెందుతున్న దేశాలలో కూడా అనవసరంగా అత్యధిక సంఖ్యలో మహిళలకు చేస్తున్నారు. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో 2004 సంవత్సరంలో 6,17,000 హిస్టెరెక్టమీ ఆపరేషన్లు చేశారు. ఇందులో 90% పైన బినైన్ కండిషన్స్ కోసం చేసినవి.

**శస్త్ర చికిత్స చేయటానికి కారణాలు:**

1. గర్భకోశ సంబంధిత క్యాన్సర్లు, గర్భసంచి, గర్భకోశ ముఖద్వారా, అండాశయ, గర్భకోశ లోపలిపొర క్యాన్సర్లు.

**2. గర్భాశయ ఫైబ్రాయిడ్లు:-** అన్ని ఫైబ్రాయిడ్ కణితుల్లో ఆపరేషన్ అవసరం పడదు. చికిత్సకు లొంగని, చాలా




పెద్దసైజులో ఉండి దాని ప్రభావం ఇతర అవయవాలపైన పడుతూ ఉన్నప్పుడే శస్త్రచికిత్సఅవసరం అవుతుంది. ఉదా: మూడు సెం.మీ పరిమాణంలో గర్భసంచి లోపలిపొరలో ఉన్న ఫైబ్రాయిడ్ కణితులు ఒక్కోసారి అత్యధిక రక్తస్రావానికి దారితీస్తాయి. ఈ రక్తస్రావం ఋతుసమయంలో కానీ, నెలలో ఎప్పుడైనా కానీ కూడా అవుతూఉండవచ్చు. ఇటువంటి పరిస్థితిలో రక్తస్రావం ఏ చికిత్సకు లొంగకుండా ఉండే పరిస్థితిలో గర్భసంచిని తొలగించాల్సి వస్తుంది. అట్లాగే ఫైబ్రాయిడ్ కణితి 10సెం.మీ పరిమాణంలో ఉండి తద్వారా గర్భసంచి పరిమాణంలో పెద్దదై దాని పక్కనున్న ప్రేగులకు అతుక్కొని పోవటం లేదా మూత్రనాళం మీద ఒత్తిడి కలిగించి సమస్యలు ఉత్పన్నం చేస్తున్న స్థితిలో హిస్టరెక్టమీ చేయవచ్చు.

అయితే భారతదేశంలో ఒకటి లేదా రెండు సెం.మీ పరిమాణంలో ఉండి కొద్దిగా అధిక రక్తస్రావం ఉండి, మెనోపాజ్ కి దగ్గరగా ఉన్న స్త్రీలలో కూడా ఇది ఎక్కువగా చేస్తున్నారు. మెనోపాజ్‌కి దగ్గరగా ఉన్న స్త్రీలలో ఫైబ్రాయిడ్ కోసం గర్భసంచి తొలగించే అవసరం దాదాపుగా ఉండదు.

సాధారణంగా ఫైబ్రాయిడ్ కణితి ఉందని తెలియగానే కార్పొరేట్ ఆసుపత్రుల్లో గైనకాలజిస్టు చెప్పే మొదటి మాట ఈ కణితి క్యాన్సర్ గడ్డగా మారే అవకాశం ఉంది, అందువలన తొలగించాల్సి ఉంటుంది అని, కాన్సర్ అనే మాట కలిగించే భయం వలన సగం మంది స్త్రీలు, వారి కుటుంబ సభ్యులు గర్భసంచి తొలగించే ఆపరేషన్‌కు ఒప్పుకుంటున్నారు. ఫైబ్రాయిడ్ క్యాన్సర్‌గా మారటం అనేది అత్యంత అరుదుగా జరిగే పరిణామం.

గర్భసంచి తొలగింపు అనేది ఒక్కొక్క కేసుని కూలంకషంగా పరిశీలించి రోగి స్థితిని, వయస్సుని, రాబోయే ఉపద్రవాలను అంచనా వేసుకుని నమ్మకమైన వైద్యులచేత నిర్ణయించాల్సిన విషయం.

1. ప్రసూతి సమయంలో అత్యవసర పరిస్థితుల్లో గర్భసంచిలో కొంత భాగం

తీసివేయటం చేస్తారు. ప్రసవం అయిన తరువాత గర్భసంచి నుండి రక్తస్రావం ఆగని పరిస్థితిలో లేదా గర్భకోశం పగిలిన సందర్భాలలో అత్యవసరంగా తొలగించాల్సి వస్తుంది.

**4. ఎండో మెట్రియాసిస్:-** గర్భసంచి లోపలిపొర, గర్భాశయం మధ్య బాహ్య పొరలోకి, గర్భాశయం పైన పెరిగే వ్యాధి. ఇది చికిత్సకి లొంగకుండా ఉంటే గర్భసంచి తొలగించాల్సి వస్తుంది.

5. గర్భసంచిలో ఉన్న ఫైబ్రాయిడ్స్ వల్లకాని, ఎండోమెట్రియాసిస్ వలన కాని పొత్తి కడుపులో విపరీతమైన నొప్పి వస్తున్నపుడు అది చికిత్సకు లొంగని స్థితిలో గర్భసంచి తొలగించాల్సి వస్తుంది.

అయితే మహిళలందరికీ ఓ అపోహ ఉంటుంది. పిల్లలు పుట్టటం అయిపోయింది. ఫైబ్రాయిడ్ లాంటి చిన్న చిన్న సమస్యలు కూడా ఉన్నాయి. గర్భసంచీ తీయించుకుంటే పోతుంది అని అనుకుంటారు. ఇంకొక అపోహ ఏమిటంటే గర్భసంచి తొలగించినా అండాశయాలుంటాయి కదా, మెనోపాజల్ సమస్యలు తలెత్తవు అనుకుంటారు. కానీ అది సరికాదు.

ఎందుకంటే గర్భాశయం తొలగించే ఆపరేషన్ చేసి అండాశయాలు అట్లాగే ఉన్నా కూడా హిస్టెరెక్టమీ ఆపరేషన్ వలన అండాశయాలు వాటి విధులను నిర్వర్తించటంలో విఫలమవుతాయి. ఇది ఆపరేషన్ అయిన వెంటనే జరగవచ్చు లేదా కొన్ని రోజులు తరువాత అయినా జరగవచ్చు. అండాశయాల కర్తవ్య లోపం ఆస్టియో పోరోసిస్ (బోలు ఎముక వ్యాధి లేక ఎముక పెళుసు బారటానికి)కు దారి తీస్తుంది. చిన్న వయస్సులోనే ఈ ఆపరేషన్ చేయటం వలన స్త్రీలు తొందరగా హృద్రోగాల బారిన పడతారు. ఎముకలు, కండరాలు పటుత్వం కోల్పోతాయి. జననేంద్రియాలలో ఇన్ఫెక్షన్లు అధికంగా వస్తాయి. మానసిక ఆందోళన, డిప్రెషన్, నాడీ వ్యవస్థకు సంబంధించిన సమస్యలు తలెత్తుతాయి.

LIFE-HRG అనే సంస్థ ఇటీవల మెదక్ జిల్లాలోని గ్రామీణ ప్రాంతాలలో చేసిన అధ్యయనం ద్వారా చిన్న వయసులో హిస్టెరెక్టమీ ఆపరేషన్స్ చేయించుకున్న స్త్రీలలో కలుగుతున్న దుష్పరిణామాలు గురించిన చాలా విషయాలు వెలుగులోకి వచ్చాయి. అధ్యయనంలో భాగంగా వీరు 40 సంవత్సరాలకు లోబడి వయస్సు ఉండి అనవసరంగా గర్భసంచి తొలగించే శస్త్ర చికిత్స చేసిన 171మంది గ్రామీణ మహిళలను మెదక్ జిల్లాలోని ఒక పరిపాలనా సమితి మునిపల్లె మండలం నుండి రిజిస్టరు చేసుకొని వారిలో ఆపరేషన్ తరువాత కలిగిన దుష్ఫలితాలను, భారతీయ వైద్య పరిశోధనా మండలి రూపొందించిన నైతిక విలువలకనుగుణంగా వైద్యులు రోగి గురించి జాగ్రత్తలు తీసుకుంటున్నారా లేదా అనేది అధ్యయనం చేశారు.

**వీరి అధ్యయనంలో తేలిన విషయాలు ఏమిటంటే:**

1. రిజిస్టరు అయిన స్త్రీలలో అత్యధికులు సుమారు 14 సంవత్సరాల వయస్సులో పెళ్ళి అయినవారు మరియు మొదటి ప్రసవం 16 సంవత్సరాల వయస్సులో జరిగిన వారున్నారు.

2. 171మందిలో 154మంది ఆపరేషన్ జరిగినపుడు సరాసరి వయస్సు 28.5 సంవత్సరాలు. వీరిలో కూడా 60 శాతం మంది స్త్రీలలో 24.6 సంవత్సరాలకే ఆపరేషన్ జరిగింది.

3. వీరిలో సుమారు 95%మంది ప్రైవేటు వైద్యశాలల్లో ఆపరేషన్ చేయించుకున్నారు.

4. ప్రైవేటు హాస్పిటల్స్‌లో ఆపరేషన్ చేసిన అందరూ ఆరోగ్యంగా ఉన్న స్త్రీలే. ఎక్కువ సమస్యలుండి ఆపరేషన్ అవసరం అయిన వాళ్ళని మాత్రం గవర్నమెంటు ఆసుపత్రులకి రిఫర్ చేశారు.

5. ప్రైవేటు ఆసుపత్రుల్లో చేసిన ఆపరేషన్లు అన్నింటికి సరియైన పోస్ట్ ఆపరేషన్ నోట్ కాని ఆపరేషన్‌కి తగిన కారణాలు కానీ రాయబడలేదు. ఈ పత్రాల ద్వారా రోగులలో చేసిన ముఖాముఖి ద్వారా తెలిసిన విషయం అత్యధిక స్త్రీలలో ఆపరేషన్ అనవసరంగా చేశారు అని.

6. వీరిలో గుర్తింపతగిన శాతం మంది స్త్రీలలో అండాశయాలు కూడా తీసివేయడం జరిగింది. ఇలా అండాశయాలు తొలగించటం వలన ఆ స్త్రీలలో అకస్మాత్తుగా మెనోపాజ్ వచ్చేస్తుంది.

7. ఇది సహజంగా జరిగే మెనోపాజ్‌కి వ్యతిరేకం. సహజంగా వచ్చే మెనోపాజ్ క్రమక్రమంగా వస్తుంది. కాని సర్జికల్ మెనోపాజ్‌లో ఇది అకస్మాత్తుగా రావటం వలన స్త్రీ శరీరంలోని ఈస్ట్రోజన్ లెవల్స్ ఒక్కసారిగా పడిపోతాయి. ఆస్ట్రోజన్ హార్మోన్ కేవలం ప్రత్యుత్పత్తి కార్యంలోనే కాక శరీర క్షీణతని అంటే శరీరంలోని ఎముకలు మొదలుగునవి క్షీణించి పోకుండా ఆపుతుంది.

8. ఆపరేషన్ తరువాత చేయవలసిన ఫాలో అప్ కూడా అన్ని కేసుల్లో జరగటం లేదు. చాలా తక్కువ కేసుల్లోనే గర్భసంచి కానీ ఇతర కణజాలం కాని హిస్టోపథాలజి పరీక్షలకి పంపటం జరిగింది.

పై విషయాలన్నీ గమనించిన తరువాత మనం తెలుసుకోవలసిన దేమిటంటే గర్భసంచిని తొలగించే ఆపరేషను అత్యవసర స్థితిలో ఉన్న భయంతోనో, మన అవసరం కోసమో, గర్భసంచి అవసరం తీరిపోయిందనో చేయించుకోరాదు. ఏదైనా గర్భసంచిలోకానీ, జననేంద్రియాలలో కానీ సమస్యలు ఉత్పన్నమైనపుడు నమ్మకమైన వైద్యుల సలహా తీసుకొని విషయ నిర్ధారణ చేసుకున్న తరువాతనే ముందడుగు వెయ్యాలి. అవసరమైతే ఇద్దరు, ముగ్గురు వైద్యుల సలహా కూడా తీసుకోవచ్చును.

## మైక్రో ఫైనాన్స్ సంస్థల

# దోపిడీకి ఊతమిస్తున్న కేరళ ప్రభుత్వం

(కేరళ ఐద్వా రాష్ట్ర కమిటీ సమర్పించిన పత్రం)

అనేక రాష్ట్రాలలోని మహిళలు ప్రైవేటు మైక్రో ఫైనాన్స్ సంస్థల నుండి తీసుకున్న అప్పుల కారణంగా అప్పుల ఊబిలో కూరుకుపోయి ఆత్మహత్యలు చేసుకుంటున్న పరిస్థితులలో అందుకు భిన్నంగా కేరళలో ఎల్‌డిఎఫ్ ప్రభుత్వం చేత మరియు స్థానిక పంచాయితీల అజమాయిషీలో దిగ్విజయంగా నడపబడుతూ ఒక ప్రత్యామ్నాయంగా జనరంజక పథకంగా కేరళలో కుటుంబశ్రీ పథకం నడిచింది. ఈ పరిస్థితుల్లో అధికారంలోకి వచ్చిన యుడిఎఫ్ ప్రభుత్వం ఈ కుటుంబశ్రీ పథకానికి తూట్లు పొడిచి ప్రైవేటు మైక్రోఫైనాన్స్ సంస్థలు కేరళలో కూడా వేళ్ళూనుకునేలా చేసింది.



కేరళ రాష్ట్రంలో గతంలో అధికారంలో ఉన్న ఎల్‌డిఎఫ్ ప్రభుత్వం పేద వ్యవసాయ కార్మిక మహిళలకు సాధికారత కల్పించేందుకై ప్రతిష్టాత్మకమైన 'కుటుంబశ్రీ' పథకాన్ని ప్రారంభించింది. కుటుంబశ్రీ పథకంలో 49,500 స్వయం ఉపాధి గ్రూపులు ఉన్నాయి. ఇవి స్థానిక పంచాయితీల అజమాయిషీతో వ్యవసాయ రంగంలో అనేక సంవత్సరాల నుండీ విజయవంతంగా నడుస్తున్నాయి. ఈ పథకంలో 2,62,000 మంది మహిళలు 47,000 హెక్టార్ల భూమిలో వ్యవసాయ పనులలో నిమగ్నమై ఉన్నారు. ఈ పథకం క్రింద ఇంత పెద్ద యెత్తున వ్యవసాయ పనులు జరగడానికి గతంలో ఉన్న ఎల్‌డిఎఫ్ ప్రభుత్వం అందించిన ఆర్థిక సహకారం. ఈ మహిళా గ్రూపులు వ్యవసాయం చేసి ఆ వ్యవసాయ ఉత్పత్తుల అమ్మకం ద్వారా పండుగ సీజన్లలో 10 నుండి 12 కోట్ల రూపాయల వరకూ అదనపు ఆదాయాన్ని సమకూర్చుకునేవారు.

ఈ కుటుంబశ్రీ పథకం క్రమంగా 1041 కోట్ల రూ॥ల పెట్టుబడి కలిగి వుండే స్థాయికి ఎదగడవే కాక 970 కోట్లరూపాయల బ్యాంక్ లింకేజి కలిగి వుండి 26కోట్ల మ్యాచింగ్ గ్రాంట్‌తోనూ ఇంకా అనేక వేల కోట్ల ఉత్పాదక కార్యక్రమాలతోనూ ప్రతిష్టాత్మకంగా పురోగమిస్తుంది. ఇంత దిగ్విజయంగా నడుస్తున్న కుటుంబశ్రీ పథకం ఒక తేనెతుట్టిలా కాంగ్రెస్ నాయకులకు కనిపించింది. కనుక ఈ కుటుంబశ్రీ పథకాన్ని దారి మళ్ళించి ప్రైవేటు మైక్రోఫైనాన్స్ సంస్థల కైవసం చేయడానికి కాంగ్రెస్ నాయకులు కుట్రపన్నారు.

కేంద్ర ప్రభుత్వం తన విధానాల్లో భాగంగా ఒక వైపు క్రమంగా సంక్షేమ పథకాలను ఉపసంహరించుకొని పేద ప్రజలు అప్పుల కోసం ప్రైవేటు ఫైనాన్స్ సంస్థలపై ఆధారపడే పరిస్థితిని కల్పిస్తున్నది. ఈ విధానాలలో భాగంగానే కేరళలో అధికారంలోకి వచ్చిన యుడిఎఫ్ ప్రభుత్వం కుటుంబశ్రీ పథకానికి బదులుగా ప్రైవేటు ఫైనాన్స్ సంస్థలకు ఊతమిచ్చే జనశ్రీ అనే పథకాన్ని ప్రవేశపెట్టింది.

అనేక రాష్ట్రాలలోని మహిళలు ప్రైవేటు మైక్రో ఫైనాన్స్ సంస్థల నుండి తీసుకున్న అప్పుల కారణంగా అప్పుల ఊబిలో కూరుకుపోయి ఆత్మహత్యలు చేసుకుంటున్న పరిస్థితులలో అందుకు భిన్నంగా కేరళలో ఎల్‌డిఎఫ్ ప్రభుత్వం చేత మరియు స్థానిక పంచాయితీల అజమాయిషీలో దిగ్విజయంగా నడపబడుతూ ఒక ప్రత్యామ్నాయంగా జనరంజక పథకంగా కేరళలో కుటుంబశ్రీ పథకం నడిచింది. ఈ పరిస్థితుల్లో అధికారంలోకి వచ్చిన యుడిఎఫ్ ప్రభుత్వం ఈ కుటుంబశ్రీ పథకానికి తూట్లు పొడిచి ప్రైవేటు మైక్రోఫైనాన్స్ సంస్థలు కేరళలో కూడా వేళ్ళూనుకునేలా చేసింది. ఎమ్‌ఎమ్ హసన్ అనే కాంగ్రెస్ నాయకుని ఆధ్వర్యంలో ఒక ప్రైవేటు ఫైనాన్స్ సంస్థను 2006లోనే ప్రారంభించారు. అప్పట్లోనే దీనిపై అనేక విమర్శలు వచ్చాయి. మహిళల ఐక్యతను విచ్ఛిన్నం చేయడానికి మరియు ప్రభుత్వ సహకారంతో నడుస్తున్న కుటుంబశ్రీ పథకాన్ని నీరుగార్చడానికే ఈ పథకాన్ని ప్రారంభించారని పలువురు ప్రముఖులు దీనిని విమర్శించారు. కానీ కాంగ్రెస్ నాయకులు ఈ జనశ్రీ పథకం పేద ప్రజలకు మేలు చేసేందుకే ప్రారంభించినట్లు వాదించారు. కానీ గత 6 సం॥లో ముఖ్యంగా 2011లో కేరళలో యుడిఎఫ్ ప్రభుత్వం ఏర్పడిన తరువాత ఈ సంస్థ అవినీతి గురించి కుటుంబశ్రీలోని లక్షలాది కార్యకర్తల భయాలు నిజమేనని నిరూపించబడ్డాయి.

కేంద్ర ప్రభుత్వ పథకమైన రాష్ట్రీయ వ్యవసాయ వికాస యోజన పథకం క్రింద వ్యవసాయ రంగంలోనూ పాడి పరిశ్రమలోను కొన్ని ప్రభుత్వేతర సహకార సంస్థలు తమ కార్యకలాపాలు నిర్వహిస్తున్నాయి. ఈ పథకంలో అనేక నిబంధనలున్నాయి. ఈ సంస్థలు మొదట జిల్లా స్థాయిలోను తరువాత రాష్ట్ర స్థాయిలోనూ అనుమతి పొందాలి. తరువాత స్థానిక పంచాయితీల అజమాయిషీలో ఈ సంస్థలు తమ కార్యకలాపాలు సాగించాలనే నిబంధనలున్నాయి. అయితే ఈ నిబంధనలేవీ పాటించకుండానే కేరళలోని యుడిఎఫ్ ప్రభుత్వం జనశ్రీ పథకానికి రాష్ట్రీయ వ్యవసాయ వికాస పథకానికి క్రింద 14.18 కోట్ల రూపాయలను అడ్డదారిలో కేటాయించింది. ఈ రంగంలో పనిచేస్తున్న అనేక సంస్థలను ప్రక్కనపెట్టి ఏమాత్రం అనుభవంలేని ఈ జనశ్రీ సంస్థకు ఇంత పెద్ద మొత్తంలో నిధులు కేటాయించడం యుడిఎఫ్ ప్రభుత్వ కపటనీతికి నిదర్శనం.

కేరళలోని వామపక్ష ప్రభుత్వం కుటుంబశ్రీని రాజకీయం చేసిందని ఆరోపించిన కాంగ్రెస్ పార్టీ ఇప్పుడు స్వయంగా కాంగ్రెస్ నాయకులచే నడపబడుతున్న ప్రైవేటు మైక్రో ఫైనాన్స్ సంస్థ అయిన జనశ్రీ పథకానికి మొత్తం రాష్ట్ర ప్రభుత్వం యంత్రాంగాన్నంతటినీ ఉపయోగించడానికి పూనుకుంది. ఈ ప్రైవేటు మైక్రోఫైనాన్స్ సంస్థ ఈ సంవత్సరం మే-జూన్ నెలల్లో ఒక శిక్షణా కార్యక్రమం చేపట్టింది. దానికి కావలసిన మొత్తం నిధులను రాష్ట్ర ప్రభుత్వం సమకూర్చింది. జనశ్రీ అమలు చేసే ప్రాజెక్టులకు, సంబంధించిన ఈ శిక్షణా కార్యక్రమాన్ని రాష్ట్ర ప్లానింగ్ బోర్డ్ అధికారికంగా సమర్ధించడమే గాక తన అధికారులు తప్పనిసరిగా ఈ ట్రైనింగ్‌కు హాజరు కావాలని ఆదేశించింది. ఈ ప్రాజెక్టులకు సంబంధించిన రెండోదశ కార్యక్రమాలు ఇప్పుడు ఈ విధంగా శిక్షణ పొందిన అధికారులచే అమలు చేయబడుతున్నాయి. 12వ పంచవర్ష ప్రణాళిక పనుల కంటే ఎక్కువ ప్రాధాన్యత ఈ జనశ్రీ ప్రాజెక్ట్ పనులకే ఇవ్వాలని అధికారులను ప్రభుత్వం ఆదేశించింది. రాష్ట్ర పిసిసి అధ్యక్షుడు జనశ్రీకి, కాంగ్రెస్‌కూ సంబంధం లేదని చెప్పే మాటలు శుద్ధ అబద్ధాలని దీని ద్వారా రుజువవుతుంది.

> **కేరళ మహిళలు కాంగ్రెస్ నాయకుల ఆధ్వర్యంలో నడుస్తున్న ఈ ప్రైవేటు మైక్రో ఫైనాన్స్ సంస్థలపై తమ పోరాటాన్ని ఎక్కు పెట్టారు. కుటుంబశ్రీ రక్షణ ఫోరమ్ పేరుతో నిరవధిక పోరాటాలు చేస్తున్నారు. ఈ పోరాటంలో తిరువనంతపురంలోని లక్షలాది సాధారణ మహిళలు రాత్రనకా పగలనకా పట్టుదలగా పోరాడుతున్నారు.**

జనశ్రీ మొదలైనప్పటి నుండి యుడిఎఫ్ పాలనలోని అనేక పంచాయితీలు కుటుంబశ్రీ స్వయం ఉపాధి గ్రూపులను వాటి సంస్థలను నిర్వీర్యం చేసి జనశ్రీ వైపు మళ్లించే ప్రయత్నాలు చేశాయి. ఈ పంచాయితీలలోని కుటుంబశ్రీ కార్యకర్తలు దీనిని ఆపడానికి అనేక పోరాటాలు చేశారు. కుటుంబశ్రీ పథకంలోని అనేకమంది అధికారులను కాంగ్రెస్ ప్రభుత్వం జనశ్రీ పథకానికి బదిలీ చేసి వారి సంబంధాలతో ఈ కొత్త జనశ్రీ పథకానికి మహిళలను సమీకరించేలా చేసింది. చాలా పంచాయితీల్లో కుటుంబ సొసైటీలోని ఆఫీస్ బేరర్లనే జనశ్రీ పథకానికి బదిలీ చేసి స్థానిక మహిళలలో అనేక సందేహాలు కలిగేలా కాంగ్రెస్ ప్రభుత్వం చేసింది. కాంగ్రెస్ నాయకులు తమ రాజకీయ పలుకుబడినుపయోగించి మహిళలను ఆర్థికంగా, మానసికంగా ఒత్తిడి చేసి జనశ్రీ పథకంలో సభ్యులుగా చేర్చుకున్నారు. వాణిజ్య బ్యాంకులను ఒత్తిడి చేసి ఏవిధమైన గ్యారంటీ లేకుండానే ఈ జనశ్రీలోని ఒక్కో గ్రూపుకు 50,000రూ॥ రుణం మంజూరు చేసేలా చేశారు. దీన్ని బట్టీ కాంగ్రెస్ నాయకులు తమ ప్రయోజనాల కోసం రాజకీయ పలుకుబడిని ఏవిధంగా ఉపయోగించుకుంటారో తెలుస్తుంది.

ఈ ప్రైవేటు మైక్రో ఫైనాన్స్ సంస్థలు మహిళలను అనేక విధాలుగా మభ్య పెడుతున్నాయి. తొందరగా డబ్బు సంపాదించవచ్చని, రుణాలు పొందవచ్చనీ ఆశపెడుతున్నాయి. కానీ ఈసంస్థలు పేద మహిళల నుండి 100 నుండి 150 శాతం వరకు వడ్డీలు రాబట్టుకుంటూ అనేక లక్షల మంది మహిళలకు ఆత్మహత్య తప్ప వేరే దారిలేని పరిస్థితులు కల్పిస్తున్నాయి.

యుపిఎ ప్రభుత్వం మైక్రోఫైనాన్స్ సంస్థలను అదుపుచేయడం కోసమని పార్లమెంటులో పెట్టిన బిల్లులో కూడా ఈ అధిక వడ్డీ రేట్లపై నియంత్రణ మాత్రం విధించలేదు. ఒక ప్రసిద్ధ జర్నలిస్టు మరియు సామాజిక పరిశోధకులైన 'దేవేందర్ శర్మ' ఈ మైక్రో ఫైనాన్స్ సంస్థల దోపిడీపై ఈ విధంగా వ్యాఖ్యానించారు. "ఇప్పుడు షేక్‌స్పియర్ గనుక బ్రతికి వుంటే మన దేశంలోని మైక్రో ఫైనాన్స్ సంస్థల దోపిడీని తెలపడానికి తన ప్రసిద్ధ నవల "మర్చంట్ ఆఫ్ వెనిస్ యొక్క రెండవ భాగాన్ని రాసి వుండేవారని" అన్నారు. అంటే దేశంలో మైక్రో ఫైనాన్స్ సంస్థల దోపిడీ ఎంత తీవ్రంగా ఉందో అర్థం చేసుకోవచ్చు.

కేరళ మహిళలు కాంగ్రెస్ నాయకుల ఆధ్వర్యంలో నడుస్తున్న ఈ ప్రైవేటు మైక్రో ఫైనాన్స్ సంస్థలపై తమ పోరాటాన్ని ఎక్కు పెట్టారు. కుటుంబశ్రీ రక్షణ ఫోరమ్ పేరుతో నిరవధిక పోరాటాలు చేస్తున్నారు. ఈ పోరాటంలో తిరువనంతపురంలోని లక్షలాది సాధారణ మహిళలు రాత్రనకా పగలనకా పట్టుదలగా పోరాడుతున్నారు.

ఐద్వా నాయకురాలు, మాజీ మంత్రి అయిన పి.కె. శ్రీమతి ఈ ఫోరమ్‌కు ఛైర్ పర్సన్‌గా ఉన్నారు. పార్లమెంట్ మెంబర్ టి.ఎన్. సీమ దీనికి కన్వీనర్‌గా ఉన్నారు. ప్రపంచంలోనే ప్రతిష్ఠాత్మకంగా నడిచిన కుటుంబశ్రీ పథకానికి ప్రాణం పోసిన వామపక్షం ఈ పోరాటానికి మద్దతుగా నిలిచింది.

ప్రభుత్వానికి సంబంధించిన 14.18 కోట్ల రూపాయలను ఈ జనశ్రీ పథకానికి అడ్డదారుల్లో తరలించడాన్ని ఆపేవరకూ కేరళ మహిళలు పట్టుదలగా పోరాడడానికి సన్నద్ధమయ్యారు.

**అనువాదం - కె.ఎస్.ఎల్**

దేశ నలుమూలలకూ విస్తరించిన టెలివిజన్ రంగంలో వస్తున్న అసభ్యకర సన్నివేశాల పట్ల యువత ఎక్కువగా ఆకర్షితులవుతున్నారు. దీంతో మహిళ అంటే కేవలం సెక్స్‌కి సంబంధించిన వస్తువుగానే నేటి యువత మనసుల్లో నాటుకుపోయింది. ఒక ఉపాధ్యాయురాలికి, విద్యార్థికి మధ్య ప్రేమాయణాన్ని చూపిస్తూ అసభ్యకర సన్నివేశాలను చిత్రాలలో ప్రదర్శిస్తుంటే ముక్కున వేలేసుకోగలుగుతున్నామే గానీ వాటిని ఆపగలుగుతున్నామా? కొన్ని మహిళా సంఘాలు, సామాజిక కార్యకర్తలూ గొంతు బొంగురు పోయేలా ఇలాంటి చిత్రాలను నిలిపివేయండి సమాజంలోకి తప్పుడు సంకేతాలు వెళుతున్నాయని ఎంత నినదించినా ప్రభుత్వం ఎటువంటి చర్యలకూ ఉపక్రమించటం లేదు.

# నిజం మాట్లాడుకుందాం

(ఒక శ్రేయోభిలాషి మనోగతం.)

- పువ్వాడ వెంకటేష్

వేయి వసంతాల వాసంతిలో
వేల కోకిలల గాన మాధుర్యాలు
పలికే బోసి నవ్వులు
మిన్నేటి సూర్యుడు వెలుగులలో
కోనేటి సరస్సుల నడుమ
మెరిసే కమలాల రూపం కలిగిన
అమ్మాయిలు ఈ రోజు యాసిడ్ రూపంలో
కురూపియై విలపిస్తుంటే
ఆ వనితల, గీతికల, శోధనల,
రోదనల ఆధారంగా మనం
'నిజం మాట్లాడుకుందాం"

ప్రపంచ మనుగడలో మనం మనుషులుగా విస్తరించావేగానీ, మానవత్వంగా విస్తరించలేకపోయాము. ఇది నిజం. దీనికి కారణాలు ఏవైనా కావచ్చు. కానీ ఈ రోజు స్త్రీ అస్థిత్వానికే పెనుముప్పు వాటిల్లుతుంది. మహిళలపై జరుగుతున్న యాసిడ్ దాడులు, కత్తిపోటులు, అత్యాచారాలు, హత్యల గురించి ప్రతిరోజూ మనం పత్రికలలో చదువుతున్నాము. అయ్యో పాపం! అని ఒక్కక్షణం బాధపడుతున్నాము. ఇలాంటివి కామన్‌గా మారిపోయాయని అర్థరహితమైన భావంతో ఇది సాధారణమని మనం సరిపెట్టుకుంటున్నాము. ఇటువంటి చర్యలకు ఫుల్‌స్టాప్ పెట్టి శాశ్వత పరిష్కారాన్ని ఆలోచించడంలో ప్రభుత్వ విధానాలు దారుణంగా విఫలమవుతున్నాయి. ఇది ప్రతి ఒక్కరూ అంగీకరించవలసిన నిజం. అయిదారేళ్ల బాలికలపై లైంగికవేధింపులు, పదహారేళ్ల అమ్మాయిని తననే ప్రేమించమని మృగాడు చేసే అరాచకము, యుక్త వయస్సులో వున్న ఆడపిల్లలు తమ కోర్కెలను తీర్చలేదని కామాంధులు చేసే అత్యాచారాలు, హత్యలను తలుచుకుంటుంటేనే ఒళ్ళు గగుర్పాటు పడుతుంది. ఇలాంటి చర్యలను ప్రభుత్వాలు ఉపేక్షిస్తున్నాయి? అసలు మగవాళ్ళలో ఇంత పైశాచికత్వమూ, అరాచకత్వమూ ఇంతలా పేట్రేగి పోవడానికి కారణాల గురించి మనం ఒకసారి సమాలోచించుకోవాలి. నివారణ చర్యలను మరోసారి పునఃసమీక్షించుకోవలసిన అవసరం ఉంది.

మారుతున్న కాలానుగుణంగా వస్తున్న ప్రస్తుత సినిమాలు ఇప్పుడు మరింత ఊపునందుకున్నాయి. వాటిల్లోని అసభ్యకర సన్నివేశాలనూ, పాటలనూ, చూస్తుంటే అవి ప్రస్తుత పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని చిత్రించినట్లు లేవని మనం గమనించాలి. అవి భవిష్యత్ ప్రమాణాలతో రానున్న కాలంలో స్త్రీ ఇలావుండవచ్చు అనే పిచ్చి ఆలోచనలతో చిత్ర రంగంలో స్త్రీ పాత్రను భ్రష్టు పట్టిస్తున్నారు. దేశ నలుమూలలకూ విస్తరించిన టెలివిజన్ రంగంలో వస్తున్న అసభ్యకర సన్నివేశాల పట్ల యువత ఎక్కువగా ఆకర్షితులవుతున్నారు. దీంతో మహిళ అంటే కేవలం సెక్స్‌కి సంబంధించిన వస్తువుగానే నేటి యువత మనసుల్లో నాటుకుపోయింది. ఒక ఉపాధ్యాయురాలికి, విద్యార్థికి మధ్య ప్రేమాయణాన్ని చూపిస్తూ అసభ్యకర సన్నివేశాలను చిత్రాలలో ప్రదర్శిస్తుంటే ముక్కున వేలేసుకోగలుగుతున్నామే గానీ వాటిని ఆపగలుగుతున్నామా? కొన్ని మహిళా సంఘాలు, సామాజిక కార్యకర్తలూ గొంతు బొంగురు పోయేలా ఇలాంటి చిత్రాలను నిలిపివేయండి సమాజంలోకి తప్పుడు సంకేతాలు వెళుతున్నాయని ఎంత నినదించినా ప్రభుత్వం ఎటువంటి చర్యలకూ ఉపక్రమించటం లేదు. మనుషులుగా మనమెక్కడికి వెళుతున్నామని ప్రశ్నించుకుంటే ఒకింత బాధ కలుగక తప్పదు.

స్త్రీ, పురుష సంబంధ బాంధవ్యాలలో అహంకార సహితులైన కొంతమంది మగవాళ్ళ ఫీలింగ్స్‌లో కూడా మార్పు రావలసిన అవసరం ఎంతైనా ఉంది. మనది ఆధిపత్యం అనే భావన నుంచి సమానత్వం అనే ధోరణి రావాలి. పాశ్చాత్య సంస్కృతి, సాంప్రదాయాలే నేటి ఫ్యాషన్‌గా మన జీవన విధానం మారుతున్నది. అది మన దౌర్భాగ్యం.

దేశంలో ఏదో ఒక ప్రాంతంలో ప్రతిరోజూ మహిళలపై దాడులు జరుగుతూనే ఉన్నాయి. ప్రతి ఒక్కరూ వీటిని ఖండిస్తూనే ఉన్నారు. మహిళా సంఘాలు ధర్నాలు చేస్తూనే ఉన్నాయి. కానీ దాడులకు కారకులైన వారికి సరి అయిన శిక్ష పడేలాచర్యలు తీసుకోవడంలో ప్రభుత్వం పూర్తిగా విఫలమవుతోంది. అరెస్టయిన మరునాడే బెయిల్‌పై బయటకు వచ్చి సభ్య సమాజంలో సంచరిస్తున్నారు. ఈ విధానంపై కఠిన నిర్ణయాలను తీసుకొని దోషులకు సరి అయిన శిక్ష పడేలా వీలుండే చట్టాలను తీసుకొని వచ్చినప్పుడే దాడులకు సంబంధించి కొంతైనా మార్పును మనం చూడగలం.

తరువాయి 23వ పేజీలో

# 'పూటకూళ్ళమ్మ'

– ఓల్గా

కన్యాశుల్కం గురించి రాయటానికి ఏం మిగిలింది? ఎంతో మంది ఎన్నో విశ్లేషణలు చేశారు. నేనే నాలుగైదు వ్యాసాలు రాశాను. కానీ గురజాడ 150వ జయంతి సందర్భంగా ఒక వ్యాసం రాయమని రాజాం మిత్రులు రామినాయుడు ఉత్తరం. దాదాపు 103 ఏళ్ళ క్రితం గురజాడ రాసిన నాటకం 103 ఏళ్ళనుంచీ చర్చించబడుతోంది. దానిలో ఎన్ని విశేషాలో ఉన్నాయని చెప్పుకున్నాం. ఇంకా ఏముంది రాయటానికి? అనిపించింది. సరే, ఈ వంకన మళ్ళీ ఒకసారి 'కన్యాశుల్కం' తీసి చదువుదాం అనుకుని పుస్తకం తీశాను. ఎంతో ప్రేమగా ఆ పాత పుస్తకపు స్పర్శను అనుభవిస్తూ గురజాడ గురించి ఆలోచిస్తూ నాటకం ప్రథమాంకం తీసి చదువుతూ మొదటి లైన్లో రెండో వాక్యం దగ్గర ఆగిపోయాను.

గిరీశం స్వగతంతో నాటకం ప్రారంభమవుతుంది. మొదటి వాక్యం 'సాయంకాలమైంది' అని సమయాన్ని సూచించే వాక్యం. రెండో వాక్యంలో మొదటి పదం దగ్గర ఆగిపోయాను. 'పూటకూళ్ళమ్మ'! ఔనూ – ఎవరీ పూటకూళ్ళమ్మ? కన్యాశుల్కం నాటక ప్రారంభంతోనే ఆ పాత్రను పరిచయం చేసి ఆ తర్వాత కొద్ది క్షణాలపాటు ప్రవేశపెట్టి నాటకం మీద ఆసక్తిని రేకెత్తించే ఈ పూటకూళ్ళమ్మ పాత్ర ప్రాధాన్యత ఏమిటి? అనలెందుకు ఈ నాటకంలో పూటకూళ్ళమ్మ? గిరీశం ఎలాంటివాడో మొదటి రంగంలోనే ప్రేక్షకులకు చెప్పేందుకేనా? తర్వాత రంగంలో రామప్పంతులికి నాటకం ఆఖరున జరగవలసిన చీపురుదెబ్బల సత్కారం మొదట్లోనే చేయించేందుకా? ఈ రెండు పనులూ పూటకూళ్ళమ్మ చేసింది. కానీ ఆ పాత్ర గురించి మనం ఆలోచించటానికి ఇంకేమైనా ఉందా? కేవలం ఒక హాస్య సన్నివేశ కల్పనకోసం వచ్చిపోయిన పాత్ర మాత్రమేనా? అలా ఊరికే వచ్చి పోయినట్లుండే పాత్రలు కన్యాశుల్కంలో కొన్ని ఉన్నాయి. వాటన్నిటి గురించి తర్వాత ఆలోచించవచ్చు. ముందు పూటకూళ్ళమ్మ గురించి ఆలోచిద్దామనిపించింది.

పూటకూళ్ళమ్మ బ్రాహ్మణ వితంతువు. ఆవిడ ఎలా వితంతువైందో గిరీశం చెప్పిన మాటలు యధాతథంగా నమ్మాల్సిన అవసరం లేదు. గానీ తప్పటడుగులు వేసే పసిదానికి ఒక కునిష్టి ముసలాడికి కట్టబెట్టటమనే వాస్తవాన్ని ముందుమాటలోనే కాకుండా నాటకంలో కూడా గురజాడ రికార్డు చేశాడు. ఆ తండ్రికి కేవలం కన్యాశుల్కం మీద ఆశేకాదు–అల్లుడి ఆస్థి మీద కూడా ఆశ ఉంది. ఆ ముసలాడి వారసుల మీద దావా తెచ్చాడు. పెళ్ళి చేసిన పురోహితుడు ఆ వారసుల దగ్గర లంచం పుచ్చుకుని ఆ ముసలాడు తాళి కట్టకుండానే చనిపోయాడని సాక్ష్యమిచ్చాడు. దావాలు, సాక్ష్యాలు, కేసు కొట్టెయ్యడాలు అన్నీ జరిగాక కూడా పూటకూళ్ళమ్మ వితంతువుగా మిగిలిపోయింది. ఈ మధ్యలో డబ్బు చేతులు మారింది. డబ్బు మారకంలో సరుకుకి మాత్రం ఒక ముద్రపడింది. ఆ ముద్ర ఎవరూ చెరపలేనిది. కన్యాశుల్కం నాటకంలో ముగ్గురు వితంతువులు ఉన్నారు. పూటకూళ్ళమ్మ, బుచ్చమ్మ, మీనాక్షి. ఈ ముగ్గురూ మూడు రకాల పరిస్థితులలో ఉన్నారు. పూటకూళ్ళమ్మ చిన్నసైజు భోజనశాల నడుపుతూ బతుకుతోంది. గిరీశం వంటివారి వల్ల మోసపోతూ గొడవపడుతూ ఉంది. మీనాక్షి లుబ్ధావధాన్ల కూతురు. తండ్రిని కనిపెట్టుకుని ఉంటోంది. రామప్పంతులుతో సంబంధం ఉంది. ఆమె ప్రవర్తన తిన్నగా లేదని' అనేక పాత్రలు మాట్లాడతాయి. ఇక బుచ్చెమ్మ తండ్రి ఇంట్లో చాకిరి చేస్తూ బతికే అమాయకురాలు. 'ఔను కాబోలు' అంటూ తల్లికోసం, చెల్లికోసం బాధపడుతుంటుంది. తన గురించి తాను ఆలోచించుకోవాలని కూడా తెలియనిది.

ఈ ముగ్గురు బ్రాహ్మణ వితంతువుల ద్వారా ఆనాటి అగ్రవర్ణ వితంతువుల స్థాయిని, వితంతు పునర్వివాహ చట్టాన్ని అర్థం చేసుకునే వీలుందా? భారతీయ స్త్రీల స్థితిని ఉద్ధరించాల్సి వుందని పదేపదే ప్రకటించిన వలస పాలకుల ఉద్ధరణ కార్యక్రమ స్వభావాన్ని అర్థం చేసుకోవటానికి వీలుందా? ఈ దృష్టితో చూసినప్పుడు పూటకూళ్ళమ్మ పాత్రకో ప్రత్యేకత ఉందనిపించింది. భారతదేశంలో వలస ప్రభుత్వం ఒక బూర్జువా శాసన,

> **భారతదేశంలో వలస ప్రభుత్వం ఒక బూర్జువా శాసన, పాలన యంత్రాంగాన్ని సృష్టించింది. ఐతే ఆ పాలన యంత్రాంగం చేసే పని మాత్రం భూస్వామ్య భావజాల రూపాలనూ, వ్యవస్థలనూ యధాతథంగా అమలుచేయటమే. ఈ రూపాలు వ్యవస్థలూ అన్నీ లైంగిక శ్రమ విభజన మీద ఆధారపడినవే ఈ శ్రమ విభజన గురించి ఆలోచనగానీ, దానిని తాకే ఉద్దేశ్యంగానీ వలస పాలకులకు లేదు. కనీసం వివాహాన్ని పూర్తిగా ఒక సివిల్ ఒప్పందం లాగా రూపొందించి అమలు చెయ్యాలనే ఆలోచన కూడా లేదు.**

పాలన యంత్రాంగాన్ని సృష్టించింది. ఐతే ఆ పాలన యంత్రాంగం చేసే పని మాత్రం భూస్వామ్య భావజాల రూపాలనూ, వ్యవస్థలనూ యథాతథంగా అమలుచేయటమే. ఈ రూపాలు, వ్యవస్థలూ అన్నీ లైంగిక శ్రమ విభజన మీద ఆధారపడినవే. ఈ శ్రమ విభజన గురించి ఆలోచనగానీ, దానిని తాకే ఉద్ధేశ్యంగానీ వలస పాలకులకు లేదు. కనీసం వివాహాన్ని పూర్తిగా ఒక సివిల్ ఒప్పందం లాగా రూపొందించి అమలు చెయ్యాలనే ఆలోచన కూడా లేదు. లేకపోగా భారతదేశంలో అమలులో ఉన్న భూస్వామ్య నీతి సూత్రాలకు తన విక్టోరియన్ నీతి సూత్రాలను జోడించి ఈ రెండింటితో స్త్రీలను మరింత బలంగా కుటుంబ నియంతృత్వానికి బంధించి ఆ కుటుంబపు పగ్గాలను తమ చేతిలో ఉంచుకునే తంత్రం నడిపారు. కుటుంబంలో రకరకాలుగా ఉండే పితృస్వామిక లైంగిక శ్రమ విభజన విధానాలను అలాగే కొనసాగించటమే కాక కుటుంబానికి వెలుపల ఉండే వ్యభిచార వ్యవస్థనూ, అక్కడి శ్రమను తాము కంట్రోలు చెయ్యటానికి పూనుకున్నారు. కన్యాశుల్కం రెండో రంగంలోనే ఈ రెండు రకాల శ్రమలూ పూటకూళ్ళమ్మ, మధురవాణి రూపాలలో ఎదురుబొదురుగా నిలబడతాయి. వలస పాలకుల రాజకీయ అణచివేతను, వారి సాంస్కృతిక జోక్యాన్నీ వేరుచేసి చూడలేము. సాంస్కృతిక విషయాలు కూడా రాజకీయ విషయాలేననేది, వ్యక్తిగతం కూడా రాజకీయమేనని స్త్రీవాదులు చెప్పిన తరువాత తేలికగానే అర్థం చేసుకోవచ్చు. స్త్రీలకు సంబంధించిన ఈ సాంస్కృతిక జోక్యంలోని హిపోక్రసీని కన్యాశుల్కం నాటకం చాలా బాగా బైటపెడుతుంది.

ఈ హిపోక్రసీతోనే వితంతు పునర్వివాహ చట్టం, ఆడపిల్ల భర్తతో కాపురం

**కుటుంబపు పగ్గాలను తమ చేతిలో ఉంచుకునే తంత్రం నడిపారు. కుటుంబంలో రకరకాలుగా ఉండే పితృస్వామిక లైంగిక శ్రమ విభజన విధానాలను అలాగే కొనసాగించటమే కాక కుటుంబానికి వెలుపల ఉండే వ్యభిచార వ్యవస్థనూ, అక్కడి శ్రమను తాము కంట్రోలు చెయ్యటానికి పూనుకున్నారు. కన్యాశుల్కం రెండో రంగంలోనే ఈ రెండు రకాల శ్రమలూ పూటకూళ్ళమ్మ, మధురవాణి రూపాలలో ఎదురుబొదురుగా నిలబడతాయి. వలస పాలకుల రాజకీయ అణచివేతను, వారి సాంస్కృతిక జోక్యాన్నీ వేరుచేసి చూడలేము.**

చేసే వయసు విషయమై చట్టం (Age of consent) చేయటానికి చూపిన ఉత్సాహం బాల్య వివాహాల నిషేధంపై చూపలేదు. వారికి బాల్య వివాహాల నిషేధంపై ఆసక్తి లేదు. బాల్య వివాహాలలో పిల్లల మీద అధికారం పూర్తిగా కుటుంబాల చేతుల్లో ఉంటుంది. ఆ అధికారం ఉండటమంటే ఆ పిల్లల శ్రమను కంట్రోలు చేసే అధికారం ఉండటమే. ఆ అధికారం పరోక్షంగా, ఒకోసారి ప్రత్యక్షంగానూ మార్కెట్ ద్వారా సరుకు రూపంలో అమ్మకం, కొనుగోలు పద్ధతిలో వలస పాలకుల కంట్రోలులోకి రావాలి. దానికి అవసరమైన చట్టాలు మాత్రమే చేశారు. అడ్డుతగులుతాయనుకున్న వాటిని నిర్లక్ష్యం చేశారు.

19వ శతాబ్దంలో వితంతువుల స్థితి చాలా సంక్లిష్టమైనది. సందిగ్ధతలతో నిండినది. హిందూ కుటుంబ భావజాలంలో అగ్రవర్ణ వితంతువుకున్న బహుముఖాలను చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. హృదయం ద్రవిస్తుంది. ఒకవైపు ఏ కోరికలూ, ఆశలు, రుచులు, అభిరుచులూ లేని సన్యాస జీవితాన్ని గడపాలి. జీవచ్ఛవంలా ఉండాలి. ఇంకోవైపు భర్త ఆస్తిలో కొంత భాగానికి వారసులయ్యే అవకాశం వచ్చింది. ఒకవైపు భర్త చితిమీద కాలి బూడిదై పోగల మనోధైర్యం కలిగి జాతికి ఆదర్శంగా గుర్తింపు పొందే స్థితి (బంకించంద్రుని నవలలు, తొలినాళ్ళ జాతీయ నాయకుల ఉద్ఘాటనలు) ఇంకోవైపు కుటుంబం లోపలి, వెలుపలి పురుషుల కామవాంఛకు తన సమ్మతి లేకుండా బలవ్వాల్సిన బాధితురాలి స్థితి. తను చెడిపోగలదు. తన చుట్టూ ఆడవారిని చెడగొట్టగలదు. భ్రూణ హత్యలకు పాల్పడగల పాపాత్మురాలు. అసలు భారతాది పురాణాల ప్రకారం స్త్రీల లైంగికత్వాన్ని కంట్రోలు చెయ్యడం ఎవరి వల్లాకాదు. భీష్ముడు భారతంలో ఈ విషయాన్ని చాలా వివరంగా చెప్పాడు. ఈ విశృంఖలత్వం వితంతువుకు మరింత ఎక్కువగా ఉంటుంది. దానితో ఆమె కులాన్ని భ్రష్టుపట్టించగలదు. మతాన్ని మంటగలపగలదు. ఏ స్త్రీ అయినా ఈ పనిచేయగలదుగానీ వివాహితలకంటే ఎవరికీ చెందని వితంతువుల ద్వారా కుల భ్రష్టత్వం జరగటానికి అవకాశాలు ఎక్కువ. కాబట్టి ఆమెను కఠినాతి కఠినమైన శ్రమకు గురిచేయాలి. ఆమె అవసరాలను తగ్గించివేయాలి. ఆమెకు తక్కువ తిండి పెట్టినందుకు, ముతక బట్టలిచ్చినందుకు. తలకు నూనె కూడా ఇవ్వనందుకూ ఆమెను అనుక్షణం తక్కువగా చూస్తూ తిడుతున్నందుకూ కుటుంబంలో ఎవరూ బాధపడనవసరంలేదు. పైగా గర్వపడాలి. ఇంటిల్లిపాది ఆమె శ్రమ ఫలితాన్ని కాస్తంత మానవత్వం కూడా లేకుండా అనుభవించవచ్చు. (చూ, అరికాళ్ళ కింది మంటలు–శ్రీపాద) వితంతువు శ్రమ కేవలం

**తన కోసం కాక కుటుంబావసరాల కోసం ఎక్కడికంటే అక్కడికి నడిపించబడే శ్రమ. ఈ శ్రమ ఎవరికవసరమైతే వాళ్ళు తీసుకెళ్ళి వాడుకోవచ్చు. ఈ పరిస్థితి వచ్చినప్పుడు మరీ దిక్కులేని స్థితిలో ఉన్న బ్రాహ్మణ వితంతువులు ఇతరులకు ఇంటిపని చేసేవారిగా తమ శ్రమతో మార్కెట్‌లోకి వచ్చారు.**

భర్త ఇంట్లోనే చెయ్యాలనే నియమం సడలి ఆస్థి కోసం లేదా కేవలం శ్రమ కోసం పుట్టింటి వాళ్ళు చేరదీయవచ్చు. లేదా బంధువులు చేరదీయవచ్చు. తన కోసం కాక కుటుంబావసరాల కోసం ఎక్కడికంటే అక్కడికి నడిపించబడే శ్రమ. ఈ శ్రమ ఎవరికవసరమైతే వాళ్ళు తీసుకెళ్ళి వాడుకోవచ్చు. ఈ పరిస్థితి వచ్చినప్పుడు మరీ దిక్కులేని స్థితిలో ఉన్న బ్రాహ్మణ వితంతువులు ఇతరులకు ఇంటి పని చేసేవారిగా తమ శ్రమతో మార్కెట్‌లోకి వచ్చారు. ఇప్పుడు వాళ్ళది వెట్టి చాకిరి కాదు. మార్కెట్‌తో సంబంధంలోకి వచ్చిన శ్రమ. 'కన్యాశుల్కం' నాటకం కాలానికే వింతువుల శ్రమ గృహానికి వెట్టిగా చేసే స్థితి నుండి, మార్కెట్‌లోకి శ్రమగా తీసుకువచ్చే దశ, అది వేగవంతమయ్యే దశ వచ్చింది. ఒక సంప్రదాయ కుటుంబ నిర్మాణంలో వినియోగమయ్యే వితంతుశ్రమ మారకం ద్వారా, అందరికోసం, అందరికీ అందుబాటులోకి వచ్చే పరిస్థితిని కన్యాశుల్కంలో పూటకూళ్ళమ్మ పాత్ర ద్వారా అర్థం చేసుకోవచ్చు. ఈ వితంతువులు వంటచేసే మనుషులుగా, భోజనశాలల్లో పనిచేసేవారిగా, నడిపేవారిగా, పెళ్ళి వంటలు చేసేవారిగా, లైంగిక సుఖాలనిచ్చే వేశ్యలుగా మార్కెట్‌లోకి ప్రవేశించారు. చాలామంది గ్రామాల నుంచి పట్టణాలకు వచ్చి తమ వృత్తి సాగించాల్సి వచ్చింది. పూటకూళ్ళమ్మ అటువంటి వితంతువు. అగ్రవర్ణ వితంతు స్త్రీల శ్రమ ఇళ్ళనుండి మార్కెట్‌కి చేరిన దశను, స్థితిని పూటకూళ్ళమ్మ పాత్ర చూపిస్తుంది.

ఆనాటి సంప్రదాయపరుల దృష్టిలోగానీ, ఇప్పటి సాంప్రదాయవాదులు దృష్టిలోగానీ పూటకూళ్ళమ్మ మంచి వితంతువు కాదు. బుచ్చెమ్మ ఆ అర్థంలో మంచి వితంతువు. గిరీశం బుచ్చెమ్మను లేవదీసుకుపోవటం గురించి ఆలోచిస్తూ ఇలా అంటాడు. 'ఇలాంటి అట్టర్లీ ఇన్నోసెంట్ విడోని ఒప్పించి తీసుకుపోయి పెళ్ళాడితేనే మజా, ప్రయోజకత్వము గాని పూటకూళ్ళమ్మ లాంటి ముండని పెళ్ళాడ్డం విడో మ్యారియేజి అనిపించుకోదు. అది దొంగముండా మ్యారియేజి. ఇదేవిట్రయ్యా ఇది ఈ బుచ్చెమ్మ? సాక్షాత్తూ పరమ పవిత్రమైన విడో విత్ గిల్ట్ లెటర్స్' ఇలాంటి మంచి వితంతువులున్నది మరింత చాకిరీ చెయ్యటానికి. గిరీశం వంటివారి చేతిలో మోసపోయి మంచి వితంతువు అనే స్టాటస్‌ని పోగొట్టుకోవటానికి,వితంతువు= చాకిరి–స్టాటస్. అసలు వివాహమే స్త్రీల శ్రమను మారకం చేసుకునే క్రమంలో మొదలయింది. స్త్రీ పుట్టింటి నుంచి అత్తింట్లో శ్రమ చెయ్యటానికి వస్తుంది. ఆమె వితంతువైతే మార్కెట్‌లోకి వెళ్ళే అవకాశం కూడా ఉంటుంది. ఆమె శ్రమ ఫలితం డబ్బు రూపంలో ఆమె చేతిలోకి వచ్చే అవకాశం ఉంది. ఐతే ఆమెను అక్కడ కూడా కాస్త స్వతంత్రంగా బతకనీయకుండా ఆమె శ్రమను దోపిడీ చెయ్యటానికి గిరీశాలుంటారు. వాళ్ళ నుంచి తననూ తన శ్రమనూ రక్షించుకునేందుకు ఆ వితంతువులు చీపురుకట్ట పుచ్చుకుని తిరగగల తెగువ సంపాదించుకుంటారు. తండ్రి నీడన ఉండే బుచ్చెమ్మ గిరీశం మాటలకు 'ఔను కాబోలు' అని ఆశ్చర్యపోవటం, అతని మాటలు నమ్మి అతనితో వెళ్ళటం మాత్రమే చేయగలుగుతుంది.

మీనాక్షి రామప్పంతులి వెంటపడి తనను పెళ్ళాడమనేంత సాహసం చేయగలిగింది. పూటకూళ్ళమ్మ గిరీశం తన ఇరవై రూపాయలూ అన్యాయంగా కాజేశాడని తెలియగానే అతన్ని తన్నటానికి చీపురుకట్టతో బయల్దేరింది. దెబ్బ రామప్పంతులికి తగిలింది గానీ తన్నే సమర్థత పూటకూళ్ళమ్మకుందని నిరూపితమైంది.

**స్త్రీ పుట్టింటి నుంచి అత్తింట్లో శ్రమ చెయ్యటానికి వస్తుంది. ఆమె వితంతువైతే మార్కెట్‌లోకి వెళ్ళే అవకాశం కూడా ఉంటుంది. ఆమె శ్రమ ఫలితం డబ్బు రూపంలో ఆమె చేతిలోకి వచ్చే అవకాశం ఉంది. ఐతే ఆమెను అక్కడ కూడా కాస్త స్వతంత్రంగా బతకనీయకుండా ఆమె శ్రమను దోపిడీ చెయ్యటానికి గిరీశాలుంటారు. వాళ్ళ నుంచి తననూ తన శ్రమనూ రక్షించుకునేందుకు ఆ వితంతువులు చీపురుకట్ట పుచ్చుకుని తిరగగల తెగువ సంపాదించుకుంటారు.**

ఆ ధైర్యానికి కారణం ఆమె తన శ్రమను విలువకట్టి బతకటమే కావొచ్చు. అది గయ్యాళితనంగా కనపడినా ఆమెకైతే ఒక తెగింపు వచ్చింది. గిరీశం మాటలకు కొన్నాళ్ళే మోసపోయింది.

పూటకూళ్ళమ్మ మధురవాణి ఎదురుపడిన సన్నివేశాన్ని హాస్యాన్ని దాటి చూస్తే లోతైన అర్థమే కనిపిస్తుంది. ఒకరు వివాహ వ్యవస్థనుంచి, మరొకరు వ్యభిచార వ్యవస్థనుంచి వచ్చారు. అయితే ఇద్దరి జీవితాలకు పెద్ద తేడా లేదని స్పష్టంగా చెప్పబూనటం ఆరోజుల్లో పెద్ద సాహసమే. ఎంతో లోతైన సామాజిక విశ్లేషణ చేస్తేనే గాని చెప్పలేని విషయం. స్త్రీల శ్రమను, సేవలను పొందటానికి నెలవులుగా నిర్మాణమైన భిన్న వ్యవస్థలను దాటి వైరుధ్యాలతో, పోలికలతో చూపుతూ ఆ రెండు వ్యవస్థల మధ్యా సరిహద్దులు ఎక్కడ చెదురుతున్నాయి, ఇక్కడ ఆ రెండు వ్యవస్థలూ కలిసిపోతున్నాయి అని చూపించేందుకు మంచి ఉదాహరణ పూటకూళ్ళమ్మ. మధురవాణి కలిసే దృశ్యం. ఇంత సీరియస్ విషయాన్ని, గంభీరమైన విషయాన్ని ఎంత హాస్యంగా చెప్పాడో చూస్తే గురజాడ అసామాన్య ప్రతిభ తెలుస్తుంది.

ఆ రోజుల్లో యాంటీ నాచ్ ఉద్యమంలాగా సంస్కర్తలు ప్రచారం చేస్తున్నారు. వలస పాలకులకు అందులో ఒక ప్రయోజనం ఉంది. ఆ వ్యభిచార వ్యవస్థలో వేశ్యలకున్న వెసులుబాట్లను తీసివేసి వారి శ్రమను పూర్తిగా తమ కంట్రోలులోకి తెచ్చుకోవటవే ఆ ప్రయోజనం. ముఖ్యంగా దేవదాసీల ఆస్తి, వారసత్వ విషయాలు తమ కంట్రోలులోకి ఒక పట్టాన రాకపోవటం బ్రిటీష్ పాలకులకు చికాకు కలిగించింది. సంప్రదాయంగా ఉన్న దేవదాసీ వ్యవస్థలో ఆ కూలి వృత్తిలో ఉన్న స్త్రీల శ్రమను వారి ఆస్తిపాస్తులను కంట్రోలు చేయాలని చూశారు. అదే సమయంలో తమ జీవన పరిస్థితుల వల్ల, ఇతరేతర కారణాల వల్ల వేశ్యల వలె బతికే ఇతర స్త్రీల గురించి వారు ప్రచారం చేసే భావజాలం ఆ స్త్రీలను అర్థం చేసుకునే పద్ధతీ ఇదంతా వ్యభిచారంలో ఉన్నది శ్రమ కాదని గట్టిగా చెప్పటానికి, వ్యభిచారం నుండి శ్రమను వేరుచేసి చూడటానికీ ఉద్దేశించి ఉండేది. ఈ రెండు పనులూ వాళ్ళు విజయవంతంగా చేయగలిగారు.

కన్యాశుల్కం నాటకంలో కూడా పూటకూళ్ళమ్మ మధురవాణిని సానిగా తప్ప సాటి మనిషిలా చూడదు. తనలాగే మధురవాణి కూడా శ్రమచేసి బ్రతుకుతున్నదనే ఆలోచనే ఆమెకు రాదు. మధురవాణిని పూటకూళ్ళమ్మ చూసినట్లుగా చులకనగా చూసేవారందరినీ ఆలోచనలో పడెయ్యటానికీ, ఆ భావజాలం నుంచి బైటపడెయ్యటానికి గురజాడ మధురవాణి 'నేను మగనాల్ని కాదు. వెధవ ముండనికాదు. నా ఇంటికి వచ్చేవాడెవడైనా పల్లిగ్గానే వస్తాడు' అంటుంది. అనేకసార్లు మధురవాణి తన సంపాదనకు, బతుకుదెరువుకు ఆధారం తన యవ్వనం అని చెబుతుంది. భార్యగా సేవ, ఇంటి చాకిరి, వితంతువుగా చాకిరి, ఆ ఇంట్లో మగవారితో రహస్య సంబంధాలు, మరొకరికి ఉంపుడుగత్తెగా ఉండటం, వ్యభిచారంలో ఉండటం వీటన్నిటి మధ్య ఉన్న సరిహద్దులు ఏమిటని చూస్తే చాలాసార్లు అవి కలగలిసి ఉంటాయి. బతుకుదెరువు కోసం ఒక సరుకుగా మారి ధనచక్రంలో పడి తిరిగి పిప్పి అయిపోవటంగానే కనిపిస్తుంది.

**స్త్రీల శ్రమను, సేవలను పొందటానికి నెలవులుగా నిర్మాణమైన భిన్న వ్యవస్థలను దాటి వైరుధ్యాలతో, పోలికలతో చూపుతూ ఆ రెండు వ్యవస్థల మధ్యా సరిహద్దులు ఎక్కడ చెదురుతున్నాయి. ఎక్కడ ఆ రెండు వ్యవస్థలూ కలిసిపోతున్నాయి అని చూపించేందుకు మంచి ఉదాహరణ పూటకూళ్ళమ్మ. మధురవాణి కలిసే దృశ్యం ఇంత సీరియస్ విషయాన్ని, గంభీరమైన విషయాన్ని ఎంత హాస్యంగా చెప్పాడో చూస్తే గురజాడ అసామాన్య ప్రతిభ తెలుస్తుంది.**

కన్యాశుల్కం ఆ 'సరుకు'కి ఉన్న అన్ని పార్శ్వాలనూ చూపగలగటం వల్లనే ఇవాల్టికి సజీవ సాహిత్యంగా నిలబడి ఉంది. గురజాడ కన్యాశుల్కంలో స్త్రీల లైంగికత్వం గురించి, లైంగిక శ్రమ విభజన గురించి, స్త్రీల శ్రమ పరాయీకరణ చెందటం గురించి అడిగిన ప్రశ్నలకు మనం ఇంకా సమాధానాలు వెతుకుతూనే ఉన్నాం. సమాధానం దొరికే వరకూ కన్యాశుల్కం రిఫరెన్స్ పాయింట్‌గా చదువుతూనే ఉంటాం. మరో వందేళ్ళయినా చదవక తప్పదేమో అనిపిస్తుంది. అభివృద్ధి చెందిన రాష్ట్రమనిపించుకున్న ఆంధ్రప్రదేశ్‌లో బాల్య వివాహాల సంఖ్య అనూహ్యంగా పెరగటం చూస్తే!

**(గురజాడ 150వ జయంతోత్సవం సందర్భంగా)**

**(ఆంధ్రజ్యోతి సౌజన్యంతో...)**

**18వ పేజీ తరువాయి**

మనం బాధపడాల్సిన మరొక విషయమేమిటంటే మహిళలపై దాడులు జరుగుతున్న ప్రతిసారీ రాజకీయ మరియు ప్రభుత్వ పదవులను అలంకరించిన కొంతమంది ప్రబుద్ధులు ఈ దాడులను ఖండించకుండా స్త్రీల వస్త్ర ధారణపై విమర్శించడం ఎంత వరకు సమంజసం. పైగా వారి వేషధారణలు మగవారిని రెచ్చగొట్టే విధంగా వుండటం వలనే దాడులు జరుగుతున్నాయని అంటున్నవారిని మనం ఏమనుకోవాలి? ఆ మాటలను వారి విచక్షణకే వదిలేద్దాము. ఇది కేవలం దాడులను అరికట్టలేక అసహనంతో వారి చేతగానితనాన్ని పరోక్షంగా అంగీకరించారని మనం గ్రహించాలి.

ఇలాంటి అధికారులను నేను ఒక్కటే ప్రశ్నిస్తున్నాను. యాభై ఏళ్ళ క్రిందట వున్న భారతదేశాన్ని ఇప్పుడున్న దేశాన్ని మార్పు కోణంలో ఒకటిగా చూడగలవా? ఖచ్చితంగా చూడలేము. ఎందుకంటే కొన్ని రోజులపాటు చేస్తే గానీ పూర్తి గాని పనులు ఇప్పుడు కొన్ని గంటల్లో అయిపోతున్నాయి. ఇలా గంటలను, నిమిషాలను క్షణాలుగా కుదించుకుని ఇప్పుడు కాలాన్నే వెనక్కి నెట్టి అభివృద్ధి అంటూ ముందుకు దూసుకు పోతున్నాము. అన్ని రంగాలలో పై చేయి సాధిస్తున్న మహిళలు కూడా కాలానుగుణంగా వృత్తి, విద్యా, కుటుంబ పరమైన వస్త్ర, వేషధారణలలో మార్పు రావడం సహజం. ఈ మార్పు కేవలం మహిళల్లో మాత్రమే చూడడం లేదు. ప్రతి వ్యవస్థలోనూ చూస్తున్నాము. అది గమనించకుండా కేవలం స్త్రీలను లక్ష్యంగా చేసుకొని వివాదాస్పద వ్యాఖ్యలు చేయడం మంచిదికాదు. ఇటువంటి వ్యాఖ్యలు పైశాచిక ముసుగులో మసిలే కామాంధులకు ప్రేరణ కలిగించే విధంగా ఉన్నాయి. ఇకనైనా ప్రభుత్వాలు కళ్ళు తెరిచి దాడులకు పాల్పడిన వారిని కఠినంగా శిక్షించాలి. అలానే లైంగిక వేధింపులు, దాడులు, అత్యాచార ఘటనలలో గాయపడిన మహిళలకు ప్రభుత్వం వైద్య సహాయంతోపాటు జీవనోపాధి కల్పించాలి. అప్పుడే సమాజం సభ్య సమాజంగా మన్ననలను అందుకోగలదు.



# ప్రజ్ఞాశాలి కనుపర్తి వరలక్ష్మమ్మ

- వకుళాభరణం లలిత

కందుకూరి వీరేశలింగంగారు ప్రారంభించిన సంస్కరణ బాటలో మహిళాభ్యుదయ కార్యక్రమాలను చేపట్టిన మహిళా బాంధవి శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ. గాంధీగారి ఆదేశానుసారం రాట్నం వడికి తన మేధోసంపత్తితో ప్రజల్ని ఉర్రూతలూగించిన దేశభక్తురాలు ఆమె.

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ ఇరవయ్యో శతాబ్ది పూర్వార్థంలో స్తబ్దంగా ఉన్న ఆంధ్ర నారీలోకాన్ని తన కలం ద్వారా ఉత్తేజపర్చి, అటు సాహిత్యానికీ, ఇటు వనితల సామాజిక జీవితానికీ దీప్తినందంచిన తెలుగు రచయిత్రి. కళాశాలలో చేరకపోయినా, జీవిత మనే కళాశాలలో అనుభవంతో విద్యను అభ్య సించారు. విజ్ఞానాన్ని సంపాదించటమే కాదు ఆంధ్రదేశం నలమూలలా వెదజల్లారు కూడా.

మహిళలు చెప్పులు తొడుక్కుని వీధిలోకి రావటమే విడ్డూరంగా ఉండే ఆ రోజుల్లో తన జన్మస్థలమైన బాపట్లలో స్త్రీహితైషి మండలి, యువతీ విద్యాలయం, హనుమంతరాయ బాల విద్యా విహారం వంటి సంస్థలు స్థాపించి, నిర్వహించి, కందుకూరి వీరేశలింగంగారు ప్రారంభించిన సంస్కరణ బాటలో మహిళాభ్యుదయ కార్యక్రమాలను చేపట్టిన మహిళా బాంధవి శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ. గాంధీగారి ఆదేశానుసారం రాట్నం వడికి తన మేధోసంపత్తితో ప్రజల్ని ఉర్రూతలూగించిన దేశభక్తురాలు ఆమె.

"ధర్మము నా జీవము
నీతి నా మతము
సతీ శ్రేయము నా లక్ష్యము"

ఈ మూడు లక్షణాలను తూ.చ తప్పకుండా ఆచరించిన కనుపర్తి వరలక్ష్మమ్మ 6-10-1896న బాపట్లలో జన్మించింది. భారతీయ సామాజిక పరిస్థితి, రానురాను అర్థం లేని మూఢాచారాలు, శకునాలు, దుష్టగ్రహశాంతులు కమ్మిన సమాజాన్ని తన రచనల ద్వారా. ఉపన్యాసాల ద్వారా మరమ్మత్తు చేశారు వరలక్ష్మమ్మ. అభినవ తిక్కన అనే పేరుగాంచిన తుమ్మల సీతారామమూర్తిగారు ఆమెను 'పేదకాలపు వేలది ముత్తయిదువ' అని వర్ణించేవారు.

కనుపర్తి వరలక్ష్మమ్మకు చదివే అలవాటునీ, సంస్కరణ భావాలనూ ప్రోత్సహించి వెన్నుతట్టింది కొటికలపూడి సీతమ్మ. ఆరోజుల్లో బాపట్లలో చోరగుడి సీతమ్మగారు యువతీ విద్యాలయం నడిపేవారు. వరలక్ష్మమ్మ చదవటం నుంచి రచన చేసేవరకూ ఎదిగారు. వింజమూరి వెంకట రత్నమ్మ సంపాదకురాలిగా ఉన్న 'అనసూయ' పత్రికలో ఆమె కథలూ, వ్యాసాలూ రాశారు. 'గృహలక్ష్మి' పత్రిక ప్రారంభం కావటంతో ఆ పత్రికకు విరివిగా రాశారు. 'శారదా లేఖలు' అనే రచనకు స్వర్ణ కంకణాన్ని పొందారు.

'శారదా లేఖలు' వర్తమాన సామాజిక రాజకీయ సమస్యలను చర్చించేవి. ఆ లేఖలలో వరలక్ష్మమ్మగారు స్త్రీల అభివృద్ధికి వ్యతిరేకంగా ఉన్న సనాతనాచారాలను కటువుగా విమర్శించారు. బాల వితంతువుల కష్టాలను వివరంగా వర్ణించి ఆ దురాచారం వల్ల కలిగే అనర్థాలను రాసేవారు. పురుషాధిక్యత గూర్చి, పురుషులు చేసే దౌర్జన్యాలను గూర్చి, కనువిప్పు కలిగేలా రాసేవారు. విదేశీ వస్తుబహిష్కరణ, స్వదేశీ వస్త్రధారణ, రాట్నం వడకటం మొదలైన విషయాల గూర్చి వరలక్ష్మమ్మ గారి రచనలు చదివి ఎందరో స్త్రీలు స్ఫూర్తి పొంది జాతీయోద్యమంలోకి ప్రవేశించారు. స్త్రీల సత్యాగ్రహం సాహసాలు, వాళ్ళు జైళ్ళలో పురుళ్ళు పోసుకున్న వైనాలూ వార్తలలో రాగానే వారిని అభినందిస్తూ, ప్రోత్సహిస్తూ శారదా లేఖలు రాసేవారు. ఆ లేఖలు చదివిన వారు ఉద్వేగభరితులయ్యేవారు. వాళ్ళను చూసి మరికొంతమంది ఉత్సాహంతో జాతీయోద్యమంలోకి ఉరికేవారు. బాపట్లలో 'స్త్రీహితైషిణీ మండలి'ని ఏర్పాటు చేయటమే గాక, భద్రాచలంలో జరిగిన ఆంధ్రరాష్ట్ర మహిళా సభకు అధ్యక్షత వహించారు. జాతీయోద్యమంలో కాంగ్రెసు కార్యక్రమాలకు మద్దతునిస్తూ హిందీ ప్రచారాన్ని నిర్వహిస్తూ స్త్రీలతో కలిసి పనిచేశారు.

పిల్లల కోసం రాసిన బాలనీతి కథావళి, పెద్దల కోసం రాసిన 'విశ్వామిత్ర మహర్షి' వరలక్ష్మమ్మగారికి కీర్తిని ఆర్జించిపెట్టాయి. వరలక్ష్మమ్మ గ్రంథాలు, లేఖలు, వ్యాసాలు, నాటికలు వంటి రచనలకే పరిమితం కాలేదు ఆమె రచయిత్రి మాత్రమే కాదు, కవయిత్రి కూడా. ఆమె ఎన్నో రేడియో ప్రసంగాలు చేశారు. బహుశా రేడియోలో ప్రసంగం చేసిన మొదటి రచయిత్రి వరలక్ష్మమ్మగారే. ఇవన్నీ ఆమె బహుముఖ కళాప్రతిభకు నిదర్శనాలు. ఇరవయ్యో శతాబ్ది ఉత్తరార్థంలో వచ్చిన కథానిక రచయిత్రులందరికీ, నవలాకారులకు ఆమె ఆదర్శమూర్తి.

గుంటూరు జిల్లా బోర్డు సభ్యురాలిగా ఉన్నప్పుడు ఎన్నో మహిళా సంఘాలకు చేయూతనిచ్చారు. పాఠశాలలు లేని ప్రాంతాల్లో పాఠశాలలు, గ్రంథాలయాలు ఏర్పాటు చేశారు.

వరలక్ష్మమ్మ మంచి వక్త. ఎన్నో విషయాల్ని చెప్తూ వాక్చాతుర్యంతో, సరళమైన శైలితో మాట్లాడేవారు. ఆమె చెప్పే అపురూపమైన విషయాలు విద్వాంసులకు కూడా ఉపయోగపడేవి. ఇంతటి ప్రతిభాశక్తులుగల ఆమె ప్రథమ గృహలక్ష్మి స్వర్ణకంకణ గ్రహీత. ప్రథమ ఆంధ్రసాహిత్య అకాడమీ ఉత్తమ రచయిత్రి అవార్డు గ్రహీత. ఆమె రాసిన 'మామిడిచెట్టు కింద ముచ్చట్లు' ఇప్పటికీ కొత్తగానే ఉంటాయి. స్వయంకృషితో, అన్నదమ్ముల ప్రోత్సాహంతో, భర్త హనుమంతరావు ప్రోద్బలంతో ఎంతో ఎత్తుకు ఎదిగిన ప్రజ్ఞాశాలి. ఆమె చేసిన సామాజిక సేవలూ, రచించిన రచనలూ ఆమెను చిరంజీవిని చేశాయి. నేటి స్త్రీలకు వరలక్ష్మమ్మగారు మహోజ్వలమైన మార్గం చూపిన 'మణిదీపం'గా భావించాలి. ★

# మర్యాద పురుషోత్తముడు

- కాళీపట్నం సీతా వసంతలక్ష్మి

**రావణుడు నన్ను అపహరించకుండా ఉండాల్సిందన్న విషయం మినహాయిస్తే, నాకు అతనిపై ద్వేషం లేదు. నా సమ్మతి లేనిదే అతడు నన్ను తాకననీ, నా సమ్మతి కోసం ఎంత కాలమైనా వేచి ఉంటాననీ, బెదిరిస్తూనే చెప్పినా, అన్నమాట జవ దాటలేదు. బహుశా మండోదరి కూడా ఈ విషయాన్ని గ్రహించి, అతడిని మంచి మార్గంలోకి తేవాలని ఎంతగానో ప్రయత్నించింది. ఎన్నో పూజలు చేసింది, వ్రతాలు చేసింది. తన భర్తకు సుద్బుద్ధిని అనుగ్రహించమని.**

నిండు గర్భవతి. ఆపసోపాలు పడుతూ, మెల్లిగా నడుస్తోంది సీత. ఒక బంగారు కలశంలో మంచినీరు పుచ్చుకుని సీత వెనకే నడుస్తోంది ఊర్మిళ.

గర్భవతిగా ఉన్న ఆమెలో ఒక నిండుతనం, అమ్మను కాబోతున్నాననే చిరుగర్వం కానవస్తున్నాయి. గాలికి అటూ ఇటూ ఊగుతున్న మల్లెలు, జాజులూ, ఆమె కేశాలను అలవోకగా సవరిస్తూంటే, కింద నేలమీద రాలిపడిన పారిజాతాలు ఆమె లేత పాదాలను మెత్తగా సేదదీరుస్తున్నాయి. కొంచెంసేపు ఉద్యానవనంలో తిరిగాక, సీత అలసినట్లు కనపడగానే ఊర్మిళ అడిగింది.

"కాసేపు ఆ తిన్నెమీద విశ్రమిస్తావా అక్కా"?

"సరే అటుపద, ఆ జాజి పందిరి కింద కూర్చుందాం".

కూర్చోగానే సీతకు, కలశం లోంచి కొంచెం నీటిని త్రాగటానికి ఇచ్చింది ఊర్మిళ. నీరు తాగి ఊరట చెందిన సీత ఊర్మిళ వంక కృతజ్ఞతగా చూసింది.

"అక్కా, నాకో విషయం ఎంతో జిజ్ఞాస, ఆశ్చర్యం కలిగిస్తోంది" సంశయిస్తూ అడిగింది ఊర్మిళ.

"ఏమిటమ్మా అది?"

"అడిగితే మీరేమి అనుకోరు కదా?"

"అంతగా అనుకునే విషయం ఏమిటో?" సీత కాస్త సంకోచంగా అంది.

"ఏంలేదు., మీరు అన్ని ఏళ్ళు రావణుడి దగ్గర ఉన్నారుకదా? అతడేమైనా చేస్తాడని భయం కలిగేది కాదా?"

"అపహరణ జరిగిన తర్వాత ఎన్నోసార్లు భయం భయంగానే ఉండేది. రాత్రిళ్ళు కనురెప్ప కూడా వేసేదాన్ని కాదంటే నమ్ము".

"మరి?"ప్రశ్నార్థకంగా అడిగింది ఊర్మిళ.

"కానీ రావణుడిలో ఏవో ఒక విధమైన నైతిక విలువలు... అహహా... కాదు కాదు, స్త్రీ పురుషుల సంబంధాల విషయంలో కొన్ని విలువలు, సూత్రాలు ఉన్నాయని, అక్కడి రాక్షస స్త్రీలు, మండోదరి సఖియలు అప్పుడప్పుడు అనుకుంటుంటే విన్నాను". సీత ఆయాసంతో ఆగింది. మంచినీళ్ళు ఇవ్వబోయిన ఊర్మిళ పక్కనే ఏదో శబ్దం అయితే అటు చూసింది. ఏవో పొదలు కదిలాయి. గాలికేమో అనుకుంది. ఆ మాటే అంది.

"ఇక్కడ గాలి ఎక్కువగా ఉంటే అంతఃపురంలోకి వెళ్ళిపోదామా అక్కా?"

"లేదులే, నెలలు నిండుతున్నాయి కదా, కొన్నిసార్లు ఏదోగా అసౌకర్యంగా ఉంటుంది, అంతే, నువ్వేమి ఆందోళన చెందకు ఊర్మిళా రాణీ" అంటూ హాస్యంగా పరాచికం ఆడింది సీత.

"కానీ ఏదో శబ్దం ఆ పొదల మాటునుండి వినవచ్చిందే" ఆమెలో కాసింత అనుమానం.

"ఈ అంతఃపుర ఉద్యానవనంలోకి వచ్చే సాహసం ఎవరికీ ఉండదు, రఘువంశమా మజాకటా" గర్వంగా అంది సీత. "ఇంతకీ నువ్వేదో అడగబోయావు?"

'నీవే ఏదో చెపుతూంటే నేనే ఏవేవో అనవసరపు భయాలతో అంతరాయం కలిగించాను'' ఊర్మిళ మన్నింపు కోరుతున్నట్లు అంది.

"అందుకేనేమో రావణుడు నన్ను అపహరించకుండా ఉండాల్సిందన్న విషయం మినహాయిస్తే, నాకు అతనిపై ద్వేషం లేదు. నా సమ్మతి లేనిదే అతడు నన్ను తాకననీ, నా సమ్మతి కోసం ఎంత కాలమైనా వేచి ఉంటాననీ, బెదిరిస్తూనే చెప్పినా, అన్నమాట జవదాటలేదు. బహుశా మండోదరి కూడా ఈ విషయాన్ని గ్రహించి, అతడిని మంచి మార్గంలోకి తేవాలని ఎంతగానో ప్రయత్నించింది. ఎన్నో పూజలు చేసింది, వ్రతాలు చేసింది. తన భర్తకు సుద్బుద్ధిని అనుగ్రహించమని. కానీ వినాశకాలే విపరీత బుద్ధి అని ఊరికే అన్నారా? సీత కొంచెం ఆగింది. "అతడి మరణం మర్యాద పురుషోత్తముడైన రాముని చేతిలో వ్రాసి ఉండగా, ఇంకే ఇతర శక్తులూ పనిచేయవు. అదే రామునిలోని గొప్పతనం."

ఊర్మిళకు, రాముడు అన్యాయ యుద్ధంలో రావణుడిని చంపడాన్ని సీత ఎలా సమర్థిస్తుందో తెలుసుకోవాలని ఉన్నా, తమాయించుకుని, మళ్ళీ ఇలా అడిగింది.

"పది తలలతో రావణుడి అందమేమిటి? రూపమేమిటి? నిజంగా అలా ఎవరైనా పది తలలున్నవారైతే, పది బుద్ధులూ, ఆలోచనలూ, అన్ని అభిప్రాయాలూ ఒకేసారి వెలిబుచ్చితే చూడటానికి అది నవ్వు పుట్టించే పరిస్థితి కాదా?"

ఊర్మిళ ప్రశ్నకు సీత గలగలా నవ్వింది.

"పిచ్చిపిల్లా, పది తలలుంటే, నేనూ అలానే అనుకున్నాను. పది తలలు అతనికి ఉన్నాయని అనటంలో ఒక అతిశయోక్తి ఉంది. ఉన్నవి పది తలలు వాస్తవంగా కాదు. పదిమంది తపోశక్తితో సంపాదించుకునే పాటి మేధో సంపత్తి అని. అతడొక అపూర్వ మేధావి. అందుకేగా మీ బావగారు, లక్ష్మణుడిని, విభీషణుడినీ, రావణుడు మరణించేలోగా అతడికి తెలిసిన రాజకీయ జ్ఞానాన్ని కనీసం క్లుప్తంగానైనా తెలుసుకోమని ఆదేశించారు?"

"అయితే రావణుడు చూడటానికి రాక్షసునిలా భీకరంగానే ఉండే వాడన్నమాట".

''లేదు లేదు అతను చాలా అందగాడు, స్ఫురద్రూపి. నేను అతడిని నేరుగా ఎన్నడూ చూడకపోయినా చెలికత్తెలు చెప్పుకోవటం, మండోదరి చేసిన వర్ణన, హనుమంతుని ద్వారా విన్నది, ఇదే".

"అయితే... నాదొక చిన్న కోరిక, నువ్వు ఏమీ అనుకోనంటేనే అడుగుతాను" మళ్ళీ సందేహిస్తూనే అడిగింది ఊర్మిళ.

"అడుగమ్మా... అడుగు ఎందుకు అలా సందేహిస్తావు?"

"అయితే నువ్వు విన్నదాన్ని బట్టి రావణుడి చిత్రం వేయగలవా అక్కా?"

చిరునవ్వుతో సీత జవాబిచ్చింది. 'ఇంతే గదా... చిత్రానికేముంది చిటికెలో వేసేస్తాను. కానీ ముఖం మాత్రం నా ఊహాచిత్రమే సుమా".

అంగీకారం లభిస్తూనే, ఊర్మిళ వరుగున వెళ్ళి ముగ్గు పాత్రను తీసుకొచ్చింది. చెలికత్తె చేత చప్పున నేలను గోమయంచే అలికించింది. అది ఆరి సిద్ధం అయ్యేసరికి, సీత కొన్ని ఫలాలు, పళ్ళూ తిని ఓపిక తెచ్చుకుంది. ఆరారా కొద్ది కొద్దిగా తినమని వైద్య ఆచార్యుల వారి సలహా అది. నెమ్మదిగా లేచి, గోమయంతో అలికిన నేలపై తెల్లని ముగ్గుతో రావణుడి రూపాన్ని శిరస్సు నుంచి పాదాల వరకూ తయారు చేసింది. కాలికి అతడు ధరించిన బంగారు కడియాల రూపకల్పన పూర్తి చేసే సమయానికి ఊర్మిళ ఎటో వెళ్ళింది. చిత్రలేఖనం పూర్తయ్యేసరికి, సుకుమారి, గర్భవతి సీత సొమ్మసిల్లి నేలమీది చిత్రపటం చివర చేయి ఆన్చుకుని ఆలోచిస్తూ, ఎప్పుడు నిద్రలోకి జారుకుందో. ఊర్మిళ ఆ చిత్రాన్ని ఆసాంతం తిలకించిందో లేదో కూడా ఆమె గమనించలేదు.



నిండు కొలువు. అందరి ఎదుటా, నిర్భయంగా ఎదిరించే స్వరంలో చాకలివాని నింద. రఘువంశ సుధాంబుధి చంద్రుడు, రామచంద్ర సార్వభౌముని మనసు మనసులో లేదు. ఆనాడు ఉద్యానవనంలో పొదలమాటునించి తన సీత, ఊర్మిళ మధ్య నడిచిన సంభాషణ విన్నదగ్గర్నుంచి, మదిలో ఏదో కలకలం రేగుతోంది. ఏవేవో ఆలోచనలు నిలువనీయటంలేదు. ఎలాగో మనసు ఉగ్గబట్టుకుని విధి నిర్వహణ పూర్తిగావించాడు.

ఆ రాత్రి లక్ష్మణుడిని, పురమాయించాడు రాముడు. తెల్లవారేసరికి సీత కోరిక తీర్చే నెపంతో ఆమెను తిరిగి అడవుల్లో విడిచిపెట్టే నిర్ణయం జరిగిపోయింది. తాను చేసింది తప్పని, మనసులో ఏమూలో శంక ఒకటి పట్టిపీడిస్తోంది. ఏమో, రావణుడు నిజంగానే కామశాస్త్ర కళా పారంగతుడు అయి ఉండొచ్చు. ఎన్నోసార్లు సీత వద్దంటున్నా సీత దరికి తాను చేరిన సందర్భం గుర్తుకు వస్తున్నాయి. క్షత్రియుడిగా, రారాజుగా, నీతిగల పాలకుడిగా తాను గొప్పవాడే అయినా, ఒక భర్తగా, ప్రేమికుడిగా, విజయం సాధించలేదేమో అనే శంక అతడి మనసుని నలిపివేస్తోంది. అతడిని చూడకపోతే, రావణుడి చిత్రాన్ని అంత అందంగా ఎలా వేయగలిగింది? రావణుడి కామకళా ప్రావీణ్యం వంటి అత్యంత సన్నిహిత వ్యక్తిగత విషయాలు సీతకు ఎలా తెలిసాయి? అన్నిటికన్నా మించి, రావణుడి చిత్రపటం పాదాల చెంత విశ్రాంతిగా నిద్రిస్తున్న సీత ముఖం తాను ఎలా మరువగలడు? అనుమానం వైపుకే త్రాసు మెల్లిగా దిగుతోంది. ఇక మనసుకు ఏదో ఒక సంజాయిషీ ఇచ్చుకోవడం కష్టం కాలేదు. పితృవాక్య పరిపాలకుడుగా, ప్రజావాక్య పరిపాలకుడిగా ఘనత పొందాలనే కాంక్షే జయించింది. ఇక సర్ది చెప్పుకోవటమే మిగిలింది. ఏమో, సీత మనుసులో రావణుడి పట్ల ఉన్నది కేవలం గౌరవం మాత్రమే అయినా తాను సహించలేడు అన్నది రాముడు తెలుసుకున్న స్వీయ సంబంధిత సత్యం. సీత మనుసు ఎవరికి కావాలి? ★

**పితృవాక్య పరిపాలకుడుగా, ప్రజావాక్య పరిపాలకుడిగా ఘనత పొందాలనే కాంక్షే జయించింది. ఇక సర్ది చెప్పుకోవటమే మిగిలింది. ఏమో, సీత మనుసులో రావణుడి పట్ల ఉన్నది కేవలం గౌరవం మాత్రమే అయినా తాను సహించలేడు అన్నది రాముడు తెలుసుకున్న స్వీయ సంబంధిత సత్యం. సీత మనుసు ఎవరికి కావాలి?**

### హైకూలు

అమ్మ రెండు జనరేషన్ల
మధ్య నలిగే బొమ్మ
అవునంటే హజ్బెండుక్కోపం
కాదంటే కన్నపేగుకు శాపం
అమ్మల బతెకెప్పుడు పాపమే'

అతివృష్టి
అనావృష్టి
పూర్తికాని ఆనకట్టలు
నీళ్ళన్నీ సముద్రంపాలు
పారిశుద్ధ్యం పక్షోత్సవాల్లో..

అధికారుల పుస్తకాల్లో
కాకి లెక్కలు..
మురికి కూపంలోనే
బడుగు బతుకులు

- బి. సుధా కిరణ్

మగబిడ్డ కావాలనే కాంక్షతో మొదటి శిశువు అనంతరం రెండవ బిడ్డ సందర్భంలో స్కానింగ్ ద్వారా ఆడశిశువు అని తెలుసుకుని అబార్షన్‌కు పాల్పడుతున్నవారు కొందరైతే మరికొందరు ఇద్దరు అమ్మాయిలు అయిన తరువాత మగబిడ్డకోసం మూడవ బిడ్డ సందర్భంలో స్కానింగ్ ద్వారా ఆడశిశువు అని తెలుసుకుని అబార్షన్స్ చేయించుకుంటున్నారు. కానీ ఇద్దరు మగబిడ్డలు జన్మించిన అనంతరం ఆడబిడ్డ కోసం ప్రయత్నించిన వారు మాత్రం కనబడలేదు. పైగా మగ శిశువు కడుపులో ఉన్నప్పుడు కుటుంబ సభ్యులు తల్లిని చూసుకున్న ఆదరణ తీరుకు ఆడశిశువు కడుపులో ఉన్నప్పుడు తీరుకు చాలా వ్యత్యాసం ఉందని తెలియడం హృదయ విదారకంగా ఉంది.



## ఆడపిండాల

# హత్యలకు కారకులెవరు?

- మల్లు లక్ష్మి

**భా**రతీయ జీవన విధానంలో ముఖ్యంగా తెలుగు వాళ్ళ సంస్కృతిలో స్త్రీమూర్తి మహాత్యాన్ని వేనోళ్ళ కొనియాడుతారు. ఆరాధిస్తారు. స్త్రీని ప్రకృతితో సమానంగా పూజించిన మనం, ఆ స్త్రీనే అధఃపాతాళానికి నెడుతున్న మనం, అంతకన్నా అనేక రెట్లు దురదృష్టవంతులం అయిపోతున్నామన్న నిజాన్ని అర్థం చేసుకోలేకపోతున్నాము. స్వార్థ జీవులుగా మిగిలిపోతున్నాం. ఒక విధంగా నేరస్తులమవుతున్నాం. పుట్టేది ఆడపిల్ల అని తెలియగానే దయ, జాలి, కరుణ లేకుండా ఆడపిండాల హత్యలకు పాల్పడుతున్నాం. ఆడ శిశువులను అమ్ముకునే పాపానికి ఒడిగడుతున్నాం.

నల్లగొండ జిల్లాలో గత పది సంవత్సరాలుగా ఆడ శిశువుల సంఖ్య తగ్గుతూ ఉంది. ఈ మధ్య జిల్లా వైద్య ఆరోగ్య శాఖ ప్రకటించిన గణాంకాలు ఈ దుస్థితికి అద్దం పడుతున్నాయి. ఈ గణాంకాల వాస్తవాలను పరిశీలిస్తే వెన్నులో వణుకు పుడుతుంది. జిల్లాలో 0 నుండి 6 సంవత్సరాల బాల, బాలికల నిష్పత్తి 1000:927గా ఉంది. జిల్లాలోని 14 మండలాల్లో ఈ నిష్పత్తికంటే మరీ తక్కువగా ఉంది. సంస్థాన్ నారాయణపురం 833, చందంపేట 834, మునుగోడు 842, పెద్దవూర 850, త్రిపురారం 853, భువనగిరి 856, పోచంపల్లి 867, చిట్యాల 883, ఆత్మకూర్ (ఎం)892, మఠ్రిగూడెం 863, వలిగొండ 894,చండూర్ 894, తుంగతుర్తి 895, నూతన్‌కల్ 896గా ఆడపిల్లల నిష్పత్తి పడిపోవడం చూస్తే ప్రమాద ఘంటికలు మ్రోగిస్తున్నట్లుగా ఉంది.

ఈ ప్రమాదకర పరిస్థితులకు గల కారణాలను అధ్యయనం చేయటానికి ఐద్వా రాష్ట్ర నాయకత్వ పర్యవేక్షణలో జిల్లా కమిటీ చిట్యాల మండలంలో సమగ్ర సర్వే నిర్వహించడం జరిగింది. ఈ సర్వే 14 దళాలుగా ఏర్పడి మూడు రోజులపాటు 0-6 సంత్సరాల లోపు బాల బాలికలు ఉన్న 2,336 కుటుంబాలను కలిసి విచారించగా అనేక అంశాలు మా దృష్టికి వచ్చాయి. మొత్తం బాలురు 28,438 ఉండగా బాలికలు 27,207 మంది ఉన్నారు. అంటే 1231 మంది బాలికలు తక్కువగా ఉన్నారని వెల్లడైంది.

ఈ తగ్గుదలకు గల కారణాలను విచారించగా మగబిడ్డ కావాలనే కాంక్షతో మొదటి శిశువు అనంతరం రెండవ బిడ్డ సందర్భంలో స్కానింగ్ ద్వారా ఆడశిశువు అని తెలుసుకుని అబార్షన్‌కు పాల్పడుతున్నవారు మరికొందరు ఇద్దరు అమ్మాయిలు పుట్టిన తరువాత మూడవ బిడ్డ సందర్భంలో స్కానింగ్ ద్వారా ఆడశిశువు అని తెలుసుకుని అబార్షన్స్ చేయించుకుంటున్నారు. కానీ ఇద్దరు మగబిడ్డలు జన్మించిన అనంతరం ఆడబిడ్డ కోసం ప్రయత్నించిన వారు మాత్రం కనబడలేదు. పైగా మగ శిశువు కడుపులో ఉన్నప్పుడు కుటుంబ సభ్యులు తల్లిని చూసుకున్న ఆదరణ తీరుకు ఆడశిశువు కడుపులో ఉన్న తీరుకు చాలా వ్యత్యాసం ఉందని తెలియడం హృదయ విదారక పరిస్థితి. ముఖ్యంగా ఈ అబార్షన్లను భర్తతోపాటు కుటుంబ సభ్యులు ప్రోత్సహిస్తున్నారు.

వెలుగులోకి వచ్చిన మరొక ప్రధానమైన అంశం మండలంలో బాల్య వివాహాలు దాదాపు 95 శాతం జరుగుతున్నాయి. బాల్యవివాహాల వల్ల ఎక్కువ మంది గర్భసంచి వ్యాధులకు

గురవుతున్నారు. 35 సంవత్సరాలకే గర్భసంచి తొలగించిన వారి సంఖ్య ఎక్కువగా ఉంది. కుటుంబ నియంత్రణ ఆపరేషన్స్ కూడా 99 శాతం మంది మహిళలే చేయించుకుంటున్నారు. ఫలితంగా ఎక్కువమంది నడుము నొప్పులు, రక్తహీనత, నరాల బలహీనతతో బాధపడుతున్నారు. కుటుంబ నియంత్రణ ఆపరేషన్ పట్ల పురుషులకు అవగాహన కల్పించడంలో ప్రభుత్వం మరియు వైద్య అధికారులు విఫలమయ్యారని అర్థమైంది.

'గోటిచుట్టు పై రోకలిపోటు' అన్న చందంగా పై సమస్యలతోపాటు గ్రామాలలో ప్రధానంగా మంచినీరు దొరకక ఫ్లోరిన్ నీరు త్రాగి రోగాలబారిన పడేవారి సంఖ్య అనేకం. ఫలితంగా సంపాదనలో అధికశాతం నీటికి వెచ్చించాల్సి వస్తోంది. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు అందుబాటులో లేవు. ఉన్నా డాక్టరు ఉంటే మందులు ఉండవు. మందులు ఉంటే డాక్టరు లేని పరిస్థితి నెలకొని ఉంది. 80 శాతం మంది మహిళలు ఆర్.ఎం.పి డాక్టర్లనే ఆశ్రయిస్తున్నారు. ఎక్కువమంది వారి ఆదాయం కుటుంబ అవసరాలకు మరియు అనారోగ్య ఖర్చులకే సరిపోతోంది. పైగా గ్రామాలలో వీధి వీధికి నాటుసారా, బెల్ట్ షాపులకు కొదవే లేదు. పురుషుల సంపాదనలో 80 శాతం మద్యానికే ఖర్చుపెట్టి అనారోగ్యాన్ని కొని తెచ్చుకుని మృత్యువాత పడుతున్నారు. ఫలితంగా వితంతువుల శాతం 30 నుండి 35 శాతానికి పెరిగింది. ఈ మద్యం వల్ల ఏనాడు సుఖసంతోషాలతో గడిపిన రోజంటూ లేదని ఉబికి వస్తున్న కన్నీళ్ళతో వారు చెప్పిన తీరు మా మనస్సులను కలచివేసింది. పిల్లలను పై చదువులు చదివించలేక కూలిపనికి పంపుతున్న పరిస్థితి దాపురించింది.

పేదరికం, నిరక్ష్యరాస్యత, వరకట్న సమస్య, ఆడపిల్లల పట్ల అభద్రతాభావం, మూఢవిశ్వాసాలు కుటుంబ స్థిరీకరణ, వంశోద్ధారకుడు లేడన్న ఆవేదనతో మూర్ఖంగా కన్నపేగును దూరం చేసుకుంటున్నారు. అమ్మతనంలోని కమ్మదనాన్ని ఆస్వాదించడానికి పరితపించే స్త్రీమూర్తి పేదరికంలో మునిగి తేలుతోంది. దరిచేరని ప్రభుత్వ పథకాలు నిరక్ష్యరాస్యత, పేదరికం, ఆడశిశువు భవిష్యత్‌ను ప్రశ్నార్థకం చేస్తున్నాయి. ప్రభుత్వ విధానాలతోపాటు సమాజంలోని పురుషాధిక్య భావజాలం మర్రి ఊడల్లా పాతుకుపోయింది. దాన్ని బద్ధలు కొట్టకుండా వివక్షతను రూపుమాపలేము.

నేటి మహిళ సాంప్రదాయ సంకెళ్ళను తెంచుకుని విశ్వాంతరాలను శోధిస్తున్నా, హైటెక్ యుగంలో విజ్ఞాన పరిమళాలను వెదజల్లుతున్న ఈ నేపథ్యంలో ఆడపిల్లలపై వివక్షత కొనసాగడం బాధాకరం.

స్త్రీకి ప్రకృతి అన్నీ ఇచ్చింది. అంతేకాకుండా స్త్రీనే తనకు ప్రతిరూపంగా నిలబెట్టింది. ఆ స్త్రీమూర్తికి మనం ప్రత్యేకంగా ఏమీ ఇవ్వలేముకాని, ఆమెను ఆమెగా బతకనివ్వాల్సిన బాధ్యత మనమీద ఉన్నది. ఆమె బతుకుతో లోకానికి వెలుగునిచ్చే ఒక మహదవకాశాన్ని స్త్రీకి అందజేయవలసి ఉన్నది.

స్త్రీని గౌరవించే కాలం నుండి జన్మించకముందే ఆడశిశువును అంతమొందించే దారుణానికి ఒడిగడుతుంటే అప్పుడు మనం మనుషులుగా ప్రవర్తిస్తున్నట్లేనా అని ప్రశ్నించుకోవాల్సి ఉంది.

నేడు దాపురించిన ఈ విషమ పరిస్థితిని అధిగమించాలంటే ప్రభుత్వం వెంటనే ఈ క్రింది చర్యలు తీసుకోవాలి.

1. 1994లో వచ్చిన పిఎన్‌డిటి యాక్ట్‌ను పకడ్బందీగా అమలు చేయాలి.
2. స్కానింగ్ కేంద్రాలపై నిరంతరం నిఘా ఉండాలి.
3. వరకట్న నిరోధక చట్టాన్ని పటిష్టంగా అమలు చేయాలి.
4. ఆడపిల్ల అయినా, మగపిల్లాడయినా సమానమే అని ప్రభుత్వం విస్తృత ప్రచారం చేయాలి. ఆడపిల్లలకు ప్రోత్సాహకాలు పెంచాలి.
5. కుటుంబ నియంత్రణ ఆపరేషన్ చేయించుకోవటంలో పురుషులకు అవగాహన కలిగేలా ఎలక్ట్రానిక్, ప్రింట్ మీడియాలో విస్తృత ప్రచారం నిర్వహించాలి.
6. ఆడపిల్ల పట్ల ఉన్న మూఢ నమ్మకాలను పోగొట్టాలి.
7. అన్ని రంగాలలో మహిళలు రాణించే విధంగా వాళ్ళలో విశ్వాసాన్ని పెంపొందించే రీతిలో 33 శాతం రిజర్వేషన్స్ కల్పించి ప్రోత్సహించాలి.

* **ఆడపిల్లను పుడమిపైకి మనసారా ఆహ్వానిద్దాం!**
* **ఆరోగ్యకరమైన సమాజానికి బాటలు వేద్దాం!**
* **స్త్రీ శక్తి బలీయమైనదని నిరూపిద్దాం!**
* **మన ఆడపిల్లలను రక్షించుకుందాం!**

**(ఈ వ్యాసం దశాబ్ది ప్రత్యేక సంచికలో పొరపాటు జరగటం వలన సగం మాత్రమే ముద్రితమయింది. కనుక ఈ సంచికలో పూర్తిగా ముద్రిస్తున్నాము. పాఠకులు గమనించగలరు-ఎడిటర్)**

# ఇంటిపని కూడా పనే

- ఎస్.పుణ్యవతి

**ఇంటిల్లిపాదికి ఇల్లాలు చేసే సేవలకు విలువ కట్టాలనీ, ఆ సేవలకు భర్తల నెల జీతం నుండి 10 శాతం నుండి 20శాతం వరకు భార్యల పేరుతో, బ్యాంకు ఖాతాలో జమ చేయాల్సిన ప్రతిపాదన ఆలోచిస్తున్నామని కేంద్ర మహిళా శిశు సంక్షేమ శాఖ చేసిన ప్రతిపాదన దేశ వ్యాప్తంగా చర్చోప చర్చలకు దారి తీసింది. భార్య పనికి సంబంధించి ఎకసెక్కాలు, వ్యంగ్యోక్తులు ప్రారంభమయ్యాయి.**

**ఇంటిపనికి సంబంధించి పెట్టుబడిదారీ సోషలిస్టు ఆర్థిక వ్యవస్థలు ఏం చెబుతున్నాయి. ఇల్లాలికి గృహ బానిసత్వం నుండి నిజమైన స్త్రీ విముక్తి ఎప్పుడు లభ్యమవుతుంది అనే అంశాలతో సవివరంగా 2006సం॥లో ఐద్వా రాష్ట్ర ఉపాధ్యక్షురాలు ఎస్. పుణ్యవతి రాసిన ఈ వ్యాసం స్త్రీ విముక్తికి సంబంధించి స్పష్టత వచ్చేందుకు దోహదపడుతుందనే ఉద్దేశ్యంతో ఈ వ్యాసాన్ని పునర్ముద్రిస్తున్నాము. - ఎడిటర్**

సాధారణంగా చాలామంది స్త్రీలు మీరేం చేస్తారమ్మా అంటే 'ఏం లేదండీ ఖాళీయే' అంటారు. వారు ఏమీ చెయ్యట్లేదనుకుంటారు. 'ఏమీ చెయ్యకుండా ఎలా ఉంటారమ్మా' అంటే అప్పుడు మొదలుపెడతారు. 'ఏమీ చెయ్యకుండా ఎలా ఉంటామండీ' ఇంట్లో పనులుంటాయి కదండీ' అని. ఇంట్లో పని అంటే అని మనం ప్రశ్నిస్తే 'అదేంటండీ? మరి ఆడాళ్ళన్నాక పనుల్లేకుండా ఎలాగుంటాయండీ? ఏదో ఇళ్ళూడ్చుకోవడం, అంట్లు తోముకోవడం, గుడ్డలుతుక్కోవడం, వంటా అవీ ఉంటాయి కదండీ' అంటారు. 'మరి ఏమీ చెయ్యట్లేదని ఎందుకన్నావమ్మా, అంటే " ఇంట్లో పనేకదా! బయటికెళ్ళి ఏం పనిచేస్తున్నామండీ" అంటారు. అంటే దీనర్థం ఏమిటి? ఇంట్లో ఆడవాళ్ళు చేసే పని పనేకానట్లు? బయటికెళ్ళి చేసే పనే పని అన్నట్లు? అయితే ఇది పనికాదా? కాకపోతే ఒక్కరోజు ఆడమనిషి ఇంట్లో పనిచెయ్యకపోతే ,లేదా అనారోగ్యం వస్తే లేదా పొరుగూరికి వెళ్తే ఏమవుతుంది? ఇల్లు తిరగబడుతుంది. అయినా ఇంట్లో ఆడమనిషి చేసే పని పనికాకుండా ఎలా ఉంటుంది? ఈ పనికి విలువ ఎందుకు లేదు? ఈ పనికి విలువ లేకపోవడం వలన వచ్చే నష్టం ఏమిటి? స్త్రీ విముక్తికి, సమాజంలో స్త్రీ స్థానానికి ఈ ఇంటిపని (లేదా ఇంటి చాకిరి)కి ఉన్న సంబంధం ఏమిటి? బయటికెళ్ళి ఏ పని చెయ్యకుండా ఇంటిపనిలోనే నిమగ్నమయ్యే స్త్రీలు సాధారణంగా ఇంటెడు చాకిరీతో జీవితం వెళ్ళిపోయిందీ అని (నసపెడుతూనో, సణుగుతూనో, ఏడుస్తూనో) జీవితం చివరి దశలో పడే బాధకి, ఇంటిపనికి విలువ లేకపోవడానికి ఏమయినా సంబంధం ఉన్నదా?...ఇవి కందిరీగల తుట్టెలాంటి ప్రశ్నలు.

ఇప్పుడు చూద్దాం ఇంటిపని కథా-కమామిషు

ఇంటిపని అనబడే పనిలో సవాలక్ష పనులు ఇమిడి ఉన్నాయి. పైకి కనిపించేవి. 1.వంట చెయ్యడం. 2. ఇల్లు, వాకిళ్ళు ఊడ్వడం, 3. బట్టలు ఉతకడం. 4. కుటుంబ సభ్యులందరికీ వారి వారి టైముల ప్రకారం భోజనాలు పెట్టడం. 5.పిల్లల్ని, ముసలివారిని చూడ్డం. 6. నీళ్ళు తేవడం. 7. కట్టెలు తేవడం. 8. పిల్లలకు చదువులు చెప్పడం. 9.చుట్టాలు, స్నేహితుల్ని పరామర్శించడం (చుట్టాలు, స్నేహితులతో సంబంధాలు పెట్టుకోవడం, మర్యాదలు వగైరాలు. కుటుంబానికి సమాజంలో ఒక స్థానాన్ని కల్పిస్తాయి. వీటిలో పరోక్షంగా కుటుంబం ఆర్థిక ప్రయోజనాలు ఇమిడి ఉన్నాయి.)10. రోగం వస్తే ఇంట్లో వారికి సపర్యలు చేయటం, 11. కుటుంబంలోని సభ్యులందరి మధ్య సజీవ సంబంధాలుండేట్లు చూడ్డం. 2. ఇంటికి అవసరమైన సరుకులు కొనడం. 13.కుటుంబ నిర్వహణ వగైరా ఎన్నో.

సమాజంలో ఆర్థిక పరంగా ఏర్పడ్డ వర్గాలని బట్టి ఇంటిపనిలో తేడాలు కూడా ఉన్నాయి. అట్టడుగు స్థాయికి వెళ్ళేకొద్దీ ఇంటిపని కూడా స్త్రీకి అదనపు భారమవుతుంది. ఉదా: గ్యాస్‌పైన వంటచేసే స్త్రీకి వంటలో సౌలభ్యం ఉంది. కానీ గ్రామాల్లో వ్యవసాయ కూలీ స్త్రీకి వంట చెయ్యడానికి (పచ్చికట్టెలతో, పొగతో) అవస్థపడాలి. పైగా దూర ప్రాంతం నుండి కట్టెలు కూడా తెచ్చుకోవాలి. శ్రీకాకుళం పట్టణానికి అనుకుని ఉన్న కొన్ని గ్రామాల్లో స్త్రీలు కట్టెలు దొరక్క అరటి ఆకులతో వంట చేస్తున్నామని చెప్పారు. అదికూడా భూస్వాముల దయాదాక్షిణ్యాలపై ఆధారపడి ఉంటుంది. కట్టెలు సరిగా లేక, ఇరుకు వంట గదుల్లో పొగ బయటికి పోదు. అందువల్ల ఎక్కువమంది స్త్రీలకు కళ్ళు, ఊపిరితిత్తుల్లో కాలుష్యం చేరి ఆరోగ్యాలు దెబ్బతింటున్నాయి. సిగరెట్లు త్రాగే వారికన్నా ఈ పొగపీల్చే స్త్రీలే ఎక్కువ అనారోగ్యానికి గురవుతారని డాక్టర్లే చెప్తున్నారు. అలాగే దూర ప్రాంతాల నుండి నీళ్ళు తెచ్చుకోవడం, బట్టలు ఉతుక్కోడానికి కూడా కొన్ని గంటలు శ్రమపడుతున్నారు. మొత్తం మీద స్త్రీలు 7 నుండి 10 గంటలపాటు ఇంటిపని కోసం ఖర్చుపెడుతున్నారు.

**ఇంటిపని -విలువ**

అయితే ఇంటిపనికి విలువ ఎందుకు లేదు? స్త్రీలు "మేం ఏం పని చేయటం లేదు" అని ఎందుకు చెప్తున్నారు? వారు చేసే పనికి ఎందుకు లెక్క చెప్పడం లేదు? అంటే ఆర్థిక పరిభాషలో (పెట్టుబడిదారీ ఆర్థిక పరిభాష) ఇంటిపనికి

**సమాజంలో ఆర్థిక పరంగా ఏర్పడ్డ వర్గాలని బట్టి ఇంటిపనిలో తేడాలు కూడా ఉన్నాయి. అట్టడుగు స్థాయికి వెళ్ళేకొద్దీ ఇంటిపని కూడా స్త్రీకి అదనపు భారమవుతుంది.**

విలువ ఏర్పడుతుంది. స్త్రీలు ఇంట్లో చేసే పని సామాజికంగా ఎంత అవసరమైనా డబ్బు సంపాదించేది లేదు. కనుక విలువ లేకుండా ఉంది. ఐక్యరాజ్య సమితి అభివృద్ధి నివేదిక ప్రకారం (యు.ఎన్.డి.పి) స్త్రీలు చేసే శ్రమలో సుమారు 70 శాతం మార్కెట్ విలువలేనిది. ఇది పురుషుల శ్రమకన్నా చాలా ఎక్కువ. ఇంటి పనికే గనుక ఆర్థికంగా విలువ కట్టే పనైతే ఇది స్థూల జాతీయోత్పత్తిలో నాలుగవ వంతు ఉంటుందట. గాల్ బ్రెయిత్ అనే అమెరికన్ ఆర్థిక శాస్త్రవేత్త చెప్పేదేమంటే " 1970 లెక్కల ప్రకారం స్త్రీలు ఇంట్లో చేసేపని వారానికి 257 అమెరికన్ డాలర్లు లేదా సంవత్సరానికి 13,304 డాలర్ల విలువ కలిగి ఉంటుంది". అయినా ఇంటిపనికి ఎందుకు విలువ లేదు?

**ఇంటిపని-పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ:** ఇంటిపనికి విలువ లేకపోవటమనేది పెట్టుబడిదారీ వ్యవస్థ యొక్క ఒక అవసరం. పైన చెప్పిన అమెరికన్ ఆర్థికవేత్త అభిప్రాయమేమంటే "కుటుంబంలో స్త్రీ సబార్డినేట్ స్థానంలో ఉండటం, ఆమె పూర్తిగా వంటకు, ఇంటి బాధ్యతలకు కట్టుబడి ఉండటమనేది పెట్టుబడిదారీ విధానానికి అవసరమైనది. కుటుంబంలో స్త్రీలు కనిపించని శ్రమజీవుల వర్గానికి (ప్రచ్ఛన్న సేవకులు)చేరిపోయి ఉండడమనేది ఆర్థికంగా పెట్టుబడిదారీ సమాజానికి అవసరం. వేతనం మీద పనిచేసే సేవకులు కేవలం కొద్దిమందికి మాత్రమే దొరుకుతారు. కాని భార్య రూపంలో ఉన్న సేవకురాలు మొత్తం పురుష జనాభా కంతటికీ చాలా ప్రజాతంత్రయుతంగా పైసా ఖర్చు లేకుండా దొరుకుతుంది. కుటుంబంలో స్త్రీలు చేసే సేవలు బయట కొనుక్కోవాలంటే అదనంగా డబ్బుఖర్చు లేకుండా భార్య ఆదుకుంటుంది. పొదుపు కూడా చేస్తుంది. కనుక ఆ మేరకు ఆ డబ్బుతో ఇతర వస్తువులు కొనుక్కోగలుగుతాడు. కనుక పెట్టుబడిదారుడు తయారుచేసే వస్తువులకు గిరాకీ పెరుగుతుంది. అంతేగాక, కార్మికునికి జీతం లెక్క గట్టి నిర్ణయించేటప్పుడు, ఇంట్లో భార్యచేసే సేవలకు కూడా లెక్కగట్టి ఇవ్వాలి. కాని ఇవ్వడు. ఆ విధంగా పరోక్షంగా కార్మికుని భార్యకూడా పెట్టుబడిదారుని దోపిడీకి గురవుతోంది. ఈ విధంగా స్త్రీ గృహ బానిసత్వం ఆర్థికంగా పెట్టుబడిదారీ దోపిడీ పెరగటానికి ఉపయోగపడుతోంది.

సామాజికంగాకూడా కుటుంబంలో స్త్రీ స్థానం పెట్టుబడిదారీ దోపిడీకి అనువుగా ఉందని కొందరు మార్క్సిస్టు సామాజిక శాస్త్రవేత్తలు చెప్తున్నారు. వారి అభిప్రాయం ప్రకారం "కార్మికుని భార్య కార్మికుని నిత్యం పనిచేసే స్థాయిలో (వర్కింగ్ కండీషన్) అట్టే పెడుతుంది. రోజంతా పనిలో అలసిపోయి ఇంటికి వచ్చిన కార్మికుణ్ణి అతని భార్య తన సపర్యల ద్వారా అలసట పోగొడుతుంది. ఉత్తేజాన్నిస్తుంది. ఆవిధంగా అతన్ని మరల మరుసటి రోజు పనిచేసే స్థితికి తెస్తుంది. దోపిడీకి గురయ్యే కార్మికుడు సహజంగానే నిరాశా నిస్పృహలకు గురవుతాడు. తన చికాకునంతటినీ తన భార్యమీద చూపిస్తాడు. పెట్టుబడిదారీ విధానంపై ఎక్కుపెట్టాల్సిన కోపాన్ని భార్యపై చూపిస్తాడు. ఆ విధంగా పెట్టుబడిదారీ దోపిడీ కొనసాగింపుకు దోపిడీ మరింత కాలం పొడిగించడానికి పరోక్షంగా కుటుంబం స్త్రీ లొంగుబాటు స్థానం దోహదపడుతోంది.

**ఇంటిపని -స్త్రీ విముక్తి: బి.టి.ఆర్:**

కామ్రేడ్ బి.టి.ఆర్ మాటల్లో చెప్పాలంటే 'సమాజం కుటుంబంలో స్త్రీ తక్కువ స్థాయిలో ఉండటమనేది ఆధునిక పెట్టుబడిదారీ సమాజం యొక్క ప్రాథమిక లక్షణం. విషయమేమంటే పెట్టుబడిదారీ విధానంలో కుటుంబం అనేది సాంఘిక ఉత్పత్తి ఒక కణం (యూనిట్)వంటిది. దాని ఫలితం కుటుంబంలో కనిపించని సేవలు చేసే సేవికగా తక్కువ స్థానంలో ఉండడమే. కనుక ఈ స్థితి నుండి బయటపడకుండా స్త్రీ విముక్తి సాధ్యంకాదు. తమ బ్రతుకుతెరువు కోసం తమ స్వంత సంపాదనపై ఆధారపడాలి. సామాజిక ఉత్పత్తిలో భాగస్వాములైనప్పుడే ఇది సాధ్యం. అప్పుడు కుటుంబంలో స్త్రీ, పురుష

**ఐక్యరాజ్య సమితి అభివృద్ధి నివేదిక ప్రకారం (యు.ఎన్.డి.పి) స్త్రీలు చేసే శ్రమలో సుమారు 70 శాతం మార్కెట్ విలువలేనిది. ఇది పురుషుల శ్రమకన్నా చాలా ఎక్కువ. ఇంటి పనికే గనుక ఆర్థికంగా విలువ కట్టే పనైతే ఇది స్థూల జాతీయోత్పత్తిలో నాలుగవ వంతు ఉంటుందట. గాల్ బ్రెయిత్ అనే అమెరికన్ ఆర్థిక శాస్త్రవేత్త చెప్పేదేమంటే " 1970 లెక్కల ప్రకారం స్త్రీలు ఇంట్లో చేసేపని వారానికి 257 అమెరికన్ డాలర్లు లేదా సంవత్సరానికి 13,304 డాలర్ల విలువ కలిగి ఉంటుంది". అయినా ఇంటిపనికి ఎందుకు విలువ లేదు?**

**ఇంటిపనికి విలువ లేకపోవటమనేది పెట్టుబడిదారీ వ్యవస్థ యొక్క ఒక అవసరం. పైన చెప్పిన అమెరికన్ ఆర్థికవేత్త అభిప్రాయమేమంటే "కుటుంబంలో స్త్రీ సబార్డినేట్ స్థానంలో ఉండటం, ఆమె పూర్తిగా వంటకు, ఇంటి బాధ్యతలకు కట్టుబడి ఉండటమనేది పెట్టుబడిదారీ విధానానికి అవసరమైనది. కుటుంబంలో స్త్రీలు కనిపించని శ్రమజీవుల వర్గానికి (ప్రచ్ఛన్న సేవకులు)చేరిపోయి ఉండడమనేది ఆర్థికంగా పెట్టుబడిదారీ సమాజానికి అవసరం. వేతనం మీద పనిచేసే సేవకులు కేవలం కొద్దిమందికి మాత్రమే దొరుకుతారు. కాని భార్య రూపంలో ఉన్న సేవకురాలు మొత్తం పురుష జనాభా కంతటికీ చాలా ప్రజాతంత్రయుతంగా పైసా ఖర్చు లేకుండా దొరుకుతుంది.**

సంబంధాల్లో గౌరవం, సమానత్వం సాధ్యమౌతుంది. పెట్టుబడిదారీ విధానం రద్దు కాకుండా చట్టపరమైన సంస్కరణలతో ఇది సాధ్యం కాదు".

**ఇంటిపని: కామ్రేడ్ లెనిన్:**

స్త్రీల గృహ బానిసత్వం గురించి కామ్రేడ్ లెనిన్ అనేక సందర్భాల్లో చెప్పడం జరిగింది. జర్మన్ కమ్యూనిస్టు పార్టీ నాయకురాలు క్లారా జట్కిన్‌తో చర్చించే సందర్భంలో ఈ క్రింది విధంగా అతను వ్యాఖ్యానిస్తారు. "స్త్రీ తన కాలాన్ని, శక్తినీ కేంద్రీకరించి నిరంతరం అల్పమైన విసుగు పుట్టించే ఇంటి పనుల్లో సతమతమవుతూంటే పురుషుడు ప్రశాంతంగా చూస్తుంటాడు. ఆ పనిలో స్త్రీ మనోనేత్రం మూసుకుపోతూంటే ఆమె బుద్ధి మందగిస్తూంటే, ఆమె హృదయం నీరసిస్తూంటే, ఆమె మానసిక శక్తి బలహీనమవుతుంటే చూస్తూంటాడు. ఇది సర్వసాధారణమైన విషయం. ఇంతకంటే అతని కర్కశత్వానికి నిదర్శనం ఏం కావాలి? శ్రామికుల్లో సైతం కొద్దిమంది భర్తలే తాము ఈ ఆడవాళ్ళ పనిలో కాస్త చేయూతనివ్వడం వల్ల తమ భార్యల కష్టాన్ని వారి చికాకుల్ని తొలగించవచ్చునో, సమూలంగా నాశనం చెయ్యవచ్చునో ఆలోచిస్తున్నారు. కాని వారలా చేయరు. అది భర్త హక్కులకూ, హోదాకు భంగకరమని భావిస్తాడు. తనకు మాత్రం విశ్రాంతి సౌకర్యం కోరతాడు. రెండోవైపు స్త్రీ తన గత జీవితంలో అనంతమైన, స్వల్పమైన విషయాలకు తన వ్యక్తిత్వాన్ని త్యాగం చేస్తుంది. ఆమెకు ప్రభువుగా

**స్త్రీ ఇంట్లో చేసే సేవలు కూడా పరిగణనలోకి తీసుకోవాలని ఒత్తిడి తేవాలి. సోషలిజం కోసం ఉద్యమాలలో పాల్గొనే పురుషులు ఇంటిపనిలో భాగం పంచుకోవాలి. తద్వారా తమ ఇళ్ళల్లోని స్త్రీలకు ఉపశమనం కలిగించడమే గాక సామాజిక మార్పు కోసం సాగించే పోరాటంలో ఆ స్త్రీలు పాలుపంచుకోవడానికి తోడ్పడినవారవుతారు.**

**"స్త్రీ తన కాలాన్ని, శక్తినీ కేంద్రీకరించి నిరంతరం అల్పమైన విసుగు పుట్టించే ఇంటి పనుల్లో సతమతమవుతూంటే పురుషుడు ప్రశాంతంగా చూస్తుంటాడు. ఆ పనిలో స్త్రీ మనోనేత్రం మూసుకుపోతూంటే ఆమె బుద్ధి మందగిస్తూంటే, ఆమె హృదయం నీరసిస్తూంటే, ఆమె మానసిక శక్తి బలహీనమవుతుంటే చూస్తూంటాడు. ఇది సర్వసాధారణమైన విషయం. ఇంతకంటే అతని కర్కశత్వానికి నిదర్శనం ఏం కావాలి?**

యజమానిగా చలామణి అయ్యే ఆమె భర్త సాంప్రదాయ హక్కులు నిగూఢరూపంలో విజృంభించి ఉంటాయి. అంతేకాదు స్త్రీ గృహబానిసత్వం నుండి బయటపడేందుకు సోషలిస్టు ప్రభుత్వం చొరవ తీసుకోవాలని," తన బ్రతుకు తెరువుకు భర్తపై ఆధారపడకుండా ఉండేందుకు ఆమెను సామాజికోత్పత్తిలో భాగస్వామిని చేయాలని భావిస్తాడు.

**ఇంటిపని:సోషలిజం:**

"సమిష్టి వంటశాలలు, ఆహార కేంద్రాలు, పబ్లిక్ లాండ్రీలు, మరమ్మత్తు షాపులు, శిశు సంరక్షణ కేంద్రాలు శిశు శిక్షణాలయాలు, వినోదశాలలు అన్ని రకాలైన తర్ఫీదు సంస్థలు నిర్మింపబడుతున్నాయి. క్లుప్తంగా చెప్పాలంటే, కుటుంబ నిర్వహణ, బిడ్డల శిక్షణ సమాజ బాధ్యత అనే సూత్రాలన్నీ మేము చైతన్యంతో అమలు జరుపుతున్నాము. ఈ విధంగా స్త్రీ గృహ బానిసత్వం నుండి భర్త మీద ఆధారపడే స్థితినుండి విముక్తి చేయబడుతోంది. స్త్రీ తన శక్తి సామర్థ్యాలను బట్టి, అభిరుచులను బట్టి సామాజిక కార్యక్రమాల్లో పాల్గొనేందుకు సకల అవకాశాలు కలిగించబడుతున్నాయి" అని లెనిన్ క్లారా జెట్కిన్‌తో చర్చించే సందర్భంగా చెపుతారు. అది అక్షరాల వాస్తవమని సోషలిస్టు దేశాల్లో స్త్రీల పరిస్థితి తెలియజేస్తోంది.

**ఇంటిపని-మార్క్స్:**

గృహదాస్యం గురించి మార్క్స్ కూడా ప్రస్తావించడం జరిగింది. ఆధునిక దాంపత్య జీవితంలో బానిసత్వంతోపాటు దాసత్వం కూడా బీజ రూపంలో దాగి ఉన్నది. ప్రారంభం నుండి వ్యవసాయ పనుల కోసమే ఇది వచ్చింది?"

పేద మధ్య తరగతి రైతు కుటుంబాల్లోని స్త్రీలకు ఇది సూటిగా వర్తిస్తుంది. ఆ స్త్రీలు ఇంటిపనితో పాటు పొలం పని, కుటుంబానికి ఆర్థికంగా తోడ్పాటునిచ్చే ఇతర పనులు, కోళ్ళు పెంచడం, పాడి గేదెలు వగైరా కూడా చేస్తారు. కాని వారి శ్రమకు గుర్తింపు లేదు. పొలం మీదగాని దానిపై వచ్చే ఆదాయంపైన గాని వారికి హక్కులేదు. హక్కులేని కారణంగా వారు ప్రభుత్వ లెక్కల్లో కూడా నమోదు కావడం లేదు.

**ఇంటిపని -వ్యవసాయ కార్మిక స్త్రీలు:**

స్త్రీ విముక్తిని, పెట్టుబడిదారీ సమాజం అంతాన్ని కోరుకునే ప్రతి ఒక్కరు ఇంటిపని సమస్యను తీవ్రంగా పరిగణించాలి. ఇది కేవలం మహిళా సంఘాల బాధ్యత మాత్రమే కాదు అందరి బాధ్యత. కనుకనే అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం స్త్రీ ఇంట్లో చేసే పనికి ప్రభుత్వం విలువ కట్టాలని డిమాండ్ చేస్తోంది. దీని వల్ల స్త్రీ శ్రమకు గుర్తింపు లభిస్తుంది. స్త్రీలు చాతకాని వారని, ఇతరులకు భారమనే భావాన్ని తొలగించేందుకు వీలవుతుంది. అలాగే కుటుంబాల్లో స్త్రీలు ఇంటిపనిలో భాగంగా కుటుంబానికి ఆర్థికంగా తోడ్పాటునిచ్చే అనేక పనులు చేస్తారు. గేదెల్ని, కోళ్ళని పెంచడం, కూరగాయలు పండించడం, మిషనుకుట్టడం, విస్తరాకులు కుట్టడం, పచ్చళ్ళు తయారు చేసి అమ్మడం, లేసులు అల్లడం వగైరా. ప్రభుత్వం జనాభా లెక్కలు సేకరించేటప్పుడు ఈ శ్రమని గుర్తించి లెక్కలు కట్టాలి. ప్రభుత్వ పథకాల ద్వారా ఇటువంటి స్త్రీలకు ఆర్థిక సహాయం చేయడం అవసరం. స్త్రీలు చేసే ఇటువంటి

ఇంటిపని భారం కారణంగా స్త్రీలు ఎంతగానో నష్టపోతున్నారు. తగినంత సమయాన్ని వారి శక్తి సామర్థ్యాలను, నైపుణ్యాన్ని పెంచుకునేందుకు కేటాయించలేకపోతున్నారు. వారి శ్రమ, టాలెంట్స్ వృథా అవుతున్నాయి. సమాజంలో సగభాగం పౌరులుగా రాజకీయాల్లోగాని ఇతర రంగాల్లో గాని వారు పాత్రధారులు కావడానికి ఇంటిపని భారం పెద్ద ఆటంకం. ఉద్యోగం చేసే స్త్రీ అటు ఇంటి చాకిరీ ఇటు విధి నిర్వహణకి మధ్య సతమతమవుతోంది.

పన్లను గుర్తించని కారణంగా స్త్రీలు ఎంతో నష్టపోతున్నారు. ఉదా: నర్సాపూర్ ప్రాంతంలో లేసులు అల్లేవారు కొన్నివేల మంది ఉన్నారు. విపరీతంగా దోపిడీకి గురవుతున్నారు. కాని వారుగాని, వారి శ్రమగానీ ఎక్కడా లెక్కల్లో లేదు.

ఇంటిపని భారం కారణంగా స్త్రీలు ఎంతగానో నష్టపోతున్నారు. తగినంత సమయాన్ని వారి శక్తి సామర్థ్యాలను, నైపుణ్యాన్ని పెంచుకునేందుకు కేటాయించలేకపోతున్నారు. వారి శ్రమ, టాలెంట్స్ వృథా అవుతున్నాయి. సమాజంలో సగభాగం పౌరులుగా రాజకీయాల్లోగాని ఇతర రంగాల్లో గాని వారు పాత్రధారులు కావడానికి ఇంటిపని భారం పెద్ద ఆటంకం. ఉద్యోగం చేసే స్త్రీ అటు ఇంటి చాకిరీ ఇటు విధి నిర్వహణకి మధ్య సతమతమవుతోంది.

స్త్రీకి ఇంటి చాకిరీ నుండి విముక్తి సోషలిజంలోనే అని పైన తెలుసుకున్నాము. అయితే సోషలిజం కోసం ఎదురు చూడ్డం తప్ప మరోమార్గం లేదా? ఇంటిపనిలో కుటుంబ సభ్యులు భాగం పంచుకోవాలి. ఇంటి పనులు ఆడవాళ్ళు నెత్తిన వేసుకుంటున్నారు. కాని ఇంట్లో చేసే పనులు మగవాళ్ళు చేయడం ఎలా తప్పు? స్త్రీలలో కూడా మార్పు రావాలి. ఇల్లే స్వర్గమనే భావం పోవాలి. ఇంటిపనిలో పురుషులు, మగపిల్లలు భాగం పంచుకునేటట్లు ప్రోత్సహించాలి. సామాజిక జీవనంలో ఉద్యమాల్లో భాగస్వామ్యం కావాలి. అప్పుడే వారిలో నిరాశా, నిస్పృహలు తగ్గుతాయి.

ప్రధానంగా సామాజిక మార్పు కోసం పనిచేసే వివిధ ప్రజాసంఘాలు కూడా ఆలోచించాలి. వంట చెరకు, నీళ్ళు, ఇళ్ళ నిర్మాణం, మురుగు కాల్వలు వంటి సమస్యలపై కేంద్రీకరించాలి. కనీస వేతనాలు నిర్ణయించడంలో (వారు పారిశ్రామిక కార్మికులు గాని, వ్యవసాయ కార్మికులుగాని) స్త్రీ ఇంట్లో చేసే సేవలు కూడా పరిగణనలోకి తీసుకోవాలని ఒత్తిడి తేవాలి. సోషలిజం కోసం ఉద్యమాలలో పాల్గొనే పురుషులు ఇంటిపనిలో భాగం పంచుకోవాలి. తద్వారా తమ ఇళ్ళల్లోని స్త్రీలకు ఉపశమనం కలిగించడమే గాక సామాజిక మార్పు కోసం సాగించే పోరాటంలో ఆ స్త్రీలు పాలుపంచుకోవడానికి తోడ్పడినవారవుతారు.

సమాజంలో సగభాగంగా ఉన్న స్త్రీలు పాల్గొనకుండా ఏ ఉద్యమం జయప్రదం కాదు. ●

# ఇల్లాలి మనోరథం

ఆమెకు-
నోట్లో నాలుక లేదు-పాపం!
ఆమెకు- చెవులున్నాయి
చెవుల కంటే వేగంగా స్పందించే
హృదయమూ ఉంది
తలలో నాలుక-అంటే
అర్థం తెలియని వారికి
ఆమెని చూస్తే తెలుస్తుంది
అందరికీ ఆ ఇంట్లో 'ఆమె'
తలలో నాలుక అని
పుట్టినింట్లో అయినా
మెట్టినింట్లో అయినా
ఎవరు ఏ పేరుతో పిలిచినా..
తానే పలుకుతుంది
ఎవరికి ఏది కావాలన్నా
తానే ముందు నిలుస్తుంది
తానెవరో? తన అసలు పేరేమిటో?
తన ఉనికి ఏమిటో?
మర్చేపోయింది ఇన్నేళ్ళూ!!

ముదిమి ముసురుకు వస్తూవుంటే
ఆమెమెదడు స్పందిస్తూంది తీరిగ్గా
నాలుకతో బయటకు చెప్పలేని
అనేక భావాలు సంకేతాలుగా
హృదయానికి అందుతున్నాయి
తన గురించిన ఆలోచనలు
అస్పష్టంగా, వింతగా ముసురుకుంటున్నాయి
తన బాల్యం... తన ఇష్టాలు...
తన సంతోషాలు.. సరదాలు...
తన కోసం తానుగా ఒక్కనాడైనా
మిగలలేని నిస్సహాయతా..
అన్నీ కలగా పులగమై పోతున్నాయి
అవి- మరీ పెద్ద పెద్ద కోరికలూ కావు
ఒక్కరోజన్నా సూర్యోదయాల్లో విరిసీ
విరియని
పూబాలలతో ఊసులాడాలనీ
సూర్యాస్తమయాల్లో ఏకాంతాన్ని
ఆస్వాదించాలనీ
తన కిష్టమైన
ఆహారాన్నీ, ఆహార్యాన్నీ ఆస్వాదించాలనీ
తనకు నచ్చిన
తనను మెచ్చిన స్నేహితులతో
సరదాగా కాసేపైనా కాలక్షేపం చేయాలనీ
అందరికీ తలలో నాలుకై
తన ఉనికిని తానే మర్చిపోయిన ఆమె
తన గురించి తాను ఆలోచించడం
మొదలుపెట్టింది.

- ఆర్. దుర్గా ప్రసన్న

★

# దృఢ సంకల్పం

-మల్లెమాల వేణుగోపాలరెడ్డి

"తొందర పడొద్దు...మీ నాయన్తో మాట్లాడుతా" మనవరాలు సురేఖతో అంది సుదర్శనమ్మ.

"ఏం లాభం లేదు నానమ్మా! నాయన ఎవరి మాటావినరు. అమ్మ ఆయనకే తందానా" సురేఖ అంది.

"వాడెంత మొండి ఘటమో నేనూ చూస్తాను...వాడు కాదంటే నేనున్నానుగా! నువ్వు ధైర్యంగా ఉండు. ప్రస్తుతానికి నువ్వు ఇక్కడే నా దగ్గరే ఉండు" సురేఖ తల నిమురుతూ అంది సుదర్శనమ్మ.

"నువ్వే చెప్పు నానమ్మా! సుధీర్కు ఎంసెట్లో ర్యాంక్ రాదని ముందుగానే లక్షలకు లక్షలు డిపాజిట్గా అడ్వాన్స్ డొనేషన్ కట్టి, హైద్రాబాద్ మల్లారెడ్డి కాలేజీలో బిటెక్ చేర్పించారు నాన్న... నాకు తప్పకుండా ఎం.సెట్లో ర్యాంకు వస్తుంది. మొన్ననే 'గీతం' ఎంట్రెన్స్ రాశాను. అక్కడా ర్యాంకు వస్తుంది. ఎక్కడైనా సరే నాకు ఫ్రీ సీటు వస్తుంది. కాలేజీ ఫీజులు కడితే చాలు. నాన్న నన్ను ఇంజనీరింగ్లో చేర్చేందుకు సిద్ధంగా లేరు. ఇక అమ్మ అయితే "నీకెందుకమ్మా ఇంజనీరింగ్? హోంసైన్స్ చదువు.. మా కళ్ళముందే ఉంటావు" అంటుంది.

"మీ అమ్మ మంచిమాట చెప్పింది గదరా! నిన్ను పెద్ద కట్నమిచ్చి ఒక ఐ.ఎ.ఎస్ అబ్బాయికిచ్చి పెళ్ళిచేస్తాం... హాయిగా సంసారం చేసుకో" ఇదీ నాన్నమాట.

"అదీ మంచిదేగదా పాపా! నీ జీవితం హాయిగా గడిచిపోతుంది".

"ఏమిటి నానమ్మా! నువ్వు కూడాను... నాకంటూ ఒక వ్యక్తిత్వం ఉండాలిగదా? ఆ ఐ.ఎ.ఎస్ ఏదో నేనే చేస్తాను... ఆ పెద్ద ఉద్యోగమేదో నేనే చేస్తాను... నువ్వు నన్ను ఆశీర్వదించు నానమ్మా!'' సుదర్శనమ్మను గట్టిగా కౌగలించుకుంది సురేఖ. ఆ అమ్మాయి భుజం తట్టింది నానమ్మ. "అంతేలే బుజ్జీ! మీ అన్న సుధీర్ అంత తెలివైనవాడు కాదు. వాడు ఐ.ఎ.ఎస్ చదవలేదు? మీ నాయన్ని సివిల్ సర్వీస్ చేయించాలని మీ తాత ఆశపడ్డాడు. ఆ ఆశ తీరకుండానే ఆయన కన్నుమూశారు. మీ నాయన డిగ్రీ పూర్తిచేసి రియల్ ఎస్టేట్లూ, కాంట్రాక్ట్లో దిగి బాగా సంపాదించాడు. అందుకే పెద్ద కట్నం ఇస్తానంటున్నాడు...నువ్వైనా ఐ.ఎ.ఎస్ చదువు. మీ తాత ఆశ నెరవేరుతుంది.

"అన్న అడగ్గానే వాడికి 'పల్సర్' మోటార్ బైక్ కొనిచ్చాడు. దాంతో వాడు గర్ల్ఫ్రెండ్తో షికార్లు....నాకు డొనేషన్లూ, మోటార్ బైకులూ వద్దు నన్ను చదువుకోనిస్తే చాలు".

''నరే! సరే! నేను వాడితో మాట్లాడతానుండు" వెంటనే కొడుక్కి ఫోన్ చేసింది సుదర్శనమ్మ.... విషయం వివరంగా చెప్పింది.

"ఆ అమ్మాయి మేలుకోరే గదమ్మా నేను చెప్పింది...పెద్ద చదువులు చదివి పెద్ద ఉద్యోగాలు చేస్తున్న ఆడపిల్లలు సుఖంగా.... సంతోషంగా ఉన్నారా! మళ్ళీ భర్తల పురుషాహంకారానికి బలైపోతున్నారు".

"ఏంరా! ఆడపిల్లలు ఈ రోజుల్లో ఎన్నెన్ని పదవులు, ఉద్యోగాలు చేసి ఆడజాతికే గర్వకారణంగా ఉన్నారు. నా మనవరాలు తప్పకుండా కలెక్టరౌతుంది. దాన్ని నేను చదివిస్తా.... ఈ పిల్ల ఇక్కడే నా దగ్గరే ఉంటుంది. హైద్రాబాద్కు రాదు" ఖచ్చితంగా చెప్పి ఫోన్ పెట్టేసిందామె. వింటున్న సురేఖ ఆనందంతో నానమ్మ ఒడిలో వాలిపోయింది. సుదర్శనమ్మకు వెచ్చని స్పర్శ.



"అమ్మగారూ! చంద్రమ్మ వచ్చింది" మనవరాలు చంద్రలతతో వచ్చిన రిటైర్డ్ కోర్టు బంట్రోతు సుబ్బన్న అన్నాడు. చంద్రలత సుదర్శనమ్మ పాదాలకు నమస్కారం చేసింది.

సురేఖ వచ్చి చంద్రమ్మను కౌగలించుకుని "అక్కా! నువ్వు గ్రూప్ వన్ ప్యాసైనందుకు కంగ్రాట్యులేషన్స్... అంతటితో ఆగిపోవద్దు ఐ.ఎ.ఎస్ రాయక్కా! నువ్వు తప్పక సెలెక్ట్ అవుతావు".

"తప్పకుండా రాస్తాను సురేఖమ్మా! తప్పకుండా రాస్తాను. అంతేకాదు నువ్వూ ఐ.ఎ.ఎస్.కు ఇప్పట్నుంచే ప్రిపేరవ్వు"

"చంద్రా ఈ పిల్లకూడా అదే ఆలోచనల్లో వుంది. దీనికి నువ్వు గైడ్ చెయ్యి..." సుదర్శనమ్మ అంది.

"పెళ్ళి చేద్దామంటే వద్దని ఆ పరీక్షలు రాసిందమ్మా చంద్రమ్మ ఆమె పట్టుదల చూసి మేమూ సరేనన్నాము.

సురేఖకు లైన్ క్లియరయ్యింది. తన కోర్టులోకి వచ్చిన బంతిని సుదర్శనమ్మ గట్టిగా విసిరింది. ఎగిరి గంతేసి బంతిని పట్టుకుంది సురేఖ....చంద్రలత గైడెన్స్ కూడా తోడయింది.

**(చైతన్య మానవి దశాబ్ది ప్రత్యేక సంచిక విడుదల సందర్భంగా నిర్వహించిన కథల పోటీలో సాధారణ ప్రచురణకు ఎంపికైన కథ)**

## వారేం చేశారు 'పాపం'

# పాలకుల చేతలు రాశాయి 'మరణశాసనం'

- బి. సుధాకిరణ్



తినడానికి నాలుగుముద్దలుండి తినే కుటుంబం ఐదుగురుంటే ఆకల్లేదంటూ అలవోకగా అబద్ధం చెప్పేది అమ్మ... కుటుంబంలో మహిళే... కరువు కాటకాలు, అతివృష్టి, అనావృష్టి, పెను ఉప్పెనలా విరుచుకుపడితే మొదటిగా బలయ్యేది పేదలు... ముఖ్యంగా మహిళలు... మన వ్యవస్థకు వెన్నెముక రైతు కుటుంబం. పూలదండలో దారంలో వారి శ్రమ అన్ని రంగాలకు విస్తరించి ఉంటుంది. కనిపించదు. అకాల వర్షాలకు చిగురుటాకులా వణికిపోయేది. వడ్డుకు చేరని నావలా కొట్టుకుపోయేది వారి జీవితమే. 2010-11 జల్, లైలా తుపానులు రాష్ట్రాన్ని అతలాకుతలం చేశాయి. పచ్చని పంటపొలాలు నీటి చలమలయ్యాయి. రైతన్నను కన్నీటిపాల్జేశాయి. ఇది జరిగి ఇప్పటికి రెండు సంవత్సరాలు. వారంతా నిరుపేద చిన్న, సన్నకారు, కౌలు రైతులు, మూడు, ఐదు రూపాయల వడ్డీకి అప్పులు తెచ్చి వ్యవసాయం చేశారు. ప్రకృతి కన్నెర్రకు కుదేలైన రైతుకు పాలకులు భరోసానివ్వలేకపోయారు. గుండెపగిలి కొందరు, ఉరివేసుకుని మరికొందరు పురుగు మందు తాగి ఎందరో... రైతులు ఆత్మహత్యలకు పాల్పడ్డారు. గుంటూరు జిల్లాలో దాదాపు 82మంది రైతులు మృత్యువాతబడ్డారు. వారి కుటుంబాలు వీధినపడ్డాయి. అప్పులవాళ్ల వత్తిడికి పుస్తెలతాడు అమ్మినా వారు కనికరించలేదు. కాడెడ్లు, కొంపాగోడు అమ్మి కొంత అప్పులు తీర్చారు. బాధిత కుటుంబంలోని మహిళలు కూలీల్లా మారిపోయారు. సాయం కోసం రెండు సంవత్సరాలుగా కార్యాలయాల చుట్టూ తిరిగి వేసారిపోయారు. వారి సమస్యల పరిష్కారం కోసం ప్రజాసంఘాలు వారందరిని ఒక వేదికమీదకు తీసుక వచ్చారు. చిన్న ఆధారం ఉంటే పోరుబాటలో వారు సాగితే... భూమిని చీల్చుకుని వచ్చే మొలకలా వారు నిలబడతారు. ఆటు, పోట్లలో రాటుదేలి ముందుకు సాగుతారు. వారి జీవిత గాథలే మానవి పాఠకుల కోసం...

**మట్టి ఖర్చులు కూడా ఇవ్వలేదు.**

**వెలిశెర్ల వెంకటరత్నం, రామచంద్రపాలెం, నూతక్కి**

ఐదెకరాలు కౌలుకు తీసుకుని మాగాణి వేశాం. పనల మీదున్న వరి వర్షంలో మునిగిపోయింది. ఆర్రోజులు నీళ్లల్లో ఓదెలున్నాయి. తెరిపిచ్చాక చూసుకుంటే ఓదెల మీద మొలకలొచ్చాయి. గింజ పనికి రాలేదు. అంతకు ముందుటేడు లంకలో మూడు ఎకరాలు కౌలుకు తీసుకుని బెండ, మినుము, పసుపు వేశాము. కృష్ణానది పొంగడంతో పంటలు మునిగాయి. మొత్తం రెండుతూర్లు కలిపి అప్పు లక్షా 60వేలు తేలింది. బ్యాంకులో బంగారం పెట్టి ఐదు, మూడు రూపాలయలకు అప్పుతెచ్చి వ్యవసాయం చేశాము. నీట మునిగిన పంట చూసొచ్చిన నా పెనిమిటి సుబ్బారావు(50) మొక్కజొన్నలకు వేసే మందు తాగాడు. 108లో తెనాలి తీసుకువెళ్ళాము. దానిలో పట్టించుకోలేదు. చనిపోయాడు. పోస్టుమార్టం రిపోర్టు కోసం మంగళగిరి రాశారు. అక్కడ దానికి మూడు వేలు కట్టించుకున్నారు. పోలీసులు కాగితాలకు డబ్బులు తీసుకుని ఇచ్చారు. మట్టి ఖర్చులు కూడా ఇవ్వలేదు. అప్పులోళ్ళకి గేదెలు అమ్మి కొంతవరకు బాకీలు తీర్చాను. కూలికి పోతున్నాను.

**వాగుముంచింది**

**విప్పర్ల అనిత, ఉప్పరపాలెం, యడ్లపాడు మండలం**

పదకొండు ఎకరాలు కౌలుకు తీసుకున్నాం. వాగెమ్మట పొలం, పత్తి, వరి, దోసలు వేశాం. పంట చేతికొచ్చే దశలో కురిసిన వానలతో వాగు పొంగింది. పొలం మునిగింది. పొలం సూత్తానికి వెళ్లిన నా భర్త యాకోబు(30) చేలోనే వేప చెట్టుకు ఉరి పెట్టుకున్నాడు. ఆయనికి నేనూ, నా నలుగురు బిడ్డలు గుర్తుకురాలేదు. మూడు రూపాయల వడ్డీకి తెచ్చిన నాలుగు లక్షల అప్పు కనిపించేదేమో మమ్మల్ని ఒగ్గేసి వెళ్లిపోయాడు. అప్పులోళ్ల గోల పడలేక ఉన్న అర ఎకరం, కాడెద్దులు అమ్మి అప్పులు తీర్చాను. అధికారులు వచ్చారు. రాసుకెళ్లారు. ఇంతవరకూ ఏ సాయం చేయలేదు. ఇంకా అప్పులు ఉన్నాయి. పడుతున్న కష్టాలముందు కన్నీళ్లు ఎండిపోయాయి. ఎదుగుతున్న బిడ్డల్ని సూత్తుంటే గుండె చెరువవుతుంది.

గుండె పగిలిపోయింది.

**గన్నవరపు సామ్రాజ్యం, శేకూరు, చేబ్రోలు మండలం**

రెండెకరాలు కౌలుకు తీసుకున్నాము. కోతలు వేసి ఓదెలు తిప్పాము. పంట మీదున్న పొలం అకాలవర్షంతో తడిచింది. నా భర్త వెంకటేశ్వర్లు(40) చూడ్డానికి పొలం వెళ్లాడు. ఇంటికొచ్చి పడిపోయాడు. తెనాలి, అక్కడి నుండి గుంటూరు తీసుకెళ్లాము. ఆగిన గుండె మోగలేదు. చచ్చిపోయాడని డాక్టర్లు చెప్పారు. అధికార్లు వచ్చి రాసుకెళ్లారు. కనీసం మట్టి ఖర్చులు కూడా ఇయ్యలేదు. కూలి పనికి వెళుతున్నాను. రెండేళ్ల వ్యవసాయంలో చేసిన అప్పు రెండు లక్షలు తేలింది. నేను కూలికి వెళుతున్నాను.

**అప్పులూ పుట్టడం లేదు.**

**పొట్లూరు సుభానీ(తల్లి)**

**నాగమణి(భార్య) పొన్నెకల్లు, తాడికొండ మండలం**

నా కొడుకు కృష్ణయ్య(30) రెండేళ్లపాటు వరుసగా నాలుగెకరాలు సాగుచేస్తే నష్టం వచ్చింది.లక్షాఎనభై వేల అప్పులు తీర్చే మార్గం లేదని మేం చేనుకు వెళ్లినప్పుడు పురుగుల మందు తాగాడు. అధికారులు పరామర్శించి పోస్టుమార్టం చేయించాలని చెప్పారు. దానికి రూ၊3,500 ఖర్చు అయింది. ఎన్నిసార్లు అడిగినా అధికారులు సమాధానం చెప్పడంలేదు.

నా భర్త అకాల వర్షాలకు బలయ్యాడు. కూలిపనులు చేసుకుంటూ కూతుర్ని చదివిస్తున్నా. ఇటీవల వెన్నుపూసలో నీరుచేరి పనిచేయలేక పోతున్నా. ఎవరినైనా అప్పు అడుగుతుంటే మీ ఆయన చేసిన అప్పులు తీర్చండి అని ఒత్తిడి చేస్తున్నారు. పిల్ల చదువుకు ఏడాదికి ఏడు వేలు, తిండికి సర్దలేకపోతున్నా. ఒకరోజు పనికి వెళితే నాలుగు రోజులు చేయలేకపోతున్నా . ఇస్తామన్న సాయం ఇంతవరకూ అందలేదు.

**నాలుగు కేజీలతో నెలమొత్తం బతకాల...**

**బందెల హనుమమ్మ, చర్లగుడిపాడు, గురజాల**

ఐదెకరాలు కౌలుకు తీసుకుని చేసిన దాళ్వా వరిసాగు వర్షంలో మునిగిపోయింది. లక్షన్నర అప్పుతేలింది. అప్పులోల్ల తాకిడి ఎక్కువయ్యింది. నేను పొలం పోయి వచ్చేసరికి పురుగుమందు తాగాడు. ప్రభుత్వం వైపు నుండి రూపాయి సాయం కూడా అందలేదు. నేను కూలికి వెళుతున్నాను. భర్త చనిపోయాడని రేషన్ కార్డుకు ఇచ్చే బియ్యం తగ్గించారు.

**ఆస్పత్రి ఖర్చు రెండు లక్షలయ్యాయి.**

**వై. రత్నకుమారి, ఇర్లపాడు, నాదెండ్ల మండలం**

నా భర్త జోసఫ్(30) వరుసగా రెండేళ్లు ఐదెకరాల మిర్చి సాగు చేస్తే ఏడాదికి లక్ష చొప్పున రెండు లక్షల అప్పయ్యింది. బాధలు తట్టుకోలేక పురుగుల మందు తాగాడు. నరసరావుపేట ఆస్పత్రికి తీసుకెళ్తే మరోరెండు లక్షలు ఖర్చయ్యాయి. ఈ నాలుగు లక్షల అప్పుల వాళ్ళు నేటికీ వత్తిడి చేస్తూనే ఉన్నారు. నా ఒంటి రెక్కల కష్టంతో అత్తమామల్ని ఇద్దరు ఆడపిల్లల్ని పోషించుకుంటూ బతుకీడుస్తున్నా. చివరికి మాకు కన్నీళ్లు మిగిలాయి. మమ్మల్ని ఆదుకునేందుకు ప్రభుత్వం ఎలాగైనా సాయం చేయాలి.

**పొలంలోనే కుప్పకూలాడు**

**ఎనుముల తిరపతమ్మ, పాలపాడు, నరసరావుపేట మండలం**

మా ఆయన సీతయ్య(55) ఎనిమిదెకరాలు కౌలుకేచేశాడు. ఒకేడాది వర్షాలు లేక లక్ష వరకూ నష్టం వచ్చింది. వాటినైనా తీరుద్దామని మళ్లీ సాగుచేస్తే మళ్ళీ కురిసిన వర్షానికి దెబ్బతింది. రెండు లక్షలు అప్పులయ్యాయి. నేలవాలిన వరిపొలాన్ని చూసి చేలోనే కుప్పకూలాడు. అధికారులు వచ్చి రాసుకున్నారు. ఇంత వరకు ఏమీ ఇవ్వలేదు. కనీసం అప్పులైనా తీరుద్దామని నేనుసొంతంగా సాగు చేస్తే అదనంగా 50వేల నష్టం వచ్చింది. అప్పులవాళ్లు ఒత్తిడి చేస్తున్నారు. వాటిని చెల్లించే స్తోమతలేని నా కుమారులు వేరుపడిపోయారు. పనులు మానుకుని ఆఫీసుల చుట్టు ఎన్ని సార్లు తిరిగినా వస్తుంది అనే సమాధానమే మినహా వచ్చింది లేదు. ఇటీవల రోగం వచ్చి పదిరోజులు మంచం పట్టినా ఆదరించిన పరిస్థితి కూడా లేదు.

**ఒంటరిగా బతుకు పోరాటం**

**షేక్ కరీమూన్, పుల్లడిగుంట, వట్టిచెరుకూరు మండలం**

నా భర్త దరియాబాబు(25) రెండున్నర ఎకరాలు కౌలుకు తీసుకుని మిర్చి సాగు చేశాము. సొమ్ములు బ్యాంకులోపెట్టి కొంత సొమ్ము మూడు రూపాయలు వడ్డీకి అప్పు తెచ్చాము. పెట్టుబడి లక్ష అయింది. 2011 ఆగస్టులోవచ్చిన అకాల వర్షంతో పంట నేలపాలైంది. నేను లేని సమయం చూసి పురుగుల మందు తాగాడు. అధికారులు వచ్చి రాసుకున్నారు. పోస్టు మార్టం చేయడానికి మూడువేలు తీసుకున్నారు. ఇంత వరకు పైసా రాలేదు. నాలుగు నెలల కిందట మంత్రి కన్నాను కలిస్తే ఎక్స్‌గ్రేషియా నేరుగా ఇంటికే వస్తుందని చెప్పారు. భర్త చనిపోయాక ఏ రోజూ మూడు పూటలా కడుపునిండా తిని ఎరుగం. అమ్మ నాన్న లేరు. ఇద్దరు పిల్లల్ని కూలి డబ్బులతో పోషించలేక, అద్దెలు కట్టుకోలేక నానా యాతన పడుతున్నా. పదో తరగతి వరకు చదివినా అది అక్కరకు రాలేదు.



# ఇది ప్రజాస్వామ్యమా? కార్పొరేట్ల రాజ్యమా?

- నంబూరి పరిపూర్ణ

**ఈ కాలపు ప్రజాప్రతినిధులు, మంత్రులు-అలనాటి దేశభక్తుల, స్వాతంత్ర్య సమరయోధుల ధనమాన ప్రాణ త్యాగాలతో సాధించిన పాలనాధికారాన్ని అప్పనంగా అందుకుని తెల్లదొరలకు మించిన రీతిలో దేశాన్ని నిలువు దోపిడీ చేస్తున్నారు. అంతటితో సరా? తమతమ కుయుక్తుల, పలుకుబడుల దాదాగిరుల స్థాయినిబట్టి విదేశీ పెట్టుబడి వర్గాలతో చేతులు గలిపి, దేశ సహజ వనరుల్నీ సంపదనూ దోచుకుంటూ పంచుకుంటున్నారు. ప్రజలందరి శ్రమఫలితమైన పరిశ్రమల ప్రగతి ఫలాలు వారికందకుండా అడ్డుకుంటున్నారు.**

మనిషి సంఘజీవి అన్న నిజాన్ని మానవ పరిణామ శాస్త్రం ఏనాడో రుజువు చేసింది.

ఈ నిర్వచనానికి పూర్తిగా వ్యతిరేకమైన స్థితిలో ఇప్పుడు మనమున్నాం. ఆ కారణంగా బాధలు పడుతున్నాం. ఎందరికి సామూహిక సమిష్టి భావన ఉంది మనలో? బహుకొద్దిమందికి మాత్రమే. రాను రాను సమిష్టితత్వం సన్నగిల్లడం, వ్యక్తివాదం పెచ్చరిల్లడం కనబడుతోంది.




20వ శతాబ్దం చివరి వరకూ కూడా ప్రజల్లో ముఖ్యంగా గ్రామీణుల్లో సమిష్టి ఆలోచన, ఆచరణలు పుష్కలంగా ఉండేవి. ఊరి ప్రతిమనిషికీ మరో మనిషితో అనుబంధ సంబంధాలు తప్పనిసరిగా ఉంటుండేవి. అన్ని సందర్భాల్లో ఒకరి సహాయం, అండదండలు మరొకరికి అందుతుండేవి. జనం-కులాలుగా చీలి బ్రతుకు సాగిస్తున్నా, మెజారిటీ ప్రజల ప్రాథమిక శ్రమైక జీవనరీతి-వారిలో ఒక ఏకత్వాన్నీ, సామరస్యాన్నీ స్థిరపరచి ఉంచేది. ఊరికి ప్రకృతి సంబంధమయిన ఎలాంటి ప్రమాదాలు, ఈతిబాధలు ఎదురయినా గ్రామం మొత్తం ఏకమై ఎదుర్కొని, ఊరిని కాపాడుకునే వాళ్ళు.

పట్టణ వాసుల్లో ఇంతటి ఐక్యత కనబడకపోవటానికి ఆ ప్రజలంతా అదే మట్టికి చెందినవాళ్లు కాకపోవడం-కారణమయ్యుండవచ్చు.

భారత స్వాతంత్ర్యోద్యమ కాలంలో భారతీయుల్లోని సాంప్రదాయక ఐక్యభావన, అనుకంపన పదింతలుగా పెరిగి. అందరినీ ఏకత్రాటిపై నిలబెట్టి పరాయి ప్రభువుల్ని తరిమికొట్టేట్లు చేసింది. ముందు బానిసత్వం నుంచి విముక్తి కలగాలి, ఆ తరువాత దారిద్ర్యం నుంచి పూర్తిగా బయటబడగలం అని ఆశపడ్డారు జనం. చేతినిండా పనులు దొరికి బ్రతుకు దెరువులు బాగుంటాయి. కోకొల్లల ఉద్యోగాలు, పుష్కలంగా అన్నవస్త్రాలు, సుఖము, శాంతి అన్నీ లభించి, స్వేచ్ఛగా గొప్ప భరోసాతో బ్రతకగలమని సామాన్య ప్రజలందరూ ఆశించి విశ్వసించారు. అవన్నీ పేరాశలేనని ఈ 65 సంవత్సరాల ప్రజాస్వామ్య పాలన తెలియజెప్పింది. మన స్వదేశీ పాలకులు, ప్రజాప్రతినిధులన బడుతున్నవారు, తెల్లదోపిడీదారుల్ని అనేక రెట్లుగా మించగలమని చెప్పడానికి ఎంతమాత్రం వెనుకాడటంలేదు. ఈ ప్రజానేతల దృష్టిలో 'ప్రజాసేవ' ఒక పనికిరానిమాట. తమకు పదవులందించేవి డబ్బులు, ఉత్తుత్తి వాగ్దానాలు. ఓటర్లను కొనగలిగేది, మభ్యపరిచి గద్దెలనెక్కించేవి ఇవే. ఒక్కసారి గద్దె అందితేచాలు, వంచనకు మరింత మెరుగులు పెట్టి, తిరిగి తిరిగి గద్దెను కైవసం చేసుకుంటూ సాటి ప్రజల్ని లూటీ చేస్తుండవచ్చు.

ఈ కాలపు ప్రజాప్రతినిధులు, మంత్రులు-అలనాటి దేశభక్తుల, స్వాతంత్ర్య సమరయోధుల ధనమాన ప్రాణ త్యాగాలతో సాధించిన పాలనాధికారాన్ని అప్పనంగా అందుకుని తెల్లదొరలకు మించిన రీతిలో దేశాన్ని నిలువు దోపిడీ చేస్తున్నారు. అంతటితో సరా? తమతమ కుయుక్తుల, పలుకుబడుల దాదాగిరుల స్థాయినిబట్టి విదేశీ పెట్టుబడి వర్గాలతో చేతులు గలిపి, దేశ సహజ వనరుల్నీ సంపదనూ దోచుకుంటూ పంచుకుంటున్నారు. ప్రజలందరి శ్రమఫలితమైన పరిశ్రమల ప్రగతి ఫలాలు వారికందకుండా అడ్డుకుంటున్నారు.

పర్యవసానంగా సమాజమూ, మనుషుల విలువలు తీవ్రంగా పతనమవుతున్నాయి. సామాన్యుల ఆలోచనలు అస్తవ్యస్తమవుతున్నాయి. ఎంత అందితే అంత స్వంతం చేసుకుని అడ్డగోలుగా ఎదగాలని ప్రతి ఒక్కరూ తలపోస్తున్నారు. ప్రస్తుతం అవినీతే అసలైన నీతి. అన్యాయమే న్యాయం, అరాచకమే స్వేచ్ఛ! అణచివేతలు, హత్యలు తప్ప ప్రజలకు జీవించే హక్కులు శూన్యం!!

ఈ తల్లక్రిందుల విలువలకు ఆదరణా గౌరవం పెరుగుతుండటం ఒక విచిత్రమైన స్థితి!

అవినీతి కాలుష్యం మొత్తం ప్రజాజీవితాన్ని ఘోరంగా కాటేస్తున్నది. ప్రజలు సైతం ఇలాంటి నేతల రీతుల్ని అనుసరిస్తున్నారు. నేతల అవకాశవాద, స్వార్థపరధోరణుల్ని ఎవరి స్థాయికి తగినట్లుగా వారు అలవర్చుకుంటున్నారు.

**సమాజమూ, మనుషుల విలువలు తీవ్రంగా పతనమవుతున్నాయి. సామాన్యుల ఆలోచనలు అస్తవ్యస్తమవుతున్నాయి. ఎంత అందితే అంత స్వంతం చేసుకుని అడ్డగోలుగా ఎదగాలని ప్రతి ఒక్కరూ తలపోస్తున్నారు. ప్రస్తుతం అవినీతే అసలైన నీతి. అన్యాయమే న్యాయం, అరాచకమే స్వేచ్ఛ! అణచివేతలు, హత్యలు తప్ప ప్రజలకు జీవించే హక్కులు శూన్యం!!**

ఏలికలు ఏవేవి సంక్షేమ పథకాలంటూ స్వల్పరుణాల్నీ, అల్ప కానుకల్నీ విదిలిస్తుంటే ఆ మాత్రానికే ఉబ్బితబ్బిబ్బవుతున్నారు. ఆ నిధులున్నదంతా తమ సొమ్మేనని తెలుసు. అందులో సింహభాగం పాలక పెద్దలు మింగుతున్నారనీ తెలుసు. అయితేనేం రాజీపడక చేయగలిగిందేముంది! గద్దెనెక్కిన ప్రతీ ఒక్కడూ తింటాడు. ఇంత మాత్రమైనా ఎవరందిస్తున్నారు? ఇతడు కొంతలో కొంత సహాయపడుతున్నాడు జనానికి. పావలా వడ్డీ లోన్లు, ఆరోగ్యశ్రీ చికిత్సలు అందిస్తున్నాడు. మళ్ళీ ఇతన్నే ఓట్లేసి గెలిపించుకుందాం" అన్న అవకాశవాద అల్పయోచనకు మొగ్గుతున్నారు.

అర్థనీతి చాణక్యుణ్ణి తలదన్నిన ఆ మహానేత తన పుత్రరత్నానికీ అతని డజన్లకొద్దీ ఉత్తుత్తి కంపెనీలకు ఇవ్వడం పుచ్చుకోవటం పద్ధతిలో లక్షల కోట్ల డబ్బూ, వేల ఎకరాల భూమీ స్వంతంచేసి పోయాడు. ఆ అపురూప వారసుడు ప్రస్తుతం అసమాన ప్రజానేత! వివిధ పార్టీల వృత్తి రాజకీయులు బెల్లం చుట్టూ ఈగల్లా ఎగురుకుంటూ వచ్చి యువనేతకు హారతులు పడుతున్నారు. ఛత్రాజుల్ని మరిపిస్తున్నారు.

ఇటు పాలన నిర్వాహక గణాలు కూడా. తమ శక్తి మేరకు వారసత్వ నేతకు గొప్పగా తోడ్పడుతున్న మైనింగ్ దొంగలు, అక్రమ పారిశ్రామికులు ప్రజల భూముల్నీ సంపదల్నీ హాయిగా దోచుకోగలిగే రీతిగా 'జీవో'ల జారీలకు పాల్పడి కోట్లు గడించి సముజ్జీలైనా పాపం వాళ్ళ ఉద్యోగ నియమ నిబంధనలు, నేర పరిశోధనలు క్రియలు వాళ్ళను జైళ్ళపాలయ్యేట్టు చేశాయి.

మన ఆంధ్ర లూటీదార్లకంటే బాగా ముందుగానే, కేంద్రస్థాయిలో రకరకాల సీనియర్ 'స్కాంలు' ఈ దేశం యొక్క సహజ వనరుల్నీ అది సృష్టిస్తున్న వివిధ సంపదల్నీ బస్మాసుర హస్తాలతో మింగేందుకు పూనుకున్నాయి. 2జి స్పెక్ట్రం, సైనికుల ఆదర్శ ఆవాసం, కామన్‌వెల్త్ క్రీడలు, బడాకంపెనీలకు బొగ్గు కేటాయింపులు మొదలైనవాటికి తోడు ఇటీవలి హోరెత్తిస్తున్న సోనియాగాంధీ అల్లుడు రాబర్ట్‌వాద్రా రియల్ ఎస్టేట్ క్రయవిక్రయాలతో సంగ్రహించిన 300ల కోట్ల భూములు మొదలైన స్కాముల పరంపరలు యావత్తు దేశాన్ని అబ్బురపరచి, అవాక్కయ్యేట్టు చేస్తున్నాయి. ఐనా నవ్విపోదురుగాక నాకేటి సిగ్గు అన్నట్లు మహాప్రధాని మన్‌మోహన్ మళ్ళీ సరికొత్త ఆర్థిక సంస్కరణలను ప్రజలమీద రుద్దడానికి దీక్ష వహించారు. ఈ సంస్కరణల అమలువల్ల మనకు జరిగే గొప్ప మేలు అమెరికన్ యూరోపియన్ బహుళజాతి కంపెనీల యంత్రసంబంధ, వ్యవసాయ సంబంధ ఉత్పత్తులను మన మార్కెట్లనిండా నింపుకోవడం. విదేశీ కార్పొరేట్లు తమ ఉప్పు మిరపకాయల్ని సైతం ఇక్కడ మాల్సులో అమ్ముకోవడం! ఎఫ్‌డిఐ అన్న తంతుద్వారా ఇతర దేశ కంపెనీల సరుకులతో మనదేశం మొత్తం పెద్ద మార్కెట్టవుతూ దేశీయ ఉత్పత్తులకూ, కుటీర పరిశ్రమలకూ చోటు అన్నది ఉండకపోవడం తథ్యం. ఈ ప్రత్యక్ష పెట్టుబడులు మన వ్యాపార రంగాన్ని నిలువునా కూల్చి నాలుగు కోట్ల చిల్లర దుకాణదారుల కడుపుల్నీ, ఆ దుకాణాల నుంచి రొక్కంగానూ అప్పు సొప్పుగానూ కొనబడులు జరుపుకుని కడుపునింపుకునే బడుగు జీవుల బ్రతుకుల్నీ తీవ్రంగా దెబ్బగొడతాయి.

ఈ పచ్చి నిజాన్ని తొక్కిపెడుతూ ఈ ఎఫ్‌డిఐలు వేల ఉద్యోగాల్ని సృష్టించగలవనీ, రైతుల పంట దిగుబడులకు గ్యారంటీ మార్కెట్లు లభించగలవనీ బొంకడం! పెన్షన్లు, బీమా రంగాల్లో ఈ ఎఫ్‌డిఐలు అప్పుడే సగం శాతంగా చొరబడేందుకు ఒప్పందాలు జరిగిపోవడం ఎంత దుస్సాహసం! ఏ ప్రజలతో సంప్రదించి, ఏ పౌరుల అనుమతితో జరుగుతోంది ఇదంతా?

ఇప్పటికే ఈ విదేశీ కార్పొరేట్ శక్తులకు లాభం చేకూర్చే అనేక ప్రజాసంక్షోభం, విఘాత చర్యలకు ఈ ప్రజాస్వామ్య ప్రభుత్వం పూనుకోవడం బాగా తెలిసిన సంగతే. సముద్ర తీర పోర్టులు, కోస్టల్ కారిడార్లు, మూడు పంటలు పండే భూముల్లో అణువిద్యుత్ ప్రాజెక్టులు, సహజ వనరులు, లోహ సంపద కోసం అడవుల కుళ్ళగింపులు, నరికివేతలు ఇవన్నీ అక్కడి మట్టిబిడ్డల బ్రతుకుల్ని చిదిపివేసి పురుటి గడ్డనుంచి తరిమివేస్తున్న దుర్మార్గ అమానవీయ చర్యలు తప్ప అభివృద్ధి సంక్షేమ కార్యాలా? ఇవన్నీ ఈ దేశపు కార్పొరేట్ శక్తులు, విదేశీ కార్పొరేట్ శక్తులు జాయింటుగా ఈ దేశాన్ని దోచుకునే పథకాలు.

ఈ కుట్రపూర్వక, పచ్చి స్వార్థపూర్వక పథకాలతో, చర్యలతో ఈ దేశంలోని జీవ వైవిధ్యాన్ని నశింపచేస్తున్నది. ముమ్మాటికి పాలకులు తప్ప ప్రజలుగాదు. విదేశీ సంస్థల వ్యాపార లాభాల కోసం బి.టి విత్తనాల పంటలకూ, వాళ్ళ రసాయనానికి ఎరువులు, పురుగుమందుల భారీ వినియోగాలకూ, వాళ్ళు రూపొందించిన జన్యుమార్పిడి వ్యాపార పంటలకూ తలొగ్గి అమలు చేయడమేనా జీవవైవిధ్య పరిరక్షణ?

ఈ నేపథ్యంలో తగుదనమ్మా అని మనదేశంలో ప్రపంచస్థాయి జీవవైవిధ్య పరిరక్షణ సమావేశాలు బ్రహ్మాండంగా జరిపించడాన్ని ఏమనాలి?

మనది ప్రజాస్వామ్యమా? కార్పొరేట్ రాజరికమా?

•

**సముద్ర తీర పోర్టులు, కోస్టల్ కారిడార్లు, మూడు పంటలు పండే భూముల్లో అణువిద్యుత్ ప్రాజెక్టులు, సహజ వనరులు, లోహ సంపద కోసం అడవుల కుళ్ళగింపులు, నరికివేతలు ఇవన్నీ అక్కడి మట్టిబిడ్డల బ్రతుకుల్ని చిదిపివేసి పురుటి గడ్డనుంచి తరిమివేస్తున్న దుర్మార్గ అమానవీయ చర్యలు తప్ప అభివృద్ధి సంక్షేమ కార్యాలా?**

చట్టాలు

# సతీ సహగమన నిరోధకచట్టం 1829

– ఆర్. దుర్గా ప్రసన్న (అడ్వకేట్)

భర్త మరణించిన తరువాత ఆ భర్త యొక్క చితిలో సజీవంగా తమంతట తామే అగ్నిలో శరీరాన్ని దగ్ధం చేసుకోవడాన్ని 'సతీ సహగమనం' లేదా 'సతి' అని వ్యవహరిస్తారు. ఉత్తర భారత దేశంలోని అగ్ర కులాలైన బ్రాహ్మణ, క్షత్రియ కులాల్లో ఇది అతి సాధారణ ఆచారంగా ఒకప్పుడు ఉండేది. ఒక భర్తకు ఒకరికంటే ఎక్కువమంది భార్యలు కలిగి వుండడం అప్పట్లో సాధారణ అంశంగా ఉండేది. అటువంటి సందర్భాల్లోనూ ఆ భర్త మరణించినపుడు అతని భార్యలు అందరూ కూడా ఈ సతీ సహగమనానికి పాల్పడేవారు. స్త్రీల పాలిట అతి దుర్మార్గమూ, కిరాతకమూ అయిన ఈ దురాచారాన్ని స్త్రీలు కూడా అలా అగ్నికి ఆహుతి కావడం చాలా గౌరవప్రదమైన చర్యగా భావించేవారు. మరణించిన తరువాత కూడా తమ భర్తలతోనే కలసి ఉండాలనీ, వేరే లోకాలలో కూడా తాము తమ భర్తలకు పరిచర్యలు చేసే భాగ్యము కలుగుతుందని వారి నమ్మకం. ఒక మతపరమైన విశ్వాసం కూడా.

'సతి' ఆచారాన్ని పాటించడానికి స్త్రీలు తమంతట తామే పాటించాలని నిర్ణయించుకున్నప్పటికీ దానిని సమర్థించే ఇతర బంధువులు అందుకు తగిన ఏర్పాట్లు చేస్తారు. అంటే చితి పేర్చడానికి అవసరమైన కార్యక్రమం అంతా ఒక పవిత్రమైన తంతుగా, నియమ నిష్టలతో నిర్వహిస్తారన్నమాట. అయితే భర్త మరణించిన నాటికి గర్భవతులుగా ఉన్న వారూ, బహిష్టులో ఉన్న వారు, అమాయకులు(అంటే తంతు గూర్చిన ఏ విధమైన అవగాహనా లేనివారు) అయిన స్త్రీలు 'సతీ సహగమనాన్ని' పాటించరాదు. ఒక విధంగా అటువంటి కార్యానికి వీరు అనర్హులుగా భావిస్తారు. అంతేకాదు సహగమనానికి సిద్ధపడిన స్త్రీల రోదన ఒక స్థాయిని మించి ఉన్నపుడు కూడా వారు సహగమనానికి సిద్ధంగా లేరని భావించి వారి యొక్క సహగమన ఏర్పాట్లను నిలిపివేస్తారు.

> **1829సం॥ డిశంబరు 4వ తేదీన జనరల్ విలియం బెంటింక్ సతీ సహగమానాన్ని నిరోధిస్తూ ఒక బిల్లుని మొట్టమొదటిసారిగా అమలు పరిచారు.**

భర్త మరణానంతరం సహగమనం చేసే ఆనాటి స్త్రీల సాంఘిక, సామాజిక స్థితిగతులనూ పరిగణనలోనికి తీసుకోకతప్పదు. అప్పటి పరిస్థితులలో భర్త అకాల మరణం తరువాత వారికి ఇక జీవితం లేదు అని అనుకోవడం, కుటుంబ సభ్యులనుండీ ఆదరణ ఉండదు. అనే నిర్వికార స్థితి, మరణానంతరం కూడా భర్తను అనుసరించడమే తమ యొక్క కర్తవ్యంగా భావించడం. ఆర్థిక, మత, రాజకీయ కోణాల్లోనే కాక భర్త మరణానంతరం స్త్రీల మాన ప్రాణాలకు రక్షణ లేకపోవడం అతి ముఖ్యమైన కారణంగా ఉండేది. వీరు ఆత్మాభిమానం చంపుకోలేక ఈ విధమైన ప్రాయోపవేశాలకు/ అగ్నికి ఆహుతి కావడానికి సిద్ధపడేవారు అనడంలో ఏమాత్రం సందేహం లేదు. ఉదా:- రాజపుత్ర స్త్రీలు విదేశీ దండయాత్రలలోనూ, యుద్ధంలోనూ తన భర్తలు మరణించినపుడు అంత:పుర స్త్రీలంతా ఈవిధంగా ఆత్మాహుతి చేసుకోవడం మనకు తెలిసిందే.

బెంగాల్‌కు చెందిన రాజారామ్మోహనరాయ్ అతి కిరాతకమైన మూఢ నమ్మకంతో కూడిన ఈ సతీ సహగమనమనే దురాచారాన్ని తీవ్రంగా ఖండించారు. ఈ దురాచారాన్ని రూపు మాపేందుకు అవిరళకృషి చేశాడు. 1818సం॥లోనే ఈ దురాచారాన్ని వ్యతిరేకిస్తూ 'కరపత్రాల్ని' ప్రచురించి పంపిణీ చేశాడు. ఈ విధంగా హిందూ మతం అర్ధాంతరంగా జీవితాన్ని ముగించడాన్ని ఎక్కడా (వేదాల్లో) ప్రోత్సహించలేదని సోదాహరణంగా వివరించాడు. భర్త మరణానంతరం స్త్రీలు వారి పుట్టినింట్లో గానీ, మెట్టినింట్లోగానీ జీవించే హక్కుని కల్గి



ఉన్నారని వివరించాడు. అంతే కాదు ఈ పరిస్థితి మారాలంటే స్త్రీలకు ఆర్థిక పుష్టి అవసరమని అందుకు ఆస్థి హక్కు ఆవశ్యకతనీ ఆనాడు చర్చించాడు.(తదుపరి కాలంలో వితంతువులకు ఆస్థి హక్కు చట్టబద్ధమైంది) చివరకు 1829సం॥ డిశంబరు 4వ తేదీన జనరల్ విలియం బెంటింక్ సతీ సహగమానాన్ని నిరోధిస్తూ ఒక బిల్లుని మొట్టమొదటిసారిగా అమలు పరిచారు. కానీ మత సాంప్రదాయ వాదులైన కొన్ని కుటుంబాలను మాత్రం ఈ బిల్లు నుండీ అప్పట్లో మినహాయించక తప్పలేదు. ఏమైనప్పటికీ సతీ సహగమనం పేరిట జరిగే స్త్రీల ఆత్మాహుతికి అడ్డుకట్టవడింది. వందలాది స్త్రీలను సతీ సహగమన దురాచారాన్నుండీ రక్షించగలిగారు. అంతేకాదు స్త్రీ ఆస్థి హక్కుల ఆవశ్యకతనీ ఈ అంశం స్పష్టం చేసింది. సామాజిక అవగాహనను పెంచిన ఈ బిల్లు సుమారు 150-160 సం॥ల తరువాత 1988సం॥ మార్చి2వ తేదీ నుండీ పూర్తి స్థాయిలో భారత ప్రభుత్వం 'సతీ సహగమనాన్ని నిషేధిస్తూ జమ్మూ కాశ్మీర్‌లు మినహా మిగిలిన

భారతదేశమంతటా "సతీ సహగమన నిరోధక చట్టం 1987గా ఆమలులోకి వచ్చింది. అంటే ఇప్పుడు భారతదేశంలో ఎవరైనా సతీ సహగమనం చేసినా సహగమనాన్ని ప్రోత్సహించినా అది నేరం, శిక్షార్హం.

ద కమిషన్ ఆఫ్ సతి (ప్రివెన్షన్) ప్రకారం సతీ సహగమనం దేశంలో ఎక్కడా ఏవిధంగానూ పాటించకుండా పటిష్టంగా 'సతి'ని నిరోధించడానికి అవసరమైన సవరణలతో ఉంది అని చెప్పవచ్చును.

సెక్షన్2 ప్రకారం ఏ వితంతువులయినా ఆమె మరణించిన భర్తతోగానీ, భర్త యొక్క వస్తువులతో గానీ, ఆమె తన ఇష్టపూర్వకంగా గానీ, బంధువులు లేదా ఇతరుల ప్రోద్బలంతోగానీ చితి (మంటల ఏర్పాటు)లో మరణిస్తే అది ఆ మరణించిన స్త్రీ, దానిని ప్రోత్సహించిన వారు కూడా శిక్షార్హులు అవుతారు. వితంతువు మరణించడాన్ని 'సతి'గా పరిగణిస్తారు.

సెక్షన్ 3 లో సతి పాటించిన వారికి చట్టం శిక్షలను కూడా వివరించింది.. ఇండియన్ పీనల్‌కోడ్ 1860 ప్రకారం సంవత్సర కాలం వరకూ జైలు శిక్ష మరియు జరిమానా లేదా రెండు కూడా న్యాయ స్థానం విధిస్తుంది. అన్ని క్రిమినల్ కేసుల్లానే న్యాయ స్థానం న్యాయ విచారణను చేపడుతుంది. అయినప్పటికీ సతిని నిరోధించడంలో జిల్లా కలెక్టరుకు, జిల్లా జడ్జిలు తక్షణం స్పందించి తగు చర్యలు చేపట్టే అధికారం కలిగి ఉంటారు.

ఏమైనప్పటికీ వితంతువులుగానీ, స్త్రీలుగానీ తమంతట తాము జీవించగలమనే విశ్వాసాన్ని కలిగి వుండాల్సిన అవసరం ఉంది. ఆర్థిక సామాజిక పరిపుష్టి స్త్రీలలో కలిగినప్పుడు విద్యావకాశాలలో స్త్రీ పురుషులు వివక్షత లేకుండా సమాన అవకాశాలు, అవగాహనతో ముందుకి సాగినపుడు ఇటువంటి దురాచారాలు పూర్తిగా సమసిపోతాయి అని గ్రహించకతప్పదు. చట్టం ద్వారా 'సతీ సహగమనం' నిషేధించినప్పటికీ చైతన్యంతో సమాజమే దీనిని బహిష్కరించే రోజు కోసం ఎదురు చూద్దాం.

# పాండు పగటి కల

– చూటీ

చిన్నమ్మకు ఒక్కగానొక్క కొడుకు పాండు. వాడు ఒట్టి సోమరిపోతు. పనే చేయడు. పగటి కలలు కనడంలోనే వాడికి సరిపోతుంది. పాండు పుట్టిన కొద్ది రోజులకే అతగాడి తండ్రి పాము కరిచి చనిపోయాడు. దాంతో పాండు పోషణ అంతా తల్లే చూసుకునేది. వెనకా ముందూ ఆస్తిపాస్తులేం లేవు కనుక రెక్కలే ఆధారం. ఉండేకొద్దీ వయస్సు పైబడుతుందే కానీ తరగదుగా. చిన్నమ్మ పరిస్థితి అంతే. తన ఒంట్లో శక్తి సన్నగిల్లుతున్నా...కొడుకులో ఏమార్పులేదు. తనుతెచ్చి పెడితే తిని తిరగటం తప్ప మరో ఆలోచన లేదు. ఏదైనా పని వెత్తుక్కోమని ఎన్నోసార్లు చెప్పినా పాండు వినిపించుకోలేదు. ఇలా అయితే లాభం లేదనుకుని ఓసారి ఊరి పెద్ద దగ్గరకు పాండును తీసుకెళ్ళి చెప్పిస్తుంది.

"ఒరే పాండూ! మీ అమ్మకా వయసైపోయింది. నువ్వా ఖాళీగా తిని తిరుగుతున్నావు. ఇలా అయితే నిన్ను మాత్రం ఎంతకాలం మేపుతుందిరా. సరే కన్న నేరానికి ఎలాగోలా చచ్చేదాకా తిండిపెడుతుంది. ఆ తర్వాత నీ గతేమిటిరా? పైగా ఎల్లకాలం ఇలా ఒంటికొమ్ము సొంటిలాగా ఉండిపోతావా? పెళ్ళి చేసుకోవూ....! ఏదైనా పనిచేసి నాలుగు డబ్బులు సంపాదిస్తేనే కదరా నీకు ఎవరైనా పిల్లనిస్తారు. శుభ్రంగా పనిలో చేరు. పెళ్ళి చేసుకుని పిల్లా పాపలతో సుఖపడు. మీ అమ్మను సంతోషపెట్టు..." అని చెప్తాడు ఊరిపెద్ద.

దానికి పాండు సంతోషంగా తల ఊపుతాడు. అలాగే చేస్తానని నమ్మకంగా మాటిస్తాడు. ఆ క్షణం నుంచి పని వేటలో పడతాడు. ఓసారి అలా వీధిలో నడుస్తుండగా ఓ వ్యక్తి కనిపిస్తాడు. అతని నెత్తిమీద కోడిగుడ్ల బుట్ట ఉంటుంది. ఎంత దూరం నుంచి మోసుకొస్తున్నాడో ఏమో చెమటలు కారిపోతున్నాయి అతగాడికి. పాండును చూడగానే అతని మోము సంతోషంతో విరుస్తుంది.

"నీకు పుణ్యముంటుందిగానీ....ఏమోయ్! నాకు ఓ పని చేసిపెడతావా?" అనడుగుతాడు.

"ఓస్....పనేకదా. నేనూ దాని కోసమే వెతుకుతున్నాను. చెప్పండి" అంటా పాండు సంతోషంగా.

"మరేం లేదు. నేను చాలా దూరం నుంచి గుడ్ల బుట్ట మోసీ మోసీ అలసిపోయాను. మా ఇంటిదాకా ఈ బుట్ట తెచ్చిపెడితే నీకు రెండు గుడ్లు ఇస్తాను" అన్నాడు.

పాండు సంతోషంగా ఆ బుట్ట తీసుకుని నెత్తిమీద పెట్టుకుని అతగాడి ఇంటి దారి పడతాడు. అయితే మనవాడికి పగటి కలలు కనే అలవాటు బాగా ఉంది కదా. వెంటనే ఊహల్లోకి వెళ్లిపోయాడు.

"ఆహా నాకు ఇతను రెండు కోడిగుడ్లిస్తాడు. అవి పిల్లలవుతాయి. అవి కోళ్ళవుతాయి. అవి రోజూ గుడ్లు పెడతాయి. అవి మళ్ళీ పిల్లలై.... పెద్దవుతాయి. మళ్లీ గుడ్లు పెడతాయి. మళ్ళీ పిల్లలై....కోళ్ళవుతాయి. మళ్ళీ గుడ్లు పెడతాయి. నాకు బోలెడంత డబ్బు వస్తుంది. వాటితో మంచి ఇల్లు కొంటాను. ప్రపంచంలోకెల్లా అందమైన అమ్మాయిని భార్యగా చేసుకుంటాను. ఇంటినిండా పనివాళ్ళుంటారు. నా తల్లి, భార్య మహారాణుల్లా కాలుమీద కాలు వేసుకుని కూర్చుంటే పనివాళ్ళే అంతా చేసేస్తుంటారు. నేను మిద్దె మీదకెళ్ళి రంగు రంగుల అందమైన గాలిపటం ఎగరేస్తాను. అది చూడ్డానికి ఊరి జనమంతా తండోపతండాలుగా వస్తారు....నేను గాలిపటాన్ని ఇలా ఎగరేస్తాను...." అనుకుంటూ చేతులు గాల్లోకి పైకెత్తుతాడు. అంతే...

కోడిగుడ్ల బుట్ట కిందపడిపోతుంది. గుడ్లన్నీ పగిలిపోయి చెల్లాచెదరై పెంకులౌతాయి. అంతే...ఆ వ్యక్తికి విపరీతమైన కోపం వచ్చి...

"ఏమయ్యా....నాకు వెయ్యి రూపాయల నష్టం తెచ్చిపెట్టావే...." అని తిట్టి... ఏడవసాగాడు.

"ఏమయ్యోయ్! నీకు వెయ్యి రూపాయలే నష్టం. నాకు ఎంత నష్టమొచ్చిందో చెప్పలేను తెల్సా..." అని మొత్తం లెక్కగట్టడంలో లీనమైపోతాడు.

ఇదంతా చూస్తున్న గ్రామస్తులు బుట్ట యజమానిని చూసి నవ్వుతూ....'నీకు పని చెప్పటానికి ఈ పగటి కలల పాండుగాడే దొరికాడా" అంటారు వ్యంగ్యంగా.

★

చిత్ర సమీక్ష:

కుటుంబ విలువల ప్రాముఖ్యతను చాటి చెప్పే

# ఇంగ్లీష్-వింగ్లీష్




- కె. నాగలక్ష్మి

దాదాపు 15 సంవత్సరాల క్రితం 'జుదాయి'తో సినీజీవితం నుండి కనుమరుగైన శ్రీదేవి తిరిగి "ఇంగ్లిష్-వింగ్లిష్" సినిమాతో పునరాగమనం చేయడం ప్రేక్షకులకు అరుదైన ఆనందాన్ని పంచిందనే చెప్పవచ్చు. నూతన డైరెక్టర్ గౌరీషిండే దర్శకత్వంలో శ్రీదేవి నటించిన ఇంగ్లిష్-వింగ్లిష్ చిత్రం మధ్యతరగతి కుటుంబాలలోని గృహిణులు అనునిత్యం ఎదుర్కొంటున్న అనేక సున్నితాంశాలను సృజించింది. సాధారణ మధ్యతరగతి కుటుంబాల గృహిణులలో కుటుంబ బాధ్యతలతో అణగారిపోతున్న ఉత్సాహం, ఉత్తేజం, చులకన భావాలతోపాటు మరెన్నో అంశాలను ఈ చిత్రం ఎంతో సునిశితంగా ఎత్తి చూపింది.

**కథాంశం :** శ్రీదేవి (శశి) మహారాష్ట్ర లోని ఒక సాధారణ మధ్యతరగతి గృహిణి. పాకశాస్త్రంలో మంచి ప్రావీణ్యురాలు. ముఖ్యంగా లడ్డూలు తయారు చేయడంలో ఆమెకు ఆమేసాటి. భర్త సతీష్ (ఆదిల్ హుస్సేన్) ఆమెను లడ్డూలు తయారుచేయడం కోసమే పుట్టిందని ఆటపట్టిస్తుంటాడు. ఆమెకు ఇంగ్లీష్ సరిగా రాదని ఇంట్లో ఇంగ్లీష్ పదం ఏది మాట్లాడినా భర్త, పిల్లలు కలిసి ఎగతాళి చేస్తుంటారు. ఒకరోజు శశి కూతురుతో కలిసి స్కూల్‌లో పేరెంట్స్ మీటింగ్‌కు వెళ్ళాల్సి వస్తుంది. అక్కడ ఇంగ్లీష్ టీచర్‌తో హిందీలో మాట్లాడిందని కూతురు విమర్శించడంతో శశి చాలా బాధపడుతుంది. ఆమె వంటకూ, లడ్డూల తయారీకి తప్ప దేనికీ పనికిరాదనే వాతావరణం ఇంట్లో ఉంటుంది. కుటుంబం కోసం ఎంత కష్టపడినా ఎవరినీ సంతోష పెట్ట లేకపోతున్నాననీ ఇంట్లో తనకు తగిన విలువా, గౌరవం లేవని శశి నిరాశ పడుతూంటుంది.

ఇంతలో అమెరికాలో ఉన్న శశి అక్క కూతురు (మీరా) వివాహం నిశ్చయ మవుతుంది. అక్కకు పెళ్ళి పనుల్లో సాయం చేయడం కోసం శశి ముందుగా న్యూయార్క్ వెళ్ళవలసి వస్తుంది ఒంటరిగా. వచ్చీరాని ఇంగ్లీష్‌తో తంటాలు పడి ఎలాగోలా న్యూయార్క్ చేరుతుంది. అక్కడ నాలుగు వారాలలో ఇంగ్లీష్ నేర్పించే స్కూల్ ఉందని తెలిసి చాలా చాకచక్యంతో కుటుంబ సభ్యులకు తెలియకుండా ఇంగ్లీష్ స్కూల్‌లో చేరుతుంది. ఇంగ్లీష్ క్లాసుకు వెళుతూ కొత్త స్నేహితుల పరిచయంతోపాటు ఉత్సాహకర వాతావరణంలో అనేక విషయాలు తెలుసు కుంటుంది. ఇంట్లో లడ్డూలు చేసి అమ్మే తనకు కూడా సమాజంలో "ఎంట్రప్రెన్యూర్" అనే ఒకపేరు, గుర్తింపు ఉన్నాయని తెలుసుకుని సంబరపడిపోతుంది. నాలుగు వారాలలో పట్టుదలతో ఇంగ్లీష్ నేర్చుకుంటుంది. ఇంతలో భర్త సతీష్, పిల్లలు అమెరికా చేరుకుంటారు.

వివాహం ముగిసిన తరువాత ఒక్కొక్కరు నూతన దంపతులను ఉద్దేశించి మాట్లాడుతుండగా శశి ఇంగ్లీషులో మాట్లా డటం చూసి సతీష్ ఆశ్చర్యపోతాడు. వివాహం తరువాత భార్యాభర్తలు మనస్పర్ధలు లేకుండా కుటుంబ జీవితం ఎలా గడపాలో ఇంగ్లీష్‌లో అతి చక్కగా వివరించి శశి అతిధులందరి మన్ననలు పొందుతుంది. మహిళలకు అవకాశాలు కల్పించకపోయినా అవకాశాలను సృష్టించుకుని పట్టుదలతో ఏదైనా సాధించగలరనే అంశాన్ని దర్శకులు గౌరీషిండే ఈ సినిమా ద్వారా చెప్పగలిగారు. చిత్రంలోని సన్నివేశాలు అతి సహజంగా ఉండ డంతోపాటు ఆలోచన రేకెత్తించే సంభాషణ లు సినిమాకు ప్రత్యేక ఆకర్షణగా నిలిచాయి.

ఇంగ్లీష్ విషయంలో భర్త, కూతురు ఎగతాళి చేస్తున్న సందర్భంలో సృష్టిలో అన్నీ నేర్పించవచ్చు..... కానీ ఎదుటి మనిషి భావాలను గౌరవించాలనే విషయాన్ని ఎలా నేర్పించాలని శశి ఆవేదన వ్యక్తం చేస్తుంది. పురుషులు వంట చేయడాన్ని కళగా భావించే సమాజం స్త్రీలు వంట చేయడాన్ని మాత్రం బాధ్యతగా భావించడాన్ని ఎత్తిచూపుతుంది. తనకు ప్రేమ కావలసినంత ఉందని, కుటుంబంలో గౌరవం కోరుకుంటున్నాననీ చెప్పడం, నిన్ను నీవు ఇష్టపడటం నేర్చుకుంటే ఏ పరిస్థితులలోనైనా ఆత్మస్థైర్యం కోల్పోకుండా ఉండగలవని స్నేహితునికి చెప్పడం, ఇంగ్లీష్ రాని మీరు అమెరికాలో ఎలా మేనేజ్ చేస్తారని వీసా ఆఫీసులో అధికారి అడిగితే ఇండియాలో మీరు ఎలా మేనేజ్ చేస్తున్నారని తోటి ఆఫీసర్ అనడం, అమెరికాకు వెళుతున్న కారణాన్ని మీ ఆర్థిక వ్యవస్థకు తోడ్పడ్డం కోసమేనని అమితాబ్ చెప్పడం లాంటి మంచి సంభాషణలు చాలా బావున్నాయి.

కుటుంబ విలువల గురించి చివరిలో శశి నూతన దంపతులనుద్దేశించి చేసిన సంభాషణ సినిమాకు పరిపూర్ణత చేకూర్చింది.

ఈ విశాల ప్రపంచంలో కుటుంబ మనే చిన్న ప్రపంచాన్ని సృష్టించుకుని ఆనందంగా గడపాలనీ, కుటుంబ సభ్యులు తోటివారి భావాలను గౌరవించాలనీ, కుటుంబంలోనే వ్యక్తికి సరైన సహాయ సహకారాలు అందుతాయనీ, తమ లోపాలను సరిచేసుకునే అవకాశం దొరుకుతుందనీ, భార్యాభర్తలు సమాన హోదాతో ఒకరినొకరు తక్కువ చేసుకోకుండా మెలగాలనీ, పరస్పర గౌరవం కలిగి ఉండాలనీ చెబుతుంది. తాను నేర్చుకున్న జడ్జిమెంటల్ అనే పదాన్ని ఉపయోగించి భార్యాభర్తలు తొందరపడి నిర్ణయాలు తీసుకోరాదనీ, ఆలోచించి సరైన నిర్ణయాలు తీసుకోవాలనీ చెబుతుంది.

కుటుంబంలో పరస్పర గౌరవం తగ్గిపోతున్న నేటి కాలంలో పై సంభాషణల ద్వారా దర్శకులు కుటుంబ విలువలు ఎలా ఉండాలో చెప్పే ప్రయత్నం చేశారు. ఫ్రెంచ్ నటుడు, మోహదీ నెబ్బేవ్, ప్రియాఆనంద్ పాత్రలతోపాటు ప్రతీ పాత్రా ప్రేక్షకులకు గుర్తిండిపోయేలా మలచడంలో గౌరీషిండే ప్రతిభ కనిపిస్తుంది. చాలా రోజుల తరువాత ఓ మంచి చిత్రం చూసిన అనుభూతిని ఈ చిత్రం కలిగిస్తుంది. పరుగుల జీవితంలో ఇంటి ఇల్లాలిని నిర్లక్ష్యం చేసే ప్రతీ భర్తా ఆలోచించేలా, తల్లిని చులకన చేసే ప్రతీ ఇంట్లోని పిల్లలూ పాఠాలు నేర్చుకునేలా ఈ చిత్రాన్ని అద్భుతంగా మలిచారు.

తొలిచిత్రంతోనే విజయం సాధించిన గౌరీషిండే మరిన్ని మంచి కథా చిత్రాలతో ముందుకు సాగాలని కోరుకుందాం. ●




# డాక్టర్ సలహాలు

- డాక్టర్ రమాదేవి.

**ప్ర: మెనోపాజ్ దశలో తప్పనిసరిగా కాల్షియమ్ సప్లిమెంట్స్ తీసుకోవాలని చాలా మంది సలహాలు ఇస్తున్నారు. ఇది తప్పనిసరా? తినే ఆహారం ద్వారా కాల్షియం అందేట్టు జాగ్రత్తలు తీసుకుంటే సరిపోదా?**

**జ:** మెనోపాజ్ దశలో ఈస్ట్రోజన్ లెవెల్ తగ్గిపోతుంది. దానితో ఎముకలు పెళుసుబారటం మొదలవుతుంది. ఈ దశలో రోజుకు 1500 మి.గ్రా కాల్షియం అవసరం. ఇంత కాల్షియం ప్రతిరోజూ తీసుకోవటం వలన ఎముకలు బలహీన పడకుండా జాగ్రత్తపడవచ్చు. కాల్షియం టాబ్లెట్ల రూపంలో తీసుకోవాలా? లేదా ఆహారంలో తీసుకుంటే సరిపోతుందా అనేది వారి వారి ఆహార అలవాట్లను బట్టి ఉంటుంది. చెప్పాలంటే టాబ్లెట్ల ద్వారా తీసుకునే కాల్షియం కన్నా ఆహారం ద్వారా తీసుకునే కాల్షియం ఎక్కువగా వంటబడుతుంది. అయితే మీరు ఎంత కాల్షియం తీసుకుంటున్నారనేది ఎవరికి వారు లెక్కవేసుకోవాలి. కాల్షియంతోపాటు విటమిన్ 'డి' 400ఐయు మరియు మెగ్నీషియం 375 మి.గ్రా అవసరం. ఇవి లేకుండా కేవలం కాల్షియం ఒక్కడే వేసుకుంటే పనిచేయదు లేదా శరీరానికి ఒంటబట్టదు. విటమిన్ డి3 అనేది సూర్యరశ్మి ద్వారా లభిస్తుంది. శరీరానికి సూర్యరశ్మి తాకనివారు, బయటికి వెళ్ళనివారు విటమిన్ డి3 కూడా తీసుకోవాలి. కాల్షియం పాలు, పెరుగు, చీజ్, మజ్జిగ, పన్నీర్, చేపలు, కోడిగుడ్లు, సీతాఫలం, ఆకుకూరలు లాంటివాటిలో ఎక్కువగా ఉంటుంది.

**తీసుకోవాల్సిన పదార్థాలు కాల్షియం మి.గ్రా.ల్లో**

| | | |
|---|---|---|
| గుడ్డు | - | 30 |
| బిస్కెట్లు | - | 30 |
| కేకు | - | 50 |
| చేపలు | - | 50 |
| ఆరెంజ్ | - | 75 |
| ఆకుకూరలు | - | 45 |
| పాలతో చేసిన కాఫీ,టీ ఒక కప్పు | - | 45 |
| పాలు ఒక కప్పు | - | 250 |
| ఒక కప్పు మజ్జిగ, ఐస్‌క్రీమ్ | - | 100 |
| బ్రెడ్ స్లైసులు | - | 30 |
| చాక్‌లెట్ బార్ | - | 110 |

ఒకరోజంతా మీరు ఎంత కాల్షియం ఆహారం తీసుకుంటున్నారో లెక్కించండి. 1500 మి.గ్రాలలో మిగిలినది టాబ్లెట్ల రూపంలో తీసుకోండి. ఒక టాబ్లెట్‌లో 500 మి.గ్రా కాల్షియం ఉంటుంది. పూర్తిగా ఆహారంలో తీసుకుంటే టాబ్లెట్లు లేదా సప్లిమెంట్ల రూపంలో అవసరం లేదు.

**ప్ర: కాల్షియం టాబ్లెట్లు రోజూ వేసుకోవటం వలన శరీరంలో ఆ నిల్వలు పేరుకుపోయి ఏదో ఒక పార్ట్‌లో ఉండిపోతుందని విన్నాను. అలా పేరుకుపోయే అవకాశముందా? అలా కాకుండా ఉండాలంటే ఏం చేయాలి?**

**జ:** కాల్షియం టాబ్లెట్లు వేసుకోవడం గురించి రకరకాల భావనలు ఉన్నాయి. ఎవరికీ పూర్తి ఏకాభిప్రాయం లేదు. అయితే శరీరంలో ఒక పార్టులో పేరుకుపోతాయనే దానిలో వాస్తవం లేదు. పరిశోధనలలో 15 సంవత్సరాల పాటు 3000 మి.గ్రా కాల్షియం తీసుకున్నవారిలో 17 శాతం కిడ్నీలో రాళ్ళు ఏర్పడ్డం గమనించారు. అంతేకాని తగిన మోతాదులో కాల్షియం తీసుకోవటం వలన నష్టం లేదు. ఆహారంలో తగినంత కాల్షియం తీసుకుంటే మరీ మంచిది.

**ప్ర: రొమ్ము క్యాన్సర్‌ను ప్రాథమిక దశలో గుర్తించడమెలా?**

**జ:** 1. రొమ్ములో గడ్డలాంటిది ఉందేమో చూడాలి. 2. చనుమొనల నుంచి ఏదైనా స్రావంలాంటిది వస్తే. 3. రొమ్ము సైజులో మార్పు రావటం. 4. చంకలలో గడ్డలాంటిది రావటం. 5. చను మొనలు లోపలికి ముడుచుకుపోవడం. 6. రొమ్ములో నొప్పి, దురద, మంటలాంటివి ఉండటం. పైన సూచించిన లక్షణాలు ఉన్నంత మాత్రాన క్యాన్సర్ ఉన్నట్టు కాదు. కానీ ఇటువంటి లక్షణాలు కనిపిస్తే మాత్రం వెంటనే డాక్టరుని సంప్రదించి పరీక్షలు చేయించుకోవడం చాలా మంచిది.

**ప్ర: నా వయస్సు 45 నాకు బి.పి లేదు. కాని ఏదైనా విషయంలో కోపం వస్తే కంట్రోల్ చేసుకోలేక అరిచేస్తున్నాను. థైరాయిడ్ ఉంది. అది కారణమై ఉంటుందా? వివరించగలరు?**

**జ:** మీ వయస్సు 45 అంటే మెనోపాజ్‌కు దగ్గరలో ఉన్నారు. ఈ వయసులో జరిగే హార్మోన్ల తేడా వలన ఇలా జరగవచ్చు. ఈ పరిస్థితి ఒక్కొక్కరికీ ఒక్కోరకంగా ఉండొచ్చు. కొంతమందికి డిప్రెషన్, మరికొంతమందిలో కోపం... ఇలా థైరాయిడ్ కూడా కారణం కావచ్చు. దీన్ని గుర్తించి కొంత జీవన శైలిని మార్చుకోవాలి.



# స్పందన

"చైతన్య మానవి" ఎడిటర్ జ్యోతి గారికి నమస్కారములు! "చైతన్య మానవి" దశాబ్ది ప్రత్యేక సంచిక అనేక విశేష వ్యాసాలతో విజ్ఞానదాయకమైన సమాచారంతో స్ఫూర్తిదాయకమైన కథలూ, జీవితానుభవాలతో ప్రచురించినందుకు మీకూ, మీ సంపాదకవర్గానికి హృదయపూర్వక అభినందనలు! మీ కృషి మరింతగా సత్ఫలితాలనివ్వాలని కోరుకుంటూ శుభాకాంక్షలతో...............

**- అబ్బూరి ఛాయాదేవి (ప్రముఖ రచయిత్రి)**

"చైతన్య మానవి" ఎడిటర్‌గారికి నమస్కారములు. "చైతన్య మానవి" దశాబ్ది ప్రత్యేక సంచికలో వచ్చిన నేటి భారతం రచయిత్రి అమ్మాజీగారికి ముందుగా నా ధన్యవాదాలు. నేటి సమాజంలో జరుగుతున్న అన్యాయాన్ని కళ్ళకు కట్టినట్లుగా ఉంది. కన్న తండ్రి కూతుర్ని డబ్బుకోసం బలిదానం చేసాడు. ఇటువంటి పురుష అహంకారులు ఉన్నంతకాలం స్త్రీలు బలికాక తప్పదు. దుర్గాభాయ్ దేశ్‌ముఖ్ పిల్లల పాఠ్యపుస్తకాల్లో ఉంది. దేశభక్తురాలి గురించి ప్రచురించారు. మహోన్నత మహిళగా ఆమె సేవలకు అవార్డులు రావటం మన ఆంధ్రులు గర్వించదగిన విషయం. కెప్టెన్ లక్ష్మీసెహగల్ లాంటి స్త్రీలు ఆ రోజుల్లో ఉన్నారంటే నమ్మబుద్ధికాలేదు. చదివితేగాని తెలియలేదు. మహోన్నత శిఖరాలు అందుకున్నారు. "చైతన్య మానవి" 10 సంవత్సరాలు పండుగ జరుపుకున్నందుకు సంతోషంగా ఉంది. ఇంకా ఎందరో మహోన్నత స్త్రీ మూర్తుల గురించి తెలియజేస్తారని ఆశిస్తున్నాను.

**- సి.హెచ్.రమ**

**డియర్ ఎడిటర్! "చైతన్య మానవి"** జులై-సెప్టెంబర్ దశాబ్ది ప్రత్యేక సంచిక ఎంతో ప్రత్యేకంగా ఉంది. ఈసారి ఎక్కువ సంఖ్యలో ఆర్టికల్స్ వచ్చాయి. అవి అన్నీ చాలా బాగున్నాయి. మొదటిగా మహిళలు నడుపుతున్న పత్రికలు నాడు-నేడు చదివాక మన తెలుగులో ఇన్ని పత్రికలు ఉన్నాయా? అనిపించింది. నాటి తొలి పత్రిక "వృత్తాంతి" నేటి "చైతన్య మానవి" వరకూ దాదాపు పాతిక పత్రికలు స్త్రీలకు సంబంధించిన ఎన్నో విషయాలను, సమస్యలను, అనేక సామాజిక అంశాలను వెలుగులోకి తెస్తూ మహిళాభివృద్ధికి ఎంతగానో తోడ్పడుతున్న విషయాలను తెలుసుకున్నాము. కెప్టెన్ లక్ష్మీసెహగల్‌గారి జీవిత విశేషాలు ఎంతో స్ఫూర్తినిచ్చాయి. డాక్టర్‌గా, సమరశీలిగా, స్ఫూర్తిప్రదాతగా, బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన వారే అసలైన చైతన్య మానవి. నాటి సంఘ సంస్కర్తలు దుర్గాబాయి దేశ్‌ముఖ్, గురజాడ అప్పారావు గారి గురించిన ఆర్టికల్స్ చదివాము. మనం సంఘానికి ఏవిధంగా తోడ్పడాలో అర్థమైంది. ఆంధ్రప్రదేశ్ మహిళా సంఘం ఆవిర్భావంలో ప్రధానపాత్రధారులైన మానికొండ సూర్యావతిగారు, మోటూరు ఉదయంగార్ల గురించి ఇచ్చిన విషయాల వలన వారిని గుర్తుచేసుకోవటం అయింది.

ఐద్వా ప్రవేశపెట్టిన ప్రపంచ సంక్షోభం-భారత మహిళలపై ప్రభావం, ఐద్వా ఉద్యమం కొన్ని విశేషాలు, నగదు బదిలీ వద్దు-సరుకులు కావాలి అనే ఆర్టికల్స్ అందరూ చదివితే బాగుంటుంది. మనదేశ ప్రథమ మహిళా శాస్త్రవేత్త థెస్సీథామస్ గురించి చదివాము. వారిని ఆదర్శంగా తీసుకుని ఎక్కువ సంఖ్యలో మహిళా శాస్త్రవేత్తలు తయారవ్వాలని ఆకాంక్షిస్తున్నాము. డాక్టర్ కె.భారతిసాగర్ గారు వ్రాసిన మహిళలు-ఆరోగ్య సమస్యలు అనే ఆర్టికల్ స్త్రీలకు ఎంతో విలువైనది. స్త్రీలకు మెనోపాజ్ స్టేజ్‌లో వచ్చే సమస్యలు, ఆ సమయంలో పాటించవలసిన జీవన విధానాన్ని చాలా చక్కగా వివరించారు. డాక్టర్ గారికి ధన్యవాదములు. జి.వెంకటకృష్ణగారు రచించిన "మూడు దృశ్యాలు" కథ చదువుతున్నంతసేపూ చాలా బాధ కలిగింది. జలయజ్ఞాల్లో సమిధలు కాబోతున్న వారి ఆవేదన, ఆవేశంలో వారి భాషాశైలి, ఎంతో చక్కగా రచించిన విధానం కళ్ళకు కట్టినట్లుంది. వారికి ధన్యవాదములు.

మానవి దశాబ్ది కథల పోటీలో మొదటి, రెండవ, మూడవ బహుమతులు పొందిన కథలు చాలా బాగున్నాయి. ఇంతటి విజ్ఞానదాయకమైన చైతన్యమానవి పత్రికను చదివిన ప్రతి ఒక్కరూ చైతన్యంగా రూపుదిద్దుకుంటారని విశ్వశిస్తూ ఈ పత్రిక సంపాదకులు, సంపాదక వర్గానికి, మహిళా సంఘానికి ధన్యవాదములు తెలుపుతూ..........

**- సావిత్రి, ఉమ, రేవతి,రాజ్యలక్ష్మి**

"చైతన్య మానవి" దశాబ్ది ప్రత్యేక సంచికలో వచ్చిన "అగ్నిపుత్రి" థెస్సీథామస్‌కు జేజేలు అనే వ్యాసంలో మన దేశ ఖ్యాతిని ఇనుమడింప చేసిన కల్పనాచావ్లా, సునీతా విలియమ్స్ కోవకి చెందిన థెస్సీ థామస్ మన భారతీయ ప్రథమ అంతరిక్ష మహిళా శాస్త్రవేత్తను గూర్చి వేములపల్లి సత్యవతిగారు సవివరంగా తెలియజేశారు. అంతరిక్ష విజ్ఞానశాస్త్రంలో మహిళలకు తావు లేని పరిస్థితుల్లో థెస్సీథామస్ సారథ్యంలో అగ్ని-5 విజయవంతంగా నింగికెగరడం మహిళలందరికీ గర్వకారణం. మహిళలందరి తరుపునా ఆమెకు జేజేలు. డాక్టరు సలహాలు శీర్షికలో డాక్టరుగారి సమాధానాలు చాలా ఉపయోగకరంగా ఉంటున్నాయి. "ఓ దీనురాలికథ"లో ఈ తల్లి పడిన బాధ ఎవరికీ వద్దనిపిస్తోంది. ఆడపిల్లలకు కూడా ఆస్తిలో వాటా కల్పించి, వారు కూడా తల్లితండ్రులను వృద్ధాప్యంలో చూసే పరిస్థితులు కల్పిస్తే సమాజంలో పరిస్థితులు బాగుపడతాయి. "మాకొద్దీ చెత్త ప్రోగ్రాములు" అనే అరుణగారి వ్యాసం చాలా బాగుంది. అటువంటి ప్రోగ్రాములప్పుడు వెంటనే ఛానల్ మార్చకపోతే అలాంటి పిచ్చి ప్రోగ్రాములతో మనకే పిచ్చిపట్టేట్టుంది. ఉపద్రష్ట కృష్ణకుమారిగారు వ్రాసిన "మనకెందుకు" కథలో ఆటో డ్రైవర్ యొక్క వికృత మానసిక ప్రవృత్తి చదువరులకు అసహ్యం కలిగిస్తుంది. దేషాన్ని రగిలిస్తుంది. అలాంటి విపరీత మనస్తత్వాలకు కారణం సినిమాలలో మీడియాలో వస్తున్న అశ్లీల కార్యక్రమాలు. అందువలన మహిళలు అలాంటి వాటికి వ్యతిరేకంగా గళం విప్పాలి,ఉద్యమించాలి. మానికొండ సూర్యావతిగారు, దుర్గాభాయ్ దేశ్‌ముఖ్, లక్ష్మీసెహగల్‌గారు ఒక్కొక్కరూ వ్యక్తి కాదు శక్తి అని నిరూపించారు. వారిని గూర్చి మాకు తెలియజేసిన రచయిత్రులకు ధన్యవాదాలు. సంచికలోని వ్యాసాలన్నీ "చైతన్య మానవి" పేరుకు సార్థకత కలిగించేట్లుగా చైతన్యదాయకంగా ఉన్నాయి.

**- కె.శుభ**

మీడియా

# సహజత్వం సబ్జెక్టయితే...?

- కె. అరుణ

**అయ్యగారు కాలర్ ఎగరేశారంటే సుడిగాలే! సారువారు చేయి విసిరితే చాలు నాలుగైదు తలకాయలన్నా ఎగిరిపడాల్సిందే! హీరోయిజాన్ని ఎలివేట్ చేయడమే ఆ సినిమాల ప్రధాన ఎజెండా. ఆ అత్యుత్సాహం వల్ల ప్రేక్షకునికి ఓ విషయం గింజుకున్నా అర్థమైచావదు. ఒంటిచేత్తో వందమందిని అవలీలగా నరికిపారేసే కథా నాయకునికీ, విలన్‌కితేడా ఏంటన్నదే ఆ అనుమానం! అన్నట్లు, విలన్‌కు హీరోయిన్ సొంతం కావాలనుకుంటే అది కామం.**

చాన్నాళ్ల తరువాత ఇంగ్లిష్ వింగ్లిష్ వంటి సినిమా వచ్చి సినీరంగానికి పలు పాఠాలు చెబుతోంది. కథ ఉన్న సినిమాల ప్రాధాన్యతను కళ్లముందు నిలిపింది. నిత్య జీవితాన్ని అలవోకగా తాకిన కథలకు ఆదరణ ఎన్నడూ ఉంటుందని నిరూపించింది. అంతేకాదు, ఇది స్త్రీ ప్రాధాన్యతా చిత్రం. స్త్రీ అంటేనే ఎన్నో అనుభవాల సమాహారం. జీవితంలో ఎదురయ్యే పలు కష్టసుఖాలు, ఎగుడుదిగుళ్లు, మంచి చెడ్డలతో మమేకమైపోవడానికి ఆమె జీవితం చక్కని దృష్టాంతం. అందులో ఇల్లు, బయటి ప్రపంచం రెండూ వుంటాయి. వాటి ప్రభావాలు, పర్యవసానాలు ఉంటాయి అలాంటి మహిళను కథా వస్తువుగా తీసుకోవడమంటే అర్థం వాస్తవిక సమాజంలోని ఓ ముఖ్యాంశాన్ని కథగా అల్లుకోవడం. అందులోని పలు పార్శ్వాలను స్పృశించడం. మరి అందులో సత్తా లేకుండా ఎలా వుంటుంది? అది ప్రేక్షకులను ఆకట్టుకోకుండా ఎలా ఉంటుంది?

స్త్రీ ప్రాధాన్యతా చిత్రమంటే సహజత్వానికి సచిత్ర రూపమని మనం ఏ జంకు గొంకు లేకుండా నొక్కివక్కాణించొచ్చు. కావాలంటే ఉదాహరణలను సాక్ష్యం చేసుకుందాం. ప్రతిఘటన, కర్తవ్యం, అంకురం, ఒసే రాములమ్మ, మౌనపోరాటం, నేటి భారతం, గుప్పెడు మనసు, ఇదికథకాదు, అంతులేని కథ, ఉమ్రావ్‌జాన్, డర్టీ పిక్చర్, కహానీ, ఇష్కియా... చాలా..? ఇంకా కావాలా? వీటన్నింటిలో కథానాయికలంతా అద్భుతమైన నటన కనపరిచారు. విమర్శకుల ప్రశంసలు అందుకున్నారు. వాటితో పాటు అవార్డులూ వారి సొంతమయ్యాయి. ఆయా చిత్రాల కథలు ఓసారి స్మరించుకుంటే మీకిట్టే తెలిసిపోతుంది. వీటిలో నిజ జీవితంలో ఎదురయ్యే పలు అంశాలను కథా వస్తువుగా మలిచారని. వాటిని అందంగా తెరపై తీర్చిదిద్దారని. సినిమా ద్వారా తరుణీమణులకు తావేం చేయాలో రేఖామాత్రంగా చెప్పకనే చెప్పారని! ఇదీ సహజత్వానికి వచ్చే గుర్తింపు.

మరి ఇన్ని మాట్లాడుకున్నాక అసహజసత్వం గురించి మాట్లాడుకోకుంటే ఎలా? అవి అరవీర భయంకరుడైన హీరో గారి గాథలు. ఇక్కడ హంగూ ఆర్భాటం తప్ప నటన అగుపించదు. రక్తపాతం తప్ప కథ ఇసుమంతైనా కానరాదు. అయ్యగారు కాలర్ ఎగరేశారంటే సుడిగాలే! సారువారు చేయి విసిరితే చాలు నాలుగైదు తలకాయలన్నా ఎగిరిపడాల్సిందే! హీరోయిజాన్ని ఎలివేట్ చేయడమే ఆ సినిమాల ప్రధాన ఎజెండా. ఆ అత్యుత్సాహం వల్ల ప్రేక్షకునికి ఓ విషయం గింజుకున్నా అర్థమైచావదు. ఒంటి చేత్తో వందమందిని అవలీలగా నరికిపారేసే కథా నాయకునికీ, విలన్‌కితేడా ఏంటన్నదే ఆ అనుమానం! అన్నట్లు, విలన్‌కు హీరోయిన్ సొంతం కావాలనుకుంటే అది కామం. అదే హీరో సిలిండర్, సోమాలియా దేశానికి బ్రాండ్ అంబాసిడర్, వీత మొహం, కేజీ కండలేదంటూ ఎగతాళి చేస్తే అది చిలిపి తనంతో కూడిన ప్రేమ. ఇక పేరాల కొద్దీ వంశ చరిత్ర వల్లెవేసే రాజకీయాలు వదిలేయడమే బెటర్. ఇన్ని అసహజత్వాలు కలిపి సినిమా తీస్తే అది చతికిలపడక ఛస్తుందా?

సహజత్వానికీ, అసహజత్వానికీ ఓసారి బేరీజు వేసుకుంటే అర్థమైపోతుంది. సినీరంగంలోని రెండు నాల్కల వైఖరి. అన్యాయాన్ని న్యాయం జయించడమే మా సబ్జెక్టని చెబుతుంటారు. తీసేవన్నీ విపరీత ధోరణులు. సినిమా వ్యాపారమైన నేటి రోజుల్లో విలువలకు ఏనాడో తిలోదకాలిచ్చేశారు. మసిపూసి మారేడుకాయ చేసి ప్రేక్షకులను త్రిశంకు స్వర్గంలో నిలుపుతున్నారు. వదో తరగతి ప్రేమాయణాన్ని యధేచ్ఛగా తెరనిండా పరుస్తున్నారు. తెలిసీ తెలియని స్వచ్ఛమైన మనసులను మురికితో కలుషితం చేస్తున్నారు.

మీడియా తల్చుకుంటే ఎంతటి దారుణమైన విషయానికైనా రంగులద్ద గలదు. ఉదాహరణకు నీలిచిత్రాల తారామణి సన్నీలియోన్‌ను శృంగార కథానాయిక అంటూ మనకు సరికొత్తగా పరిచయం చేయగలదు. పొట్టకూటికోసం ఏదో పాపం కష్టపడుతోంది. తప్ప ఆమెను మించిన ఆదర్శ వనిత లేదని బుకాయించగలరు. చాపకింద నీరులా అసభ్య సంస్కృతిని, విచ్చలవిడితనాన్ని సమాజంలో కలిపేయడానికి ఇదో కనిపించని ఎత్తుగడ.

నిజానికి వాస్తవిక కోణం వేరు. మగువకు ఉన్న నిర్వచనం వేరు. అతివ అంటే అబల కాదు. ధైర్యం, సాహసం, తెగింపు, పరిణతి, సృజన, తపన...ఇన్ని కలగలిసిన మేలిమి బంగారు రూపం వనిత. నారి అంటే ఎక్కుపెట్టిన వింటినారి. ఈ లక్షణాలను

**మీడియాకు అసలైన అర్థం జాగృతి. అది సమాజాన్ని కుళ్లి కృశింపచేస్తున్న రాచపుండు లాంటి సమస్యలను కథాంశంగా తీసుకోవాలి. లోపాలను ఎత్తి చూసే అంశాలను చిత్రాలుగా మలచాలి. ప్రజల్లో అవగాహన పెంచాలి. వారిని ప్రశ్నించడానికి ఉన్మత్తులనుచేయాలి. అన్యాయం జరిగితే అడ్డుకునేలా సమాయత్తం చేయాలి. ఇది వారి విధి. సమాజంలో భాగస్వామ్యులైనందుకు వారి కర్తవ్యం.**

అణచివేసి స్త్రీ అంటే లలితం, కోమలం, సున్నితం.. గాడిదగుడ్డు అంటూ చిత్రీకరించడమే నేటి సినిమాల పని. అంతేకాదు, వారి దృష్టిలో ఆడది అంటే అంగడి బొమ్మకాసులు రాల్చే ముద్దుగుమ్మ, నటనకు గీటురాయి. నాయిక ముఖంలో కనిపించే హావభావాలు కాదు. అంగాంగాల ప్రదర్శన. వాటి కదలికలు మాత్రమే!

దీన్ని సవాలు చేస్తూ 'ఇంగ్లీష్ వింగ్లీష్' వచ్చింది. తల్లిగా, చెల్లిగా, ఇల్లాలిగా బాధ్యతలు నెరవేర్చుతూనే.. బయటా రాణిస్తున్న మహిళలను కథగా మలుచుకోమని ఉద్బోధించింది. కథ కోసం కంచిలో వెతకొద్దు. ఇవేజిలంటూ ఆకాశానికి ఎగరొద్దు. చూడాలేకానీ, మీ కళ్లముందే ఎన్నో అంశాలున్నాయని నొక్కిచెప్పింది. దీనివల్ల ప్రేక్షకుల ఆదరణతోపాటు లాభాలు సొంతమయ్యాయని రుజువుచేసింది. ఇంగ్లీష్ వింగ్లీష్ దర్శకురాలు గౌరీషిండే కథ ఎక్కడి నుండో కల్పించలేదు. తన కళ్లెదురుగా కనిపించిన తన తల్లి సమస్యనే కథాంశంగా తీసుకుంది. అభినయ తారక శ్రీదేవితో దాన్ని దృశ్యకావ్యంగా మలిచింది. నేటి సినిమాకు సరికొత్త మార్గాన్ని చూపింది.

దానాదీనా చెప్పొచ్చేదేమంటే... మీడియాకు అసలైన అర్థం జాగృతి. అది సమాజాన్ని కుళ్లి కృశింపచేస్తున్న రాచపుండు లాంటి సమస్యలను కథాంశంగా తీసుకోవాలి. లోపాలను ఎత్తి చూపే అంశాలను చిత్రాలుగా మలచాలి. ప్రజల్లో అవగాహన పెంచాలి. వారిని ప్రశ్నించడానికి ఉన్ముత్తులనుచేయాలి. అన్యాయం జరిగితే అడ్డుకునేలా సమాయత్తం చేయాలి. ఇది వారి విధి. సమాజంలో భాగస్వామ్యులైనందుకు వారి కర్తవ్యం.

అందుకే... అతివ అంతరంగంలోకి చూడండి. ఆమె ఎదుర్కొంటున్న సవాళ్లను కథా వస్తువుగా చేసుకోండి. సహజత్వాన్ని వాస్తవికతనూ మేళవించి మేలిమి బంగారంలాంటి సినిమాలు తీయండి. కాసులతో పాటూ కీర్తినీ మూటకట్టుకుని నాలుగు కాలాలపాటు వీక్షకులకు గుర్తుండిపోండి. •

# కదిలే అక్షర ఝరి ప్రసాదమూర్తి

అక్షరాలా! అవి కానేకావు!!
అమ్మ బిడ్డకు పెట్టే
పాలబువ్వలే అవి!
గూటిలోని చిట్టిపిట్టకు
తల్లి అందించే చిన్ని పొరకలే అవి!!

కవిత్వమంటే
అర్థం కాని అల్లిబిల్లి పదాల
ఆరబోతలే అనుకునేవాళ్ళకు
అమ్మ చంటిబిడ్డకు నేర్పే ముద్దుమాటల్లా...
మాస్టారు విద్యార్థికి చెప్పే
నీతి సూత్రంలా....
ప్రకృతి మనిషికి తెలిపే
జీవిత పాఠంలా ఉంటాయా కవితలు

అమ్మ గురించి అమ్మలాంటి ఊరు గురించి,
సుదూర తీరాలనుండి వచ్చే స్నేహితుడి
రాకకు పలికే స్వాగతం,
చిత్రవధలననుభవించి
జీవిత చిత్రాన్ని మార్చి రాసుకున్న చెల్లి
గురించీ
రాసిన కవితలైనా....

బెంగాల్ దీదీ నియంత పోకడైనా....
జీవ వైవిధ్యం పేరుతో ప్రభుత్వాలకు చేసే
అక్షర హెచ్చరికలైనా.....
నాయకుల అవినీతిని ఎండగట్టి
ప్రజలకు చేసే మేలుకొలుపులైనా....
కవిత్వానికే కొత్త ఒరవడి తెచ్చిన
యుగకర్త శ్రీశ్రీ గురించిన
కార్యక్రమాలైనా...
సందర్భం ఏదైనా సరళిలో
వాడి వేడి ఏమాత్రం తగ్గదు
ప్రసాదమూర్తి అంటే
అపురూపమైన ఆణిముత్యాల్లాంటి
అక్షర వెల్లువే మనల్ని పలకరిస్తున్నట్టే
ఉంటుంది

విభిన్న తత్వాల్ని
అవలీలగా అవపోసన పట్టి
రాసిపడేసే గుణం అ కలానికి పరిపాటే!!
ఆ సమర్థత, చాతుర్యమూ
కలగలసిన మా 'కలనేత'కు
డాక్టరేటైనా, నందులైనా
విశాల భారతి పురస్కారమైనా
మరేదైనా సరే
ఏ దిక్కునుండైనా దిశ మళ్ళించుకుని
ఆ అక్షర మాలలకు
అలంకారమైపోవాల్సిందే మరి!!
ఆ శారదా తనయుడికి
వచ్చీరాని పదాలను ఏర్చి కూర్చి
అల్లి అందిస్తున్న ఈ అక్షర హారం!!

**(అక్టోబరు 13న ఢిల్లీ తెలుగు అకాడమీ నుండి విశాల భారతి పురస్కారాన్ని అందుకున్న డాక్టర్ బి.ప్రసాదమూర్తికి చైతన్య మానవి అభినందనలతో.....)**

**- మైలవరపు నాగమణి.**

# ఉద్యమాల బాటలో

## వంట మీద కూడా నియంత్రణా?


హైదరాబాద్

డీజిల్, పెట్రోల్ ధరలు పెంచడంతోపాటు వంట మీద కూడా నియంత్రణ విధించిందీ ప్రభుత్వం. సంవత్సరానికి 6 సిలిండర్లకు మాత్రమే సబ్సిడీ ఇస్తామనీ, ఇంకా కావలసివస్తే బహిరంగ మార్కెట్‌లో కొనుక్కోవలసిందే అని కేంద్ర ప్రభుత్వం ప్రకటించింది.



అనంతపురం

వంట గ్యాస్‌పై సీలింగ్‌ను రాష్ట్ర వ్యాప్తంగా సామాన్య, మధ్య తరగతి ప్రజలు తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారు. అన్ని జిల్లాల్లో ఐద్వా ఆధ్వర్యంలో రాస్తారోకోలు, ప్రదర్శనలు, ధర్నాలు నిర్వహించారు. రాష్ట్ర ప్రభుత్వమైనా ఆ భారాన్ని భరించి ప్రజలకు గతంలో లాగానే గ్యాస్ సరఫరా చెయ్యాలని డిమాండ్ చేస్తున్నారు.

## మహిళలపై హింస ఏలేవాడికి పట్టదా?

దేశ వ్యాప్తంగా మహిళలపై జరుగుతున్న హింసను అరికట్టాలని కోరుతూ ఐద్వా, పిఓడబ్ల్యు, ఎ.పి. మహిళా సమాఖ్య, మహిళా సత్తాల ఆధ్వర్యంలో లిబర్టీ వద్ద అంబేద్కర్ విగ్రహం వద్ద ధర్నా, రాస్తారోకో నిర్వహించడమైంది. అనంతరం హోమ్ మినిస్టర్ సబితా ఇంద్రారెడ్డికి వినతిపత్రం సమర్పించాము.

ప్రతి 22 నిమిషాలకు ఒక మహిళపై అత్యాచారం. ప్రతి 76 నిమిషాలకు ఒక బాలిక రేప్. మూడు దశాబ్దాల వ్యవధిలో అత్యాచారం కేసులు 8/73శాతం పెరిగాయి. కానీ ప్రతి నాలుగు కేసుల్లో ఒక్క కేసులోనే దోషులకు శిక్ష పడుతుంది. ఇది నేషనల్ క్రైమ్ రికార్డ్స్ బ్యూరో వెల్లడించిన సమాచారం. ఇక సామాజిక, ఇతర కారణాలవల్ల నమోదు కాకుండా ఉన్న రేప్‌ల సంఖ్య మరెంతో?

దేశ వ్యాప్తంగా 2011 సంవత్సరం నుండి 2012 జూన్ వరకు మహిళలపై నేరాలు 2,28,650 నమోదు అయితే ఆంధ్ర ప్రదేశ్ 28,246 మహిళలపై నమోదయిన నేరాలతో రెండవ స్థానంలో నిలిచింది. ఈ మధ్య కాలంలో జరిగిన చిత్తూరు, ప్రకాశం, హైదరాబాద్‌లలో మహిళలపై జరిగిన అత్యాచారం, హత్య ఘటనలే ఇందుకు నిదర్శనం. నిన్న మొన్నటి వరకు దేశ రాజధాని ఢిల్లీలో రోజుకో అత్యాచారం వెలుగుచూడగా, ఇప్పుడు ఆ పక్కనే ఉన్న హర్యానా వంతయింది. అత్యాచారం కేసులు హర్యానాలో ఈ కాలంలో గణనీయంగా నమోదవుతున్నాయి. నెలరోజుల్లోనే 19 సామూహిక అత్యాచార ఘటనలు జరిగాయి. మధ్య ప్రదేశ్, పశ్చిమ బెంగాల్, ఉత్తర ప్రదేశ్, అస్సాం రాష్ట్రాలు ఆ బాటనే నడుస్తున్నాయి. మహిళలపై పెరుగుతున్న నేరాలు ఆందోళనకరంగా ఉన్నాయని సుప్రీం కోర్టుకూడా వ్యాఖ్యానించింది.

మహిళలపై జరుగుతున్న హింస గురించి కేంద్ర ప్రభుత్వం కానీ ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు కానీ నోరు మెదపడంలేదు. పైగా వివిధ రాజకీయ పార్టీల నాయకులు, ప్రజా ప్రతినిధులు వాళ్ళకు నచ్చిన బాష్యం చెబుతున్నారు. "చదువుకుంటే ఉన్న మతిపోయిన చందంగా" కేంద్ర కేబినెట్‌లో పనిచేసిన మాజీ మంత్రి రేణుకా చౌదరి 'ఇదేమైనా శాంతి భద్రతల సమస్యా, చర్చించడానికి?" అని సెలవిస్తున్నారు. మహిళలపై హింసకు సంబంధించిన సమస్య శాంతి భద్రతలతో ముడిపడినదని అమాత్యులకు తెలియదా? పశ్చిమ బెంగాల్ మహిళా ముఖ్యమంత్రి మమతా బెనర్జీ " మహిళలకు స్వేచ్ఛ ఎక్కువై రాసుకు పూసుకు తిరగటం వలన అత్యాచారాలు జరుగుతున్నాయని" శలవిచ్చారు. రాష్ట్రంలో రోజు రోజుకీ పెరుగుతున్న నేరాలను అదుపు చేయలేక బాధ్యతారహితంగా మాట్లాడుతున్నారు. ఇక అత్యాచారాలకు విరుగుడు బాల్య వివాహాలే

అని హర్యానా ఖాప్ పంచాయితీ పెద్దలు తాఖీదులిస్తున్నారు. మరో మాజీ ముఖ్యమంత్రి చౌతాలా గారు దానిని సమర్ధిస్తున్నారు. బాలికల వివాహ వయస్సును 16 సంవత్సరాలకు తగ్గించాలని, అప్పుడు వారు లైంగిక అవసరాల కోసం అడ్డదారులు తొక్కరని అశాస్త్రీయ కొత్త సూత్రాలకు తెరతీస్తున్నారు. ఇది పురోగమనమా? తిరోగమనమా? బాధ్యతాయుతమైన మంత్రులు, ప్రజా ప్రతినిధులు ఇటువంటి వ్యాఖ్యలు చేయడం సిగ్గుచేటు.

సమాజంలో బాల్య వివాహాలు అరికట్టడానికి అనేక మంది సంఘ సంస్కర్తలు పోరాట కృషి ఫలితంగా బాల్య వివాహ నిరోధక చట్టం వచ్చింది. దేశ వ్యాప్తంగా మహిళలపై పెరుగుతున్న హింసను అరికట్టి మహిళలకు రక్షణ కల్పించడం లేదు. ఏళ్ళ తరబడి కోర్టుల చుట్టూ తిరిగినా నేరస్థులకు శిక్ష పడటం లేదు. మహిళలపై దుర్మార్గమైన ఘటనలు జరిగినపుడు త్వరితగతిన విచారణ పూర్తి చేసి నిందితులకు శిక్ష పడేట్లు ఫాస్ట్ ట్రాక్ కోర్టులు ఏర్పాటు చేయాలని ఎప్పటినుండో మహిళా సంఘాలు పాలకులకు మొరపెట్టుకుంటున్నా వారి చెవికెక్కడం లేదు. దేశవ్యాప్తంగా తగ్గుతున్న స్త్రీ, పురుష నిష్పత్తి కూడా మహిళలపై హింస పెరగడానికి ఒక కారణమవుతుంది. బాలికల శాతాన్ని పెంచటానికి ప్రభుత్వం తీసుకున్న చర్యలేవి? రాజ్యాంగ విరుద్ధంగా తీర్పులు ఇస్తున్న ఖాప్ పంచాయితీ పెద్దల ఆగడాలు అరికట్టడానికి సమగ్ర శాసనం చేయాలని ప్రభుత్వాన్ని మహిళా సంఘాలు డిమాండ్ చేస్తున్నాయి. రాష్ట్రంలో మహిళా కమిషన్‌కు చైర్‌పర్సన్, సభ్యుల నియామకం జరగక 7 సంవత్సరాలు అయింది. రాష్ట్ర హైకోర్టు ఆదేశించినప్పటికీ ప్రభుత్వం నుండి ఎటువంటి స్పందనలేదు.

సమాజంలో సగభాగమైన మహిళల రక్షణకు సమగ్రమైన చర్యలు తీసుకోనట్లయితే పెద్ద మూల్యమే చెల్లించుకోవలసి ఉంటుంది.

**మోటూరు ఉదయంకు జోహార్లు:-**




ఐద్వా నిర్మాతల్లో ఒకరైన మోటూరు ఉదయం జయంతి అక్టోబరు 13వ తేది హైదరాబాద్ నగర కమిటీ ఆధ్వర్యంలో జరిగింది. మహిళలపై జరుగుతున్న నేరాలను అరికట్టాలని, ప్రభుత్వం మహిళలకు రక్షణ కల్పించాలని ఈ సందర్భంగా మాట్లాడిన వక్తలు డిమాండ్ చేశారు. అట్లాగే హర్యానాలో పెరుగుతున్న సామూహిక అత్యాచారాల పట్ల ఆందోళన వ్యక్తం చేసింది. హర్యానాలో రాజ్యాంగానికి, చట్టాలకు సమాంతరంగా నడుపుతున్న ఖాప్ పంచాయితీల ఆగడాలను అరికట్టాలని సమావేశంలో వక్తలు అభిప్రాయపడ్డారు.

**బతుకమ్మ సంబరాలు:-**




ప్రకృతిలో మానవుడి మమేకతకు, పూచే పువ్వు, మనిషి నవ్వు మధ్య అల్లుకున్న బంధానికి, పుట్టినింటితో, తోబుట్టువులతో ఆడపిల్ల అనురాగానికి, ఇరుగింటి, పొరుగింటి అనుబంధానికి కుటుంబ సౌభాగ్యానికి అద్దంపట్టు అపురూపమైన సామాజిక సంబరాల ఉత్సవం బతుకమ్మ పండుగ.

బతుకమ్మ పండుగ సందర్భంగా ఐద్వా ఆధ్వర్యంలో మహిళలకు శుభాకాంక్షలు తెలియజేయడంతోపాటు ఆడపిల్లలను కాపాడుకుందాం" అనే సందేశాన్ని తెలిపే బ్యానర్లు కట్టి మహిళలతో కలిసి ఆడిపాడి ఆనందాన్ని పంచుకున్నారు.

**ఆడపిల్లల నిష్పత్తి తగ్గుదలపై:**

దేశ వ్యాప్తంగా ఆరేళ్ళలోపు బాలబాలికల నిష్పత్తి ఆందోళకరంగా పడిపోతుంది. 2011 జనాభా లెక్కల ప్రకారం దేశంలో సగటున 1000 : 924గా వుంది. మన రాష్ట్రంలోని కొన్ని గ్రామాలలో నిష్పత్తి దారుణంగా పడిపోయింది. నల్గొండ జిల్లా మునుగోడు నియోజకవర్గం చిట్యాల మండలంలోని 14 గ్రామాల్లో ఐద్వా ఆధ్వర్యంలో సర్వే జరిగింది.

**మోటూరు టాన్యా ప్రథమ వర్ధంతి సభ:**



డా॥ మోటూరు టాన్యా ప్రథమ వర్ధంతి సందర్భంగా అక్టోబరు 26ను హైదరాబాద్‌లోని సంతోష్‌నగర్‌లో క్యాన్సర్‌పై అవగాహన సదస్సు జరిగింది. మల్లు స్వరాజ్యం అధ్యక్షతన జరిగిన ఈ సదస్సులో ప్రముఖ సర్జికల్ అంకాలజిస్ట్ డా॥ చంద్రశేఖర్ రావుగారు మాట్లాడుతూ రొమ్ము క్యాన్సర్, సర్వైకల్, థైరాయిడ్ క్యాన్సర్‌లు మహిళలకు ఎక్కువగా వస్తున్నట్లు, వాటిని ప్రాథమిక దశలోనే ఎలా గుర్తించవచ్చునో వివరించారు. మహిళలు అడిగిన అనేక ప్రశ్నలకు సమాధానాలు ఇచ్చారు. ఆహార పంటలకు రసాయినాలు వాడకం, పర్యావరణం ప్రధాన కారణాలుగా ఉన్నాయని, మనం వీటినుండి రక్షించబడటానికి ఎటువంటి జాగ్రత్తలు తీసుకోవలసి ఉందో వివరించారు.

**ఎంజిఎం, రుయా ఆస్పత్రుల ముందు ధర్నాలు:**

వరంగల్లు ఎంజిఎం ఆసుపత్రి 1000 పడకలతో 4 జిల్లాలకు కేంద్రంగా ఉంది. బడ్జెట్ లేక ఆసుపత్రిలో వైద్య సౌకర్యాలకు తీవ్ర కొరత ఏర్పడి పసిపిల్లలు పిట్టల్లా రాలిపోతున్నారు. వెంటిలేటర్ కొరత, ఇతర పరికరాలు, మందులు లేకపోవడంతో పాటు వైద్యుల నిర్లక్ష్యం కూడా దానికి తోడై 6 నెలల్లో 300మంది పిల్లలు చనిపోయారు. ఐద్వా వరంగల్లు జిల్లా కమిటీ ఆసుపత్రిలో మరియు పేషెంట్స్ వద్ద సర్వే నిర్వహించి అనేక వివరాలు రాబట్టింది. ఆసుపత్రి ముందు మొదటిసారి 700 మందితో, రెండవసారి 450 మందితో ఆసుపత్రి ముందు ధర్నా నిర్వహించింది. ప్రభుత్వం బడ్జెట్‌ను వెంటనే రిలీజ్ చేయాలని డిమాండ్ చేసింది.

తిరుపతి రుయా ఆసుపత్రిలో వైద్య సౌకర్యాలు మెరుగు పరచాలని, తిరుపతి పట్టణ కమిటీ ఆధ్వర్యంలో ధర్నా జరిగింది. ఐద్వా ఆందోళన ఫలితంగా మంత్రుల బృందం 2 ప్రాంతాలలో ఆసుపత్రులను సందర్శించి బడ్జెట్‌ను కూడా రిలీజ్ చేసింది.

**మహిళా ప్రయాణికుల సమస్యలపై:**

హైదరాబాద్ నగరంలో ఆర్టీసి బస్సులలో ప్రయాణించే మహిళలు నిత్యం అనేక సమస్యలు ఎదుర్కొంటున్నారు. వాటిని పరిష్కరించే చర్యలు చేపట్టాలని ఐద్వా నగర కమిటీ ఆర్టిసి ఎం.డి. ఎ.కె. ఖాన్ గారిని కలిసి వినతిపత్రం అందజేసింది. మహిళలకు ప్రత్యేకంగా 40% సీట్లు కేటాయించి, వికలాంగులకు, వృద్ధులకు ప్రత్యేకంగా కేటాయించాలని, ఆ సీట్లు ప్రత్యేక రంగులతో గుర్తించేవిధంగా ఉండాలని, అన్ని రూట్లలో లేడీస్ స్పెషల్ బస్సులను నడపాలని కోరింది. ప్రతినిధి బృందం చెప్పిన సమస్యలు విన్నఎ.కె. ఖాన్ వెంటనే చర్యలు తీసుకుంటానని వారికి హామీ ఇచ్చారు. ఆ మేరకు అక్టోబరు 16వ తేదీన ఉద్యోగులతో సమావేశం జరిపి అమలు దిశగా చర్యలు చేపట్టారు. ఐద్వా ఆందోళన ఫలితంగా సాధించిన విజయమిది.

**మద్యంపై :**






విశాఖ

విశాఖ నగరం అరిలోవ ప్రాంతంలో ఎస్.కె.ఎం.ఎల్ వైన్‌షాపు తొలగించాలని ఐద్వా ఆధ్వర్యంలో స్థానిక మహిళలు, గ్రామ సంఘాల సహకారంతో 100 రోజులపాటు ఉద్యమం సాగింది. ప్రదర్శనలు, ధర్నాలు, రాస్తారోకోలు వివిధ ఆందోళన కార్యక్రమాలు చేసిన ఫలితంగా చివరికి యాజమాన్యం షాపును వేరేచోటికి తరలించారు. అక్కడ కూడా నిరసనలు కొనసాగిన అనంతరం అక్కడ నుండి కూడా షాపుని తరలించడం జరిగింది.

## మానవి దశాబ్ది ప్రత్యేక సంచిక:



చైతన్యమానవి దశాబ్ది ప్రత్యేక సంచిక విడుదల ఆగస్టు 14వ తేదీన ప్రముఖ రచయిత అంపశయ్య నవీన్ గారు ఆవిష్కరించారు. ఎస్.పుణ్యవతి అధ్యక్షతన జరిగిన ఈ సభలో ప్రముఖ రచయిత్రి వకుళాభరణం లలిత, తెలుగు అకాడమీ మాజీ డైరెక్టర్ డాక్టర్ బి.విజయభారతి, ఐద్వా గౌరవాధ్యక్షులు మల్లు స్వరాజ్యం గారు పాల్గొన్నారు. చైతన్య మానవి పత్రికను పదేళ్ళపాటు అవిఘ్నంగా నడిపిన ఐద్వాకు ధన్యవాదములు తెలుపుతూ మహిళలకంటూ ప్రత్యేక ప్రతికలు చాలా తక్కువ సంఖ్యలో ఉన్నాయని, ఇటువంటి పత్రికలు రావలసిన అవసరం ఎంతైనా ఉందని వక్తలు మాట్లాడారు.

## మహిళలు - సోషలిజం గ్రంథ ఆవిష్కరణ

ఆగస్ట్ బెబెల్ రచించిన మహిళలు - సోషలిజం గ్రంథాన్ని తెలుగులోకి అనువదించి ఐద్వా రాష్ట్ర కమిటీ ముద్రించింది. నవంబర్ 5న ఐద్వా కార్యదర్శి స్వరూపరాణి అధ్యక్షతన జరిగిన



సభలో హెచ్ఎంటివి అధినేత కె.రామచంద్రమూర్తి గ్రంథాన్ని ఆవిష్కరించగా పుస్తకం ప్రాముఖ్యతను సిపిఎం రాష్ట్ర కార్యదర్శి బి.వి.రాఘవులు గారు వివరించారు. ఈ సభలో మల్లుస్వరాజ్యం, ఎస్.పుణ్యవతి, అనువాదకులు డాక్టర్ నళిని, సరోజిని తదితరులు పాల్గొన్నారు.



అంబర్‌పేట్ జోన్‌లో కాచిగూడ వద్ద రేషన్ షాపులో సరుకులు నెల మొత్తం ఇవ్వాలని ధర్నా



సినిమాలలో వస్తున్న అశ్లీల, అసభ్య, ద్వంద్వార్థాలకు వ్యతిరేకంగా ఐద్వా, డివైఎఫ్ఐ ఎస్ఎఫ్ఐ కలసి సెన్సార్ బోర్డు డైరెక్టర్ ధనలక్ష్మికి మెమోరాండం




# 'నిర్జన వారధి'...

## ఓ ధీశాలి ఒంటరిపోరాటం

**చ**రిత్ర ఎన్నో పాఠాలు చెబుతుంది. ఎన్నో విశేషాలను కళ్లముందు నిలుపుతుంది. అదే ఆత్మకథ అయితే దృశ్యం మరో రకంగా ఉంటుంది. ఆత్మకథ పలు అనుభవాల గుచ్ఛం. ఎన్నో సంఘటనల మేళవింపు. అలాంటి ఆత్మకథ ఉద్యమంలో పూలలో దారంలా కలిసిపోయిన అతివదైతే! అది మరిన్ని లోతులను స్పృశిస్తుంది. కొండపల్లి కోటేశ్వరమ్మ కన్నీరే అక్షరాలుగా పరుచుకున్న 'నిర్జన వారధి' అలాంటిదే! ఉద్యమకారిణి, రచయిత్రి, కళాకారిణి, అమ్మ... ఇన్ని పార్శ్వాలు ఒక్కరిలో కొలువుండటం అరుదైన విషయం. ఒక జీవితంలో ఇన్నిమలుపులు, అగడ్తలు, కడగండ్లు, చిక్కుముడులు ఉండటమూ అంతే అరుదు. వాటిని తట్టుకుని ఆత్మస్థైర్యమే తోడుగా జీవనయాత్ర సాగించడమంటే సామాన్యమైన విషయం కాదు. ఉద్యమాలే ఊపిరిగా రాటుదేలిన కోటేశ్వరమ్మ వంటి వారికే అది సాధ్యం! జీవితం, ఉద్యమం మమేకమైతే ఎలా వుంటుందంటే అచ్చం 'నిర్జన వారధి'లా! తెర వెనుక కనిపించని సజీవ చిత్రణకు రూపమేదంటే కొండపల్లి కోటేశ్వరమ్మ అంతరంగంలా!

'నిర్జన వారధి' అతికినట్లున్న శీర్షిక. ఇందులోని సంఘటనలన్నీ హృదయాన్ని తడిమేవే! చదువరుల గుండెను మెలిపెట్టేవే! నిండుకుండ తొణికినపుడు జాలువారే నీటిలా ప్రతి పేజీలోనూ కోటేశ్వరమ్మ ఆవేదన అంతర్లీనంగా ప్రవహిస్తుంది. గుండె గొంతుకలో కొట్టుకులాడేలా చేయడమే కాదు. ఒక్కోచోట మనసంతా కెలికినట్లవుతుంది.

కోటేశ్వరమ్మ జీవితం జాతీయోద్యమం, విప్లవోద్యమం రెండింటితో ముడిపడింది. ఆ కాలంలోనే ఇంతటి సాహసం, స్థిరత్వం, పరిపక్వత ఉండటం విస్మయపరిచే అంశం. సున్నితమైన స్త్రీలో కానొచ్చే స్థితప్రజ్ఞత అచ్చెరువొందించే విషయం. పసి వయసు నుండీ ఆమె సావాసం వెతలతోనే! స్వయానా కోటేశ్వరమ్మ తల్లి అంజమ్మ 'నువ్వు జీవితమంతా ఏడవడానికే పుట్టావా' అని రోదించిందంటే ఆ తల్లిపేగు ఎంత తల్లడిల్లి ఉండాలి? 'కష్టాలు మనుషులకు కాక మానులకు వస్తాయా' అన్న మాట నిజమే కావచ్చు. కానీ మనిషిని, మనసునూ నలిపేసేంత మలుపులా?

బాల్యంలోనే వితంతువనే గరళాన్ని దిగమింగినా...గాంధీజీ పిలుపుపై ఒంటిపై నగలన్నీ ఇచ్చేసినా..దేశభక్తి గీతాలకు బదులుగా ఉద్యమ స్ఫూర్తి రగలించే పాటలనే కైదండగా చేసుకున్నా...ఉద్యమంలో భాగస్వాములవ్వాలని సీతారామయ్యనువివాహం చేసుకున్నా...రహస్య జీవితంలో దేశమంతా చుట్టినా...అపరిచితులకు అమ్మలా అన్నం పెట్టినా...గుండె రాయి చేసుకుని కన్నబిడ్డలకు దూరంగా బతికినా...ఉద్యమం కోసం నగలన్నీ ఒలిచిచ్చినా... గాలి కొదిలేసి భర్త తన దారి తాను చూసుకున్నా...నీవల్ల కాదంటూ బిడ్డలను తనతో ఉంచేసుకున్నా.. వద్దనుకున్న చదువును తిరిగి బాసటగా చేసుకున్నా.. ఎవరి సాయమూ ఆశించక సొంతకాళ్లపై బతకాలనుకున్నా...హాస్టల్ వార్డెన్‌గా బాధ్యత నెరవేర్చినా.. పిల్లలిద్దరినీ అర్ధంతరంగా కోల్పోయినా.. 36 ఏళ్ళ తరువాత నీడకోసం వచ్చిన భర్తను నిగ్గదీసినా.. వృద్ధాశ్రమంలో రోజులు గడిపినా... నేడు మనమరాళ్లతో చివరి మజిలీకి చేరుకున్నా... అన్నిటి వెనుకా ఒకటే ఆత్మ విశ్వాసం... ఆడది అబల కాదు. సబల అని మనసావాచా నమ్మడమే!

ఈ పుస్తకం ప్రజాశక్తి ఆవిర్భావం, ఆలిండియా రైతు మహాసభ, కృష్ణా కాలువ పూడిక, తెలంగాణా పోరాటం, రహస్య జీవితం, పార్టీ చీలిక, ప్రజానాట్యమండలి ప్రస్థానం, అంటరానితనం వంటి ఘట్టాల కలయికే కాదు. నిష్కల్మషమైన సుందరయ్య మనస్తత్వం, రాజేశ్వరరావు మంచితనం, మానికొండ సూర్యావతి ఆత్మీయత, చంద్రంగారి చేదోడు వాదోడు, ఉదయంలోని తెగువ, కార్యకర్తల కఠోరదీక్ష, కోటేశ్వరమ్మ తల్లి అంజమ్మ త్యాగనిరతి..కటువైన నిజాలు, త్యాగాల సమాహారం.

'నిర్జన వారధి' పఠనం మదిని హత్తుకుంటుంది. కలిపి పయనింపజేస్తుంది. ఆ ఆవేదనలో మనలనూ భాగస్వాములను చేస్తుంది. తట్టుకోలేక మనసు అవిసిపోతుంది. ఇందులో ఆమె వ్యక్తం చేసిన కొన్ని వ్యక్తిగత అభిప్రాయాలను చర్చించేకన్నా... దీన్ని ఒక ధీశాలి ఒంటరిపోరాటంగా తీసుకోవడం ఉత్తమం.

కోటేశ్వరమ్మ ఆదినుంచీ చుక్కానిగా చేసుకున్న సాహిత్యం... ఆటుపోట్ల నడుమ జీవననావ సాగినా సేదతీరడానికి ఆద్యంతం తోడ్పడింది. ఆలోచనలో, ఆచరణలో ఆ పరిణతి నీడలా తోడైంది. ఒకానొక సమయంలో ఆమెను అక్షరాలే సేదతీర్చాయి. లేకుంటే ఇన్ని ఈతి బాధలను ఎదుర్కోవడం ఎంత కష్టం!

నమ్మిన ఆశయం కోసం కోటేశ్వరమ్మ చూపిన అంకితభావంలో లేశమంతైనా ఈ పుస్తకం ద్వారా మనకు ఒంటబడితే నిస్వార్థ దృక్పథానికి అది బాటలు వేస్తే... సమాజ పురోగతికి నేను సైతం అన్న వాస్తవం మనసుకు స్ఫురిస్తే.. అంతకన్నా ఇంకేం కావాలి?

– కె.ఎ.

"CHAITANYA MANAVI R.No. APTEL/2006-2000



# స్త్రీ జనోద్ధరణ

స్త్రీల అభ్యుదయాన్ని నిజంగా కాంక్షించిన మహనీయుడు డాక్టర్ బాబా సాహెబ్ అంబేద్కర్. కుటుంబ వ్యవస్థలో స్త్రీలకు కొన్ని హక్కులు కల్పిస్తూ తయారుచేసిన హిందుకోడ్ బిల్లును పార్లమెంటులో ఆమోదింపచేయటానికి ఆయన ఎంతో ప్రయత్నించారు. ఎన్నో అవమానాలు సహించి మంత్రి పదవిలో కొనసాగాడు. చివరకు ఆ సమస్య గురించే మంత్రి పదవిని కూడా తృణప్రాయంగా వదులుకున్నారు.

భార్య భర్తకు బానిసగా కాకుండా సహచరిగా, మిత్రురాలిగా ఉండాలన్నారు అంబేద్కర్. సమ సమాజంలో స్త్రీల పాత్రను గుర్తించిన అంబేద్కర్ వారి శ్రేయస్సుకు ఎన్నో మార్గాలు సూచించేవారు. దేశంలో చాలాచోట్ల స్త్రీల సమాజాలు ఆయనను ఆహ్వానించి సలహాలు పొందుతుండేవి. 1942లో రోహిదాస్ తరుణ్ సుధారక్ సంఘం స్త్రీల విభాగానికి ఆయన ప్రారంభోత్సవం చేశారు ( ఏప్రిల్ 19) నాగపూర్ దళిత మహాసభలో ప్రత్యేకంగా దళిత స్త్రీల సమావేశాన్ని ఏర్పాటు చేశారు. అమేథీకి చెందిన శ్రీమతి సులోచనాబాయి డోంగ్రే ఆనాటి సభకు అధ్యక్షురాలు. ఈ సమావేశంలో మాట్లాడుతూ, అంబేద్కర్ సమాజ ప్రగతికి స్త్రీలు ముందుకు రావలసిన అవసరం, స్త్రీల వల్ల మాత్రమే జరిగే కార్యకలాపాలు, వాటి ప్రాముఖ్యం వంటివి వివరించారు.

స్త్రీలకు విద్యావకాశాలు కలిగించడానికి అంబేద్కర్ ఎంతో ప్రయత్నం చేశారు. ఆయన నేతృత్వంతో ఏర్పడిన "పీపుల్స్ ఎడ్యుకేషన్ సొసైటీ" బాలికలకు విద్యావకాశాలు కల్పించింది. ముఖ్యంగా ఔరంగాబాద్‌లో బాలికలు చదువుకోవలసిన అవసరాన్ని గురించి ఈ విద్యాసంస్థవారు చాలా ప్రచారం చేశారు. విద్యా సంస్థలకు బాలికలు పరదాలో వచ్చిపోయే ఏర్పాట్లు, ప్రయాణ సౌకర్యాలు, తరగతి గదులలో వేరే ప్రవేశద్వారాల ఏర్పాటువంటివి చేసి వారిలో విద్యాభిరుచి పెంపొందించారు. మూఢాచారాల నుండి బయటపడాలని ఆయన స్త్రీలకు పదే పదే చెప్పేవారు. మారుతున్న సమాజంతోపాటుగా పద్ధతులు మార్చుకోవాలనీ, హేతుబద్ధంగా ఆలోచించాలనీ అనవసరమైన ఆర్భాటాలు తగ్గించుకోవాలని, ప్రగతిమార్గంలో ఎన్ని ప్రతిబంధకాలు వచ్చినా ముందంజ వేస్తూ సాగిపోవాలని అంబేద్కర్ స్త్రీలకు చెప్పారు.

**( డిసెంబరు 6, అంబేద్కర్ వర్థంతి సందర్భంగా)**

Printed & Published by Mallu Swarajyam, Published at AIDWA State Office, Block No.24, HIG, Phase-II, 1-8-1, Baghlingampally, Hyderabad -500 044. Printed at Prajasakti Daily Printing Press, M.H.Bhavan, Plot No.21/1, Azamabad Industrial Area, Near RTC Kalyanamandapam, Hyderabad - 500 020. Ph: 27665420. Editor : T.Jyothi



# మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | CMVQA 187 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 21/8/23 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | sandhya |
| పేజీలు విడదీసినది | sandhya |
| స్కాన్ చేసినది | Sandhya |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |